డిసెంబరు 2012

రూ. 10/-

# చతుర



వారెవ్వా!

# నెత్తుటి మడుగు!?

సెనెగల్ రాజధాని డాకార్ నగరానికి సమీపంలోగల ఈ రెట్బా కొలనులోని నీళ్లు ఓ రకం బ్యాక్టీరియా కారణంగా ప్రతిరోజూ గులాబీ రంగునుంచి గాఢమైన ఎరుపులోకి మారుతుంటాయి. ఉదయాన లేతరంగులో ఉండే నీరు పొద్దెక్కిన కొద్దీ నెత్తుటి రంగు సంతరించుకుంటుందట. (ఇన్‌సెట్‌లో) రక్తవర్ణానికి మారిన జలం









refresh™

MATTRESS • PILLOWS • CUSHIONS

We Innovate. You Rejuvenate.

## పొందండి ఒక డబుల్ బెడ్ షీట్,
## 2 దిండు గలేబులు మరియు 1 క్విల్ట్‌ను ఉచితం*గా పొందండి










*షరతులు వర్తిస్తాయి

*షరతులు మరియు నిబంధనలు: ఈ ఆఫర్ జీరో గ్రావిటీ, ఆర్థో ఫ్లెక్స్, ప్రిస్టీన్ మరియు ఫ్రెస్కా మోడల్స్ పై మాత్రమే వర్తిస్తుంది • మిగిలిన రిఫ్రెష్ మ్యాట్రెస్ మోడళ్ళ పై (ఎకోలైన్ మినహాయించి) 2 దిండు గలేబులతో పాటు ఒక డబుల్ బెడ్‌షీట్ వర్తిస్తుంది • పై రెండు ఆఫర్లు ఒక జత మ్యాట్రెస్‌లు లేదా ఒక 48 అంగుళాలు లేదా అంతకన్నా ఎక్కువ వెడల్పు గల పరుపుల పై వర్తిస్తుంది • స్టాక్ ఉన్నంత వరకే స్కీమ్ వర్తిస్తుంది.

**E-mail**: info@primecomfort.com, **Website**: www.refreshmattress.com

**Follow us** www.facebook.com/refreshmattress www.twitter.com/refreshmattress

**Distributor : Patel Foam, Hyderabad 9247011902**

**For Dealers in Hyderabad and Secunderabad Contact :**

Mr Kiran 8885012240, Mr Kameshwar 8885012235, Mr Narshinga Rao-8885012239

**For Dealers in Telengana Contact :**

Mr Hari Krishna: 8885012237 For Dealers in Andhra Contact: Mr RC Shekhar: 8885012238

**For Dealers in Rayalaseema Contact :**

Mr Mani Kumar: 8885012236

**Dealer Enquiry Solicited**

# మనసున ఉన్నదీ...



★ నవంబరు 'చతుర'లో శీర్షికలన్నీ మానసికోల్లాసాన్ని కలిగించాయి. ఇమంది రామారావు సేకరించిన 'భానుమతి చతురోక్తులు' మనోహరంగా ఉన్నాయి. భానుమతి గురించి అనేక విషయాలు తెలిశాయి. 'కొత్తగాలి' కవితలు చిన్నవైనా ఎంతో నిగూఢార్థాన్ని సంతరించుకుని వస్తున్నాయి. అలాగే ఈ కవితలు ఎంతో తాజాగా ఉంటున్నాయి. 'జ్ఞానపీఠాలు'లో పరిచయం చేసిన సత్యవ్రత శాస్త్రి సంస్కృత పాండిత్యం నిజంగా అద్వితీయం, అజరామరం అనిపించింది. అనువాద కథ 'సిందూర కెరటాలు' చదివాక సాగర ఘోషలో ఎంతమంది ఆర్తనాదాలు ఇలా కలిసిపోయాయో అని ఆలోచింపజేసింది.

– డా. శివభూషణం, కర్నూలు

★ కౌమారంలో చెలరేగే భావోద్వేగాల్ని, తొలిప్రేమ తాలూకు ఆశల అనుభూతులను హృద్యంగా, రసరమ్యంగా చిత్రించిన సృజన్ సేన్ అక్షరమాలిక 'ఆరావళి' మా మనసుల్ని దోచుకుంది. 'చతుర ప్రపంచం' చాలా ఆకట్టుకుంటోంది.

– బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్

★ నవంబరు నవల 'ఆరావళి' ఫర్వాలేదనిపించింది. తల్లిదండ్రులకు పిల్లల పెంపకంలోని సాధకబాధకాల మనో విశ్లేషణ ఉపయుక్తంగా ఉంది. పెద్దకథ 'సిందూర కెరటాలు' భారతీయుల బానిస బతుకుల్ని యథార్థంగా చిత్రించింది. జ్ఞానపీఠ అవార్డు గ్రహీత సత్యవ్రతశాస్త్రి పరిచయం విజ్ఞానదాయకం.

– ధవ్వూరి శ్రీధరాచార్యులు,
సీతారాం బాగ్, హైదరాబాద్

★ అందాల తార తమన్నా ముఖచిత్రంతో వెలువడ్డ 'చతుర' ఎంతో ఆకర్షణీయంగా ఉంది. 'ఆరావళి' నవలలో జయంత్‌లాంటి పిరికిపాత్రను సృష్టించి రచయిత పొరపాటు చేశారేమో అనిపించింది. ఈ కాలంలో జయంత్ లాంటి వాళ్లు ఉన్నారంటే నమ్మబుద్ధి కావటం లేదు. ఈ నవలలో పాత్రలన్నీ ఆరావళి ఎదుట తమ ప్రేమను వ్యక్తం చేయలేకపోవడం గమనార్హం. చివరికి ఆరావళిని జయంత్ వివాహం చేసుకునేలా ముగించివుంటే బాగుండేదనిపించింది. కొత్తగాలులు చక్కగా వీస్తూ మాకెంతో హాయినిస్తున్నాయి. ఆ కవితలు రాస్తున్నవారికి అభినందనలు.

– కరణం శివానందరావు, బెంగళూరు

★ నవంబరు నవల సృజన్‌సేన్ 'ఆరావళి' ఓ మోస్తరుగా చదివించింది. ఈ రోజు కాలేజీల్లో ప్రేమ వ్యవహారాలే ప్రధానమయ్యాయి. నిజానికి జీవితంలోని అభద్రత వల్ల ప్రేమ, పెళ్లిలాంటివి కెరీర్ తర్వాతి విషయాలేనని మదన్ పాత్ర ద్వారా ఈ నవలలో వ్యక్తమయింది. సమాజం గురించి ఆలోచించే సూర్య లాంటి విద్యార్థులు నేడు అరుదనే చెప్పాలి. ఆరావళిని పెళ్లాడకపోయినా ఆమె గురించిన ఆలోచనలు జయంత్ మనసులో ఎంతగా నాటుకుని పోయివుంటాయో ఈ నవల ద్వారా తెలుస్తుంది. తొలిసారి మనసుపడ్డ వ్యక్తులను మరచిపోవడం ఎవరికైనా కష్టమేననిపిస్తుంది.

– డి. గాయత్రి, బెంగళూరు

★ మారిషస్ కథ 'సిందూర కెరటాలు' ఆద్యంతం ఆసక్తిగా చదివించింది. ప్రపంచానికి నాగరికతను ప్రసాదించామని విర్రవీగే బ్రిటిష్‌వారు తమ పాలనలో ఇతరులపట్ల ఎంత అనాగరికంగా ప్రవర్తించారో ఈ కథ ద్వారా వెల్లడయింది. ఆఫ్రికాలోని బానిసలను తీసుకెళ్లినట్లే భారతీయుల్ని కూడా ఓడల్లో తెల్లవాళ్లు మారిషస్‌కు తీసుకెళ్లారనీ, అక్కడ చాలీచాలని కూలీతో మనవాళ్లు దాదాపు పశుప్రాయులుగా దశాబ్దాల పాటు జీవించారని ఈ కథ ద్వారా తెలుసుకున్నాం.

– వి.ఆర్. కవిత, హిందూపురం

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ మెయిల్ :
vipula.chatura@eenadu.net

సంపుటి -35 సంచిక - 11
419వ సంచిక, పేజీలు : 132
డిసెంబరు 2012

# చతుర



‘ఇప్పుడే మీ అమృత ఆంటీని కలిసి వస్తున్నాను. ఆమె మన ఇండియన్ల పరువు తీసే పని చేస్తోంది’ అంది సునంద, కొడుకు వినోద్‌తో.
‘ఔనా మమ్మీ! ఆంటీ చేస్తున్న ఆ పరువు తక్కువ పనేమిటి?’ అన్నాడు వినోద్ ఆశ్చర్యంగా.
‘ఈ వయసులో తనకో తోడు కావాలంటూ ఇంటర్నెట్‌లో మెయిల్స్ పంపుతూ డేటింగ్ చేస్తోంది’ అంది సునంద.
‘అందులో తప్పేంటి? మా అమ్మ కూడా అలాగే చేసి పార్ట్‌నర్‌ను వెతుక్కుంది’ అంది వినోద్ గాల్‌ఫ్రెండ్ మరియా.
‘మా దేశ సంస్కృతిలో ఇలాంటి వాటికి చోటులేదు’ అంది సునంద అక్కసుగా.
‘అయినా ఆమె ఉంటున్నది అమెరికాలో. ఇలాంటివి వ్యతిరేకించేవారు కుసంస్కారులు’ అంది మరియా కోపంగా.
ఇంతకీ అమృత తగిన భాగస్వామిని వెతుక్కుందా? ఒంటరితనం తెచ్చే బాధలకు అక్షరరూపం **అక్కినపల్లి సుబ్బారావు** నవల

**తోడు**

6వ పేజీలో..
బొమ్మలు : ఆనంద్



పుస్తకాలంకరణ : **రాజు యాట**

'అమెరికా వెళ్లేంత వరకూ డబ్బులు మితంగా ఖర్చు పెట్టు. తక్కువపడితే నాన్నను అడగలేను' అన్నాడు రంగనాథ్, భార్యతో.
'మీ నాన్నగారి సంపాదన అంతా మీదే కదా? ఇంతకీ ఇంటి గురించి మాట్లాడారా?' ఆరా తీసింది సునంద.
'ఇంకా చెప్పలేదు!' అన్నాడు రంగనాథ్.
'నాలుగున్నర కోట్ల విలువ చేసే ఈ ఇంటిని ఆయన ఒక్కడి కోసం వదిలేసి పోవడం సబబేనా?' అంది సునంద.
'సరే, ఇక్కడి ఇల్లు అద్దెకిచ్చి, నాన్నగారిని అమెరికా తీసుకెళ్దాం' అన్నాడు రంగనాథ్.
'మీకేమన్నా పిచ్చా? డెబ్భై ఏళ్లవాడ్ని అమెరికా తీసుకెళితే మనం భరించగలమా?' కసురుకుంది సునంద.

ఆ తర్వాతేం జరిగింది? వయసు పైబడ్డాక మానవ సంబంధాలలోని ఎత్తుపల్లాల్ని అత్యద్భుతంగా విశ్లేషించిన నవల

# లేఖ

- అక్కినపల్లి సుబ్బారావు

"నాన్నా నీదగ్గర కేష్ ఏమైనా ఉందా? ముప్ఫయివేల రూపాయలు కావాలి" అనడిగేడు రంగనాథ్.

"బ్యాంకులో ఉంది. కాని ఇదేమిటి? నువ్వు నన్ను డబ్బు అడగడమేమిటి? నీకు నెలకి లక్షన్నర రూపాయల జీతం వస్తుంటే... " అంటూ విశ్వనాథం ఆశ్చర్య పడ్డాడు.

"ఏం లక్షన్నర నాన్నా? దానిలో సగం నా అమెరికా ఎక్కౌంట్‌లో జమ అవుతుంది. ఇక్కడ ఇస్తున్న డెబ్భై అయిదువేలలో నెలకి ఇరవై వేలు టేక్స్, కారు కొనడానికి తీసుకున్న అప్పుకి ముప్ఫయివేలు పోగా మిగిలినది ఏ మూలకీ సరిపోవడం లేదు. వినోద్ చదువు ఇంకా రెండు సంవత్సరాలు, చిత్ర చదువు పూర్తవడానికి ఇంకా మూడేళ్ళు ఉన్నాయి. ఏమిటో నాన్నా.. నేను ఇక్కడ ఉద్యోగ రీత్యా ఉండిపోవడంతో వాళ్ళు తమ చదువుకి బ్యాంకు నుంచి లోన్స్ తీసుకుంటున్నారు. చదువులు పూర్తయేసరికి చెరో లక్ష డాలర్ల లోన్ ఉంటుంది. నా అమెరికా ఎక్కౌంటులో జమ అవుతున్న డాలర్లు చాలామట్టుకి ఇంటికి టేక్స్ కట్టడానికే సరిపోతాయి. ఇల్లు అమ్మేద్దామా? అంటే కొనే నాధుడు లేడు. అదీకాక పిల్లలు సెలవులకి ఇంటికి వస్తే ఒక కొంప అంటూ ఉండాలిగా. ఇటీజ్ టెరిబుల్, రియల్లీ ఇటీజ్ టెరిబుల్" అంటూ తన బాధ వెళ్ళ కక్కేడు రంగనాథ్.

విశ్వనాధం ఏమీ మాట్లాడలేదు.

"తిరిగి ఇచ్చేస్తాను నాన్నా, కంగారుపడకు" అన్నాడు రంగనాథ్.

"భలేవాడివే, నీ ఇబ్బందుల గురించి ఆలోచిస్తున్నాను. అంతేకాని, ఇంకేమి కాదు. నువ్వు తిరిగి ఇవ్వనక్కరలేదు" అన్నాడు విశ్వనాధం.

"రెండువేల ఎనిమిదవ సంవత్సరంలో చాలా బేంక్‌లు దివాళా తీసేయి. పెద్ద పెద్ద ఫైనేన్స్ కంపెనీలు చేతులు ఎత్తేసేయి అమెరికాలో. చిన్న చిన్న కంపెనీలు ఒంటరిగా నిలబడలేక ఇంకో కంపెనీలో కలిసిపోయేయి. అందువలన ఉద్యోగాలు తరిగిపోయేయి. ఈ మధ్య ప్రకటించిన అంకెల్ని బట్టి దాదాపు పదమూడు మిలియన్ల అమెరికన్లకి ఉద్యోగాలు లేవు. మళ్ళీ పాత ధోరణికి రావడం దాదాపు అసంభవం అంటున్నారు. ఉద్యోగాలు కోల్పోయిన వాళ్ళలో కొంత మందికి నాకున్న అర్హతలే ఉన్నాయి. నేను బ్యాంకులో పని చేసేనుగా, నాకూ మంచి ఉద్యోగంలో స్థిర పడడానికి సమయం పడుతుంది"

"నీకేమోయ్, ఇప్పుడు ఉన్న ఉద్యోగం చిన్నదా? "

"నాన్నా, నెలకి అయిదులక్షల రూపాయల జీతం ఎక్కడ? ముష్టి లక్షన్నర ఎక్కడా? " రంగనాథ్ నిట్టూర్చేడు.

దిగాలుపడుతున్న నలభై అయిదేళ్ళ కొడుకుని ఎలా ఓదార్చాలో తెలియక తికమక పడ్డాడు విశ్వనాధం.

"ఇక్కడకి వచ్చి నువ్వు తప్పు చేసేనను కుంటున్నావా? " అనడిగేడు, విశ్వనాధం తడారిపోయిన గొంతుకని అదుపులోనికి తెచ్చుకుంటూ.

"ఇక్కడికి గత్యంతరం లేక వచ్చేను. ఇక్కడికి రాకుండా, పని లేకుండా ఇంట్లో కూర్చోవడం కంటే ఒక అమెరికన్ కంపెనీకి పని చేస్తున్నానని రెస్యూమే మీద ఉండడం చాలా శ్రేయస్కరం నాన్నా. పని లేకుండా ఇంట్లో రెండు మూడేళ్ళు కూర్చుంటే ఇంటర్వ్యూలకి పిలుపే రాదు. అధవా వచ్చినా 'ఈ రెండేళ్ళలో ఏం చేసేవు? ' అనడుగుతారు. అప్పుడు తెల్ల మొహం వేయాల్సి వస్తుంది. ఈ రోజుల్లో కొన్ని కంపెనీలు తమ ఉద్యోగ ప్రకటనలలో 'ప్రస్తుతం ఉద్యోగంలో లేకుంటే అప్లి

కేషన్ పంపనవసరం లేదు' అని ముందే హెచ్చరిస్తున్నాయి. ఏమో! ముందర ముందర ఏమవుతుందో? " అంటూ నిరాశగా సమాధనమిచ్చేడు రంగనాథ్.

"పదకొండు గంటలకి బ్యాంకుకి వెళ్ళి నీక్కావలసిన పైకం తీసుకుందాం. నువ్వు వాడుకోవడానికి వీలుగా మరొక ఎ.టి. ఎమ్ కార్డ్‌కి అప్లికేషన్ పెడదాం. అతిగా నిరాశపడకు. అన్నీ సర్దుకుంటాయి" అంటూ విశ్వనాధం కొడుకుని ఓదార్చేడు.

"ఏం కుదుటపడతాయో ఏమో!" అంటూ గొణిగేడు రంగనాథ్.

"దగ్గరగా వచ్చి చూస్తే కాని లోతుపాతులు తెలియవంటారు. నువ్వు వివరాలు చెబితేకాని నాకు ఇవన్నీ అర్ధమయ్యేవి కావు. గత ఇరవై ఏళ్ళుగా అమెరికాలో బతుకుతున్న నీకు ఇతరుల సలహా అనవసరం. స్నానం అదీ చేసి తయారుగా ఉంటాను. బ్యాంకుకి వెళ్దాం" అంటూ కుర్చీలోంచి లేచేడు విశ్వనాధం.

★ ★ ★

"నాన్నా, నే పనిచేస్తున్న బ్యాంకు నాకు అమెరికాలో, గతంలోనే పనిచేసిన విభాగంలో ఉద్యోగం ఇస్తామని చెప్పారు. జీతం తక్కువే అయినా అంతా డాలర్లలోనే ఇస్తారు. అదీకాక నేను తిరిగి వెళ్ళి అక్కడ ఉద్యోగంలో చేరిన తరువాత సునందకి కూడా ఉద్యోగం ఇస్తామని వాగ్దానం చేసేరు" అన్నాడు రంగనాథ్.

"ఇది చాలా మంచివార్త రంగనాథ్. నీ ఆరాటం, నిస్పృహ తగ్గే రోజులు వచ్చేయి. నువ్వు ఇక్కడ పనిచేస్తున్నా నీ ధ్యాసంతా అమెరికా తిరిగి ఎప్పుడు వెళ్ళిపోతానా? అన్న దానిమీదే ఇన్నాళ్ళు తచ్చాడింది. దాదాపు రెండేళ్ళు ఇండియాలో వనవాసం చేసేవు" అంటూ విశ్వనాధం ఆనందపడ్డాడు.

"చూడాలి నాన్నా, ఆ తక్కువ జీతమే ప్రోత్సాహకరంగా లేదు. కాని ఆ దేశంలో పడితే సొంత ఇంటిలో ఉంటాను. పిల్లలు దగ్గరగా ఉంటారు. అదోరకమైన తృప్తి" అన్నాడు రంగనాథ్.

తండ్రీ, కొడుకుల మధ్య సంభాషణ వంటమనిషి రాకతో ఆగింది.

వంటింట్లోంచి శబ్దాలు రావడం మొదలయేయి. వంటమనిషి వండేతీరులో పనికిరాని చెత్త సినిమాల్లో కనిపించే అసందర్భ శబ్దాలలా ఒక విలక్షణత ఉంటుంది. తొందరగా పని ముగించాలని 'ఏది ముందు? ఏది తరువాత?' అన్నది ఆలోచించకుండా, నిశ్చయించుకోకుండా వంటకం చేయడం మొదలుపెడుతుంది. ఫైర్ ఫైటర్ మంటల్ని ఆర్పే ప్రయత్నంలా కూరలు వండే ప్రయత్నం హడావుడిగా సాగుతుంది. కూరసరిగ్గా ఉడకకపోవడమో, పోపు మాడిపోవడమో లేక కారం ఎక్కువవడమో జరుగుతూ వంట ముగుస్తుంది. కూరలు వండేటప్పుడు గిన్నెలు చేసే శబ్దంలో పటకారు ఉపయోగించకుండా వేడిగిన్నెని దింపి 'అబ్బా! చచ్చేను' అంటూ చేయికాలినదానికి నిదర్శనంగా వినిపిస్తుంది. ఉదయం ఒక గంటన్నర, సాయంకాలం ఒక గంటపాటు వంటగదిలో జరిగే నిత్య ఆర్భాటం చూస్తే భార్య అనసూయ జ్ఞాపకానికి రాకమానదు విశ్వనాధానికి. మూడు, నాలుగు వంటకాలు చేసినా, ఏనాడూ ఆమె గిన్నెలు పడవేయడంలాంటివి తన కంటపడలేదు. మంచి రుచికరంగా వంట చేయడం అందరికీ అలవడదు. బంగాళదుంపల వేపుడుని, కొబ్బరికాయ పచ్చడిని కూడా పాడుచేసి వడ్డించగల చాకచక్యం ఈ వంటమనిషిలా కొందరికే ఉంటుంది. అనసూయ అలా కాదు. వంకాయ మెంతికూర చేసినా, ఉల్లికారం పెట్టి దొండకాయ వండినా నోటిలో పెట్టుకోగానే లాలాజలం తన్నుకువచ్చేది.



అనసూయ చేతివంట బాగుండేది అను కుంటుంటే..

"చపాతీలు, కూర, చారు టేబిల్ మీద ఉంచేను" అంటూ హెచ్చరించి బైటకి వెళ్ళింది వంట మనిషి. విశ్వనాధానికి అన సూయ తిరిగి జ్ఞాపకానికి వచ్చింది.

హైదరాబాద్‌లో తరచూ జరిగే నేరం, ఆరునెలల క్రితం ఆమెని పొట్టన పెట్టు కుంది. మోటార్ సైకిల్ మీద వెంబడించి వెనకాతల నుంచి మెడలో గొలుసు దుండ గులు లాగగా తూలి పేవ్‌మెంట్ మీద పడి తలపగిలి అక్కడికక్కడే అప్పగింతలయినా పెట్టకుండా అనసూయ మరణించింది. అమెరికాలో నెలకొన్న ఆర్థిక మాంద్యం కారణంగా ఇంటి దగ్గరే ఉన్న రంగనాథ్ తల్లికి కర్మకండలు చేసాడు. లేకపోతే అత నికి చనిపోయిన తల్లి భౌతికకాయాన్ని చూసే అవకాశం కూడా ఉండేదికాదేమో!

అనసూయకి కొడుకంటే వల్లమాలిన ప్రేమ. ఏం చేసినా, ఎలా ప్రవర్తించినా కొడుకుని సమర్థించేది. ఇండియాలో ఉద్యోగానికి వచ్చిన రెండు నెలలకి రంగ నాథ్ తనని డబ్బు అడిగినప్పుడు అన సూయ సలహా అడిగేడు.

"మనకి ఉన్నదంతా వాడికే కదా? మన మేమీ మూటాముల్లే కట్టుకుని మీదకి వెళ్ళ లేంకదా? వాడు ఇబ్బందులలో ఉన్నాడు. మనం ఇప్పుడు ఆదుకోకపోతే ఇంకెప్పుడు ఆదుకుంటాం? " అంది అనసూయ.

ఊరికే వచ్చిన డబ్బుకి వెంట్రుకవాసంత కూడా విలువలేదని, ఏదైనా ఒక పద్ధతి ప్రకారం జరగాలని అనసూయకి చెబుదా మనిపించినా ఆమెకి కొడుకంటే ఉన్న పిచ్చి ప్రేమ జ్ఞాపకానికి వచ్చి తన మన స్సులో ఉన్నది చెబితే ఆమె నొచ్చుకుంటుం దని, రెచ్చిపోతుందని, గమ్మున ఊరుకు న్నాడు. ప్రతి నెలా తన ఎక్కౌంట్‌లో ముప్ఫయి అయిదువేలు పెన్షన్ పడు తుంది. దానికి లంకె ఉన్న ఎ.టి.ఎమ్ కార్డ్ రంగనాథ్‌కి ఇచ్చి సంవత్సరంన్నర పైనే అయింది. ఆ ఎక్కౌంట్‌లో అంతకు ముందర రెండు లక్షల రూపాయలు ఉన్నట్లు జ్ఞాపకం. అదీకాక ఒక డిపాజిట్ మెచ్యూర్ అవడంతో రెండు లక్షలు జమ అయేయి. ఈ మధ్యన చూస్తే ఆ ఎక్కౌం ట్‌లో కేవలం నలభైవేలు ఉన్నాయని గ్రహించేడు తను. అనసూయ కర్మకాండ లకి ఒక లక్ష, ప్రతీ నెలా తను తీసే ఇర వైవేలని పరిగణనలోనికి తీసుకుంటే రంగ నాథ్ ఆ ఎక్కౌంట్‌లోంచి దాదాపు అయి దులక్షలు తీసి వాడుకున్నాడు

'అంతా వాడివే కదా? ' అంది పిచ్చి అన సూయ.

మొట్టమొదటి సారి నోరు తెరచి 'నాన్నా, ముప్ఫయివేలుకావాలి' అనడిగేడు రంగనాధం కాని తరువాత తను ఎంత డబ్బు దానిలోంచి తీస్తున్నాడో తనకి చెప్ప లేదు 'అంతా వాడికే కదా? ' అన్న అన సూయ మాటకి విలువ ఇచ్చినా, అంత పెద్దమొత్తం ఎక్కౌంటులోంచి తీసినప్పుడు తండ్రికి చెప్పాలని రంగనాథ్‌కి ఎందుకు తట్టలేదో! అనుకుంటూ కళ్ళు మూసుకు న్నాడు విశ్వనాధం.

★ ★ ★

భోజనానంతరం నడకకి వెళ్ళే అలవా టుంది విశ్వనాధానికి. యధాప్రకారం ఎని మిది గంటల ముప్ఫయి నిమిషాలకి బైట పడిన విశ్వనాధానికి పది నిమిషాలు నడ వక ముందరే బొప్పాయి పండ్ల తోపుడు బండి కనపడేసరికి బేరం మొదలు పెట్టేడు.

"ముప్ఫయి రూపాయలకి ఇస్తే ఇయ్యి, లేకపోతే వద్దు"

"సరే, తీసుకోండి" అంటూ బొప్పాయి పండుని అందిచ్చేడు తోపుడు బండి మనిషి.

జేబులో చెయ్యిపెట్టి చూసిన విశ్వనాథా నికి పర్స్ తగలలేదు.

"పర్స్ తీసుకురావడం మరచిపోయేను, తరువాత చూద్దాం" అని విశ్వనాధం ముందరకి నడవబోతుంటే, "ఫరవాలేదు సార్, మీరు నాకు పరిచితులే. రేపు ఇద్దు రుగాని" అన్నాడు పండ్ల మనిషి.

"నువ్వు ఇక్కడ ఎంతసేపు ఉంటావ్?"

"ఇంకో గంట ఉంటాను"

"సరే, ఇప్పుడే వస్తాను" అంటూ వెనుది రిగి ఇంటిలోనికి ప్రవేశించబోతుంటే లోపల జరుగుతున్న సంభాషణ విశ్వనా ధాన్ని ఆపింది.

"మనం అమెరికా ఎప్పుడు వెళ్తున్నాం? తేదీ ఖరారైతే నాకు చెప్పండి. పిల్లలకి వస్తువులు కొనాలి" అంది సునంద.

"ఇంకా దాదాపు ఇరవై రోజులు వ్యవధి ఉంది. పిల్లలకి ఏమిటి కొందామనుకుంటు న్నావ్? అవి వాళ్ళకి ఉపయోగపడ తాయో, లేదో? ఎంతడబ్బు కావాలి? ఇక్కడ నుంచి అక్కడకి తీసుకెళ్ళే సామాన్లు ఏమున్నాయి? అయినా డబ్బంటే మళ్ళీ నాన్నను అడగాలేమో"

"పిల్లలకి వస్తువులు కొంటానంటే డబ్బు గురించి ఆలోచిస్తున్నారు. అయినా మీరు ఎవరి డబ్బు వాడుకుంటున్నారు? పరాయి వాళ్ళది కాదుగా. ఇంతకీ అసలు విషయం మీ నాన్నగారితో చర్చించేరా?"

"ఆయనకి నేను ఎప్పుడూ ఆర్థికంగా సహాయపడలేదు. ఇప్పుడూ లేదు. గతంలో అమ్మ బతికి ఉన్నప్పుడు అమె రికా రావడానికి కావలసిన విమాన ఖ ర్చులు అన్నీ నాన్నే భరించేడు. నా ఆర్థిక వ్యవహారాల్లో ఆయన ఎప్పుడూ తలదూర్చ లేదు. ఇది ఆయన ఆస్తి గురించి సంబం ధించినది. ఆయన ఏమనుకుంటాడో అని బెరుకుగా ఉంది"

"మా పిన్ని కొడుకు మధు ఇక్కడే రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తున్నాడు. వాడితో మాట్లాడేను. ఈ ఇంటి ఆవరణ సుమారు ఏడు వందల చదరపు గజాలు. రెండు రోడ్ల కూడలిలో ఉంది. ఈ ఇల్లు ఎంతలేదన్నా నాలుగున్నర కోట్ల విలువ ఉంటుందని అన్నాడు. మనం వెళ్లిపోయేక బిక్కు బిక్కుమంటూ ఆయన ఒంటరిగా నాలుగున్నర కోట్ల విలువచేసే ఈ ఇంటిలో ఉండటం శుద్ధ వేస్ట్"

"ఈ ఇల్లు అద్దెకి ఇచ్చేసి ఆయనని మనతో అమెరికా తీసుకెళ్దామా?"

"మీకు పిచ్చికాని ఎక్కలేదుకదా? అరవై తొమ్మిదేళ్ల మనిషిని అక్కడికి తీసుకెళ్దా మన్న ఆలోచన మీకు ఎలా వచ్చింది? తీసుకెళ్ళాక ఆయనకి ఏదైనా ప్రోబ్లమ్ వస్తే ఎవరు చూస్తారు? ఈ వయసులో ఆయనకి అమెరికాలో ఆరోగ్యబీమా లభిం చదు. మనమే అంతా భరించాలి. బుర్ర పెట్టి ఆలోచించండి"

తలుపు తీసుకొని లోపలికి వచ్చిన విశ్వ నాథానికి తన వయస్సు అరవై ఎనిమిదే అని చెబుదామని అనిపించింది.

"రంగనాథ్! ముప్ఫయి రూపాయల చిల్లర ఉందా?"

ఉలిక్కిపడ్డారు రంగనాథ్, సునందలు.

"ఇదిగో నాన్నా" అంటూ రంగనాథ్

## కొత్తగాలి...

**నేతల పాదయాత్రల జోరు**
**పోటీబడి సాగుతున్న తీరు**
**హామీల పరంపరల హోరు**
**సగము ఓటర్లంతా బేజారు**

– నండూరి నాగేశ్వరరావు,
బేగంపేట, హైదరాబాద్

ఇచ్చిన ముప్ఫయి రూపాయలు అందుకుని బైటికి వెళ్తున్న తండ్రిని గమనిస్తూ "మా నాన్న మన సంభాషణ విని ఉంటాడా?" అంటూ రంగనాథ్ గొణిగేడు.

★ ★ ★

"నాన్నా! మరొక ఇరవై రోజులలో అమెరికా వెళ్ళడానికి టిక్కట్లు కొన్నాను. దాదాపు రెండు సంవత్సరాల తరువాత అమెరికా వెళ్తుంటే ఏమిటో మొట్టమొదటిసారి అమెరికా వెళ్ళినప్పుడు పట్టుకున్న భయంలాగా మళ్ళీ భయం వేస్తోంది. అక్కడ పరిస్థితులు మారేయి. అమెరికా ఇంకా ఆర్థిక ఇబ్బందులలో ఉంది. రెండు సంవత్సరాలు ఇక్కడ గడిపి నేను అమెరికా వెళ్ళే తరుణంలో నాలో కొన్ని క్లిష్టమైన ప్రశ్నలు ఉద్భవించేయి. తప్పిపోయేననుకున్న రైలు బయలుదేరి ఎందుకో ప్లాట్‌ఫారం చివర్న ఆగితే, పరిగెత్తి ఆ రైలుని అందుకునే వ్యక్తిలా ఇప్పుడు నా బతుకు ఉంటుంది. సాంకేతికంగా ప్రపంచం పురోగమించింది. నేను తిరిగి ఆ వేగం అందుకోకపోతే ప్లాట్‌ఫాంమీద చతికిలపడే ప్రయాణికునిలా ఎందుకూ పనికి రాకుండా పోతాను. ఆ వేగం అందుకునే నా తాపత్రయంలో నాకు ఇంకేమీ కనిపించకపోవచ్చు. సునంద కూడా ఉద్యోగానికి వెళ్తుంది. కాబట్టి ఇల్లంతా ఖాళీ. నాన్నా, నిన్ను నాతో తీసుకెళ్దామని ఉన్నా, పగలంతా ఇంట్లో నిన్ను చూసేవారెవరూ ఉండరు. అవసరమైతే ఇక్కడిలా రెండు వందల రూపాయలు ఇచ్చి అక్కడ డాక్టర్‌ని సంప్రదించలేం. నీ వయస్సులో ఆరోగ్య బీమా ఏ కంపెనీ ఇవ్వదు" అంటూ రంగనాథ్ ఆగేడు.

**కొత్తగాలి...**

**తేనె**
**పట్టు నుండే కాదు**
**రాజకీయనేత**
**మాట నుండీ జారుతుంది!**

– ఎం.వి. స్వామి,
చోడవరం, విశాఖపట్నం జిల్లా

"నాకు నీ పరిస్థితి అర్థమయిందోయ్. మరీ అంత వివరించి చెప్పనవసరం లేదు. నేనూ కాస్తో కూస్తో చదువుకున్నవాడినేగా. అదీకాక నాకు అనుభవం ఉంది. నా గురించి ఏ దిగులూ పెట్టుకోకుండా నువ్వు అమెరికా వెళ్ళు. ఇప్పుడు నాకు వచ్చిన ప్రత్యేక సమస్యలేమీ లేవు... అలాంటివి ఎదురయినపుడు దానికి పరిష్కారమార్గం వెతుకుదాం" అంటూ డైనింగ్ టేబిల్ దగ్గరనుంచి లేవబోయేడు విశ్వనాధం.

"నువ్వు చెప్పినది నిజమే నాన్నా. కాని సమస్య వచ్చేక పరిష్కారం వెతికేకంటే ఆ సమస్య రాకుండా ముందు జాగ్రత్త తీసుకోవడం శ్రేయస్కరం. మేం వెళ్ళేక నువ్వు ఇక్కడ ఒంటరిగా ఉంటావు. హైదరాబాద్ లాంటి నగరాలలో ఏ సహాయమూ లేకుండా ఒంటరిగా ఉండడం మంచిది కాదు. నీకు పెన్షన్ వస్తుంది. అది నీకు ఎక్కీతొక్కీ. అలాంటప్పుడు ఒంటరిగా ఈ ఇంటిలో నివసించే కంటే ఈ ఇల్లు అమ్మేసి ఒక మంచి ఫ్లాట్‌లోనికో లేక రిటైర్‌మెంట్ హోమ్‌కో మారితే? అలా అయితే నీకు సహాయం లభిస్తుంది. నేను నీ గురించే ఆలోచిస్తున్నాను. హైదరాబాద్‌లో నిత్యం జరిగే నేరాలు, దోపిడీల సంగతి నీకు నేను వేరే చెప్పనవసరం లేదు" అన్నాడు రంగనాథ్ నుదుటని పట్టిన చమటను తుడుచుకుంటూ.

రెండు రోజుల క్రితం కొడుకు, కోడలి మధ్య జరిగిన సంభాషణ వినడం వలన వాళ్ళ ఆలోచన గురించి అవగాహన ఉన్న

విశ్వనాథానికి ఆశ్చర్యం కలగలేదు.

తండ్రి ఆశ్చర్యపడకపోవడం రంగనాథ్‌కు ఆశ్చర్యం కలుగచేసింది.

"నువ్వు నా గురించి ఆలోచించడం నాకు చాలా ఆనందాన్ని కలిగించిందోయ్. మీ దేశంలో ఒక రకమైన రివాజును అర్థంచేసుకున్న నువ్వు నా పరిస్థితిని అదే కోణంలోంచి చూడడంలో విచిత్రమేముంది? ఎలాంటి పరిస్థితులలో అక్కడ ప్రజలు రిటైర్‌మెంట్ హోమ్‌లో చేరతారో వివరంగా తెలుసుకున్నావా? నేను ప్రతీ రోజూ దాదాపు మూడు కిలోమీటర్ల దూరం నడుస్తాను. తోటలో కాస్సేపు పని చేస్తాను. ఇక్కడ ఒంటరిగా ఉన్నా, ఫ్లాట్‌లోనికి మారినా నాకు తేడా స్వల్పమే. నువ్వు అన్నట్లు, ఏదైనా ఇబ్బంది వస్తే రిటైర్‌మెంట్ హోమ్‌లో సహాయం లభిస్తుందన్నది నిర్వివాదాంశం. ఈ ఇల్లుకట్టి ఇరవై ఎనిమిదేళ్లయింది. ఇక్కడ నేను ఒక విధమైన జీవితానికి అలవాటు పడ్డాను. ఈ ఇల్లు గురించి, ఇక్కడ నుంచి మార్పు గురించి నా మెదడులో ఏ ఆలోచనా రాలేదు. నువ్వు దీనిని నా దృష్టిలోనికి తీసుకువచ్చేవు. ఇహ ఆలోచిస్తాను. ఇంకా నువ్వు ఇరవై రోజులు ఉంటావుగా. నువ్వు అమెరికా వెళ్ళేలోగా నా ఆలోచన చెబుతాను. సరేనా? " అన్నాడు విశ్వనాథం.

తండ్రి తన ప్రతిపాదనని అంగీకరిస్తాడని ఆశించిన రంగనాథ్‌కి 'మునగానాం, తేలానాం' అన్నట్లుగా ఆయన స్పందించడం నిరాశ కలిగించింది. 'ప్రతిపాదనని కొట్టిపారేయలేదు' అనుకుని స్థిమితపడ్డాడు.

తండ్రీకొడుకుల మధ్య నడుస్తున్న సంభాషణ వింటున్న సునందకి లోలోపల నుంచి కోపం రాజుకుంటోంది. "ఈ ముసలాళ్ళెప్పుడూ ఇంతే. పట్టు విడవరు. డెబ్బయి ఏళ్ళు వస్తున్న ఈయన ఈ ఇల్లు అమ్మేసి ఏదో ఆశ్రమంలో 'కృష్ణా, రామా' అనుకోక ఈ జిగటపట్టు ఏమిటి? కొడుకు చెబుతుంటే, వివరిస్తుంటే అర్థం చేసుకోకుండా ప్రశ్నని దాటవేయటమేమిటి? అయినా ఈయనని అనాలి. నాన్నా! ఈ ఇల్లు అమ్మేయ్- అని చెప్పకుండా నాన్చుడుగా మాటలాడటమేమిటి? ఏదైనా చేత కావాలి" అంటూ కుళ్ళుకుంది సునంద.

ఒక గంట తరువాత, రంగనాథ్ సునందనీ పరుపుమీద దగ్గరకి తీసుకోబోతే "సర్లెండి, ఏమీ చేతకాదుకాని దీనికి మాత్రం రెడీ" అంటూ అతని చేతిని తోసి రెండవవేపు తిరిగింది.

తను చేసినది ఏమాత్రం నచ్చకపోయినా సునంద ఎలా ప్రవర్తిస్తుందో బాగా తెలిసిన రంగనాథ్ అసంతృప్తితో కళ్ళు మూసుకున్నాడు.

★ ★ ★

ఇంటివిషయంలో తండ్రి ఏం సమాధానం చెబుతాడో అని ఎదురు చూస్తూ ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు చేసుకుంటున్నాడు రంగనాథ్.

"మావగారు ఇల్లు అమ్మకానికి ఒప్పుకుంటారా? " అంటూ ఉత్కంఠతతో ఎదురు చూస్తూ పిల్లలకి కావలసిన సామాన్లు, నగలు, సరుకులు కొనుక్కుంటూ రోజులు లెక్క పెడుతోంది సునంద.

విశ్వనాథం వివిధ రకాల పేపర్లు తెచ్చుకుని తిరగేస్తుంటే 'దేనికోసం వెతుకుతున్నారో' అని ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా సునంద, రంగనాథ్‌లకి ఏమీ అంతుపట్టలేదు.

"ఏమిటి మీ నాన్నగారు అన్ని పేపర్లు తిరగేస్తున్నారు, దేని గురించి? " అని సునంద భర్తని రెండుసార్లు నిలదీసింది.

"నీకెంత తెలుసో నాకూ అంతే తెలుసు. పనికట్టుకుని నన్ను విసిగించకు" అంటూ రంగనాథ్ కసిరేసరికి గుర్రుగా చూసింది

సునంద.

"నాన్నా, దేనికి అన్ని పేపర్లు చదువుతున్నావు" అన్న ప్రశ్న రంగనాథ్ నాలిక చివర వరకు వచ్చినా అడగకుండా తమాయించుకున్నాడు.

"నేను పేపర్లు చదవడానికి నిన్ను సంప్రదించాలా? " అని తండ్రి కోపగించుకుంటాడేమోనని మనస్సు ఉగ్గపట్టుకుని మౌనం వహించేడు. తండ్రి లేనపుడు ఆదరాబాదరాగా ఆ పేపర్లని తిరగేస్తే 'రియల్ ఎస్టేట్ అండ్ ప్రాపర్టీస్' భాగంమీద గీతలు ఉండడం చూసి 'ఓహో! ఇల్లు అమ్మితే ఎంతడబ్బు వస్తుందా? ' అని వాకబు చేస్తున్నాడనిపించి రంగనాథ్ తృప్తిపడ్డాడు.

రంగనాథ్ సునందల అమెరికా ప్రయాణం రెండు రోజులుందనగా అందరూ రాత్రి భోజనం చేసేక "రంగనాథ్, నువ్వు చేసిన ప్రతిపాదన గురించి ఆలోచించేనోయ్. ఈ ఇల్లు గురించి నా నిర్ణయాన్ని తాత్కాలికంగా వాయిదా వేస్తున్నాను. దానికి రెండు కారణాలున్నాయి. ఒకటి, నేను నా శేష జీవితాన్ని ఎలా గడపాలి అన్న అంశం మీద ఒక నిశ్చితాభిప్రాయానికి రాలేదు. రెండు, ముఖ్యమైనది ఇప్పుడు రియల్ ఎస్టేట్ మార్కెట్ హీన దశలో ఉంది. ధరలు దాదాపు ఇరవై శాతం పడిపోయేయి. త్వరలో పెరుగుతుందని అందరూ నమ్ముతున్నారు. తొందరపడి చవుకగా అమ్మేయడం అంటే నీకిష్టముండదని నాకూ తెలుసు. నేను ఒక నిర్ణయానికి రాగానే నువ్వు వద్దువు గాని, ఒకే! నేను నాలుగు అడుగులు వేసి వస్తాను" అంటూ చెప్పులు తొడుగుకోవడానికి నిలబడ్డాడు విశ్వనాథం.

బైటకి వెళ్ళబోతూ ఆగి "నీ కారు అమ్మకం, దానికి సంబంధించిన పేపర్లు అందించడం పూర్తయిందా? ఇక్కడ నీ వ్యవహారాలేమీ అసంపూర్తిగా వదిలేయలేదుకదా? " అంటూ గడపదాటేడు విశ్వనాథం.

"అన్నీ పూర్తయేయి నాన్నా" అన్నాడు రంగనాథ్ తడారిపోయిన గొంతుకని అదుపులోనికి తెచ్చుకుంటూ.

"మీకు ఏమీ సరిగ్గా చేయడం రాదు. లౌక్యం అసలే తెలియదు. 'నాన్నా, బాగా ఆలోచించి, ఎలాచేస్తే మంచిదో అన్న నిర్ణయానికి వచ్చేను. నీకు దాదాపు డెబ్బయి ఏళ్ళు. ఒంటరిగా ఉండకూడదు. అలాంటప్పుడు నేను చెప్పినట్లు ఎందుకు చేయడం లేదు' అంటూ ఆయనని నిలదీస్తూ, బుజ్జగిస్తూ ఒప్పించాలి. కాని మీరు మన్ను తిన్న పాములా, గంగిరెద్దులా తల ఊపి, ఏదో కంఠస్తం చేసిన పాఠం ఒప్పచెప్పినట్లు రెండు పొడిముక్కలు చెబితే కార్యం సానుకులపడుతుందా? ఆరు నెలలు సహవాసం చేస్తే వారు వీరవుతారు అంటారు. మనం ఇరవైమూడేళ్ళు కాపురం చేస్తున్నాం, కాని మిమ్మల్ని ఏమీ మార్చలేక పోయాను" అంటూ సునంద రుసరుసలాడుతూ రంగనాథ్‌ని దులిపింది.

"ఆపు నీ దండకం.. ఎప్పుడు చూసినా దెప్పుళ్ళే. నాకు బాగా చేతనవును, మీకేమీ రాదు- అన్నవాక్యం కొన్ని వందలసార్లు నీ నోటంబట విన్నాను. అందుచేత దానికి విలువలేదు. నువ్వు ఏదిపడితే అది చెప్పినట్లు చేయడానికి ఇదేమీ చిన్న వ్యవహారం కాదు. పెద్దవాడైన నా తండ్రిని దబాయించి ఆయనని మనకిష్టమైనట్లు చేయమనడం ఎంత దారుణం! 'ఆయన బాగుకోసం' అన్నావు ఒకసారి. ఈ రెండు సంవత్సరాల్లో ఆయనకి వండడం కాని, కనీసం ఒక కప్పు కాఫీ అయినా ఇచ్చేవా? ఆయన కుదుర్చుకున్న వంటమనిషి చేతి వంట తింటూ, అప్పనంగా వచ్చిన డబ్బుని వాడుకుంటూ బరువు పెరిగేవు. విచ్చల

## అభిమాన పాఠకులకు సరికొత్త శీర్షిక

# చతుర ప్ర.జ.

**గణేష్‌ను ఎందుకు నిమజ్జనం చేస్తారు?**
**హారతిని కళ్లకు అద్దుకోవచ్చా?**
**మరణానంతరం జీవాత్మ గమ్యస్థానం ఏమిటి?**

ఆచార వ్యవహారాలు.. సంస్కృతీ సంప్రదాయాలు..
పురాణ ఇతిహాసాలకు సంబంధించి ఎన్నెన్నో సందేహాలు
మాతృభాషా వినియోగ క్రమంలో మరెన్నో శంకలు..

మీ సందేహాలు.. శంకలు సంక్షిప్తంగా రాసి మాకు పంపండి

పంచ సహస్రావధాన సార్వభౌమ **డా. మేడసాని మోహన్**
సమాధానాలు ఇస్తారు. పరిష్కారాలు సూచిస్తారు.

**ప్రతినెలా ఉత్తమ ప్రశ్నకు రూ.116/- పారితోషికం**

# చతుర ప్ర.జ. - 3

ప్రశ్న: ..............................................................................................

..............................................................................................

..............................................................................................

..............................................................................................

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా: ----------------------------------------

----------------------------------------

----------------పిన్ : ------------ ఫోన్ : ----------------

**సూచనలు**

• ఉత్తమ ప్రశ్నను అవధాని డా. మేడసాని మోహన్ ఎంపిక చేస్తారు • మీ ప్రశ్న ద్వారా రాబట్టే సమాధానం పదుగురికీ ఉపయోగపడేలా ఉంటే మేలు. • ప్రశ్న స్పష్టంగా, సంక్షిప్తంగా ఉండాలి • ఒకరు ఎన్ని ప్రశ్నలయినా పంపవచ్చు. ఒక కూపన్‌పై ఒక్క ప్రశ్న మాత్రమే రాయాలి • తుడుపులు, కొట్టివేతలొద్దు • ప్రశ్నల ఎంపికలో సంపాదక వర్గానిదే తుది నిర్ణయం • ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు • ఈ కూపన్లు కూడా తక్కిన వాటితో కలిపి ఒకే కవరులో పంపవచ్చు • ఏ నెల ప్రశ్నలు ఆ నెల కూపన్‌లోనే నింపి పంపాలి.

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

విడిగా ఇక్కడ ఖర్చుపెడుతున్నావు. అమెరికాలో కూపన్లు కట్ చేసి ఎక్కడ వస్తువు చవుకగా దొరుకుతుందా? అని బతికిన నీకు ఆయన డబ్బు విలువ తెలియడం లేదు. ఆయన అమెరికా వచ్చినపుడు, రెండు నెలలపాటు మనతో ఉన్నపుడు ఎప్పుడైనా పట్టించుకున్నావా? ఆయన ఇంటి విలువ నాలుగున్నర కోట్లు అని తెలిసేటప్పటికి ఆయన గురించి ఆలోచిస్తున్నట్లు పోజు కొడతావా? ఇప్పుడమ్మితే ఇ రవైశాతం తక్కువ వస్తుందని, తరువాత ఆలోచిద్దామని అన్నాడు ఆయన. అది నీకు నచ్చకపోతే నువ్వే వెళ్ళి ఆయనతో మాట్లాడు, నన్ను ముందరకి తోయకు"

**కొత్తగాలి...**

**మాఘమాసం**
**మంచు పొగ**
**భూదేవికి**
**సాంబ్రాణి పొగ!**

– ఐనకోట రవి,
నాయుడు పేట, నెల్లూరు జిల్లా

అంటూ నోరు వెళ్ళపెట్టుకుని చూస్తున్న సునందని ఆశ్చర్యంలో ముంచి చెప్పులు వేసుకుని ఇంట్లోంచి బైటపడ్డాడు రంగనాథ్.

రెండవసారి తిరగపడిన భర్త ప్రవర్తన, కొరకరాని కొయ్యలా భీష్మించుకు కూర్చున్న మామగారి ధోరణి సునంద అహం మీద సమ్మెటపోటులా పడితే దానికి చటుక్కున తిరుగుడు తట్టక కుతకు తలాడుతూ బెడ్రూంలోకి ప్రవేశించి టెలివిజన్ ఆన్ చేసింది.

టెలివిజన్‌లో ఏదో హిందీ సీరియల్ నడుస్తోంది. మధ్య తరగతి కుటుంబానికి సంబంధించిన సీరియల్ అది. ఆ సీరియల్‌లో ఏ ప్రాతని చూసినా, ఆఖరికి పని మనిషిని గమనించినా అందరూ నగలతో ధగధగ లాడుతున్నవాళ్ళే. భర్త, ఇతర మగాళ్ళు ఎదురు పడినపుడు ఏదో గౌరవం ప్రదర్శించినట్లు స్త్రీలు మొహం మీదకి ముసుగు లాగేసుకోవడం, వాళ్ళువెళ్ళేక వాళ్ళమీద కుతంత్రపు ఆలోచనలు, రహస్య ప్రేమాయణాలు, ఆస్తికోసం మత లబులు చూడగానే సునంద ఆలోచనలు మళ్ళీ జూబిలీహిల్స్ ఇంటిమీదకి మళ్ళేయి.

ఒక లక్షా? రెండు లక్షలా? కనీసం నాలుగున్నర కోట్ల రూపాయలు. అంటే దాదాపు ఎనిమిది లక్షల డాలర్లు! డెబ్బై ఏళ్ళ ముసిలాయన ప్రతిఘటించేడని ఊరుకుంటామా? అమ్మేస్తే సరి. ముసలాయన మీదకెళ్ళేటప్పుడు ఏమైనా పట్టికెళ్తాడా? ఆ జాగా కొని ఇల్లు కట్టించడం తనకి, తన పిల్లలకే కదా? ఆ వయస్సులో ఏ రోజైనా 'హరీ' అనవచ్చు. అలాంటప్పుడు ముందరే, అదీ మతిమరపు రాక ముందరే తెలివి తెచ్చుకోవచ్చుకదా? అసలింతకీ రంగనాథ్‌ని అనాలి. ఆ మాత్రం వివరించలేని చవటతనాన్ని ప్రదర్శించిన భర్త! రాత్రయేసరికి పక్కకి చేరడం తప్ప ఇంకేం చేతనవును? రంగనాథ్ బాగా ఆర్జించిన రోజుల్లో వచ్చిన సంవత్సరపు జీతానికి ఈ ఇల్లు ఖరీదు దాదాపు ఎనిమిది రెట్లు! శరీరం మీద, దోసిళ్ళతో దురదాకుగుండ పూస్తే ఉద్భవించిన దురద గోక్కోగా మంట పుట్టినట్లు శరీరం, మెదడు చేతకాని తనంతో ఉడికిపోతున్నాయి సునందకి.

"ఎనిమిది లక్షల డాలర్లు" అనుకుంటూ తన అక్కసు వెళ్లగక్కడానికి భర్త ఎప్పుడు వస్తాడా? అని ఎదురు చూస్తోందామె.

రాత్రి తొమ్మిది గంటలయినా రంగనాథ్ జాడలేదు.

"ఎనిమిది లక్షల డాలర్లు" వినోద్,

చిత్రల చదువులకోసం తీసుకున్న స్టూడెంట్ లోన్స్ తీర్చేయవచ్చు ఇంటిమీద, కార్ల మీద అప్పులు తీర్చేయగా కావలసినంత డబ్బు మిగుల్తుంది. ఏడీ ఈయన? అని భర్త కోసం ఆదుర్దాగా నిరీక్షించింది సునంద.




**సా**యంకాలం ఆరుగంటలయింది. కారులోంచి దింపిన బరువు సామాన్లతో తలుపు తీసుకుని ప్రవేశించి సామాన్లని కిచెన్‌లో ఉంచి ఉస్సురంటూ హాలులో సోఫాలో చతికిలపడింది ఏభైఏడేళ్ళ అమృత. ఇల్లంతా నిశ్శబ్దాన్ని ఆప్యాయంగా కౌగిలించుకుని గాఢంగా నిద్రపోతోంది.

ఆకలిలేదు, దప్పికాలేదు. కాని ఏదో ఒకటి చేయకపోతే పిచ్చెక్కేలా ఉంది అమృతకి. అందరూ ఒంటరి తనాన్ని భరించలేరు. 'ఒంటరితనం ఆస్వాదించగలగడం వరం' అన్నారు ఎవరో. దాని మాట ఎలాగున్నా తను మాత్రం విపరీతమైన మానసిక ఒత్తిడికి గురవుతోంది. ఎనిమిది నెలలక్రితం కామేశం గుండెపోటుతో మరణించినప్పట్నుంచి ఒంటరిదైంది. రెండు వేలమైళ్ల దూరంలో ఉంది సుగుణ.

అమృత మెదడు గతంలోకి దౌడుతీసింది. కామేశం చనిపోయిన తరువాత తనతో ఉండమని కూతురు సుగుణ తనని తీసుకెళ్ళింది. సుగుణలో తండ్రి చనిపోయినందుకు విచారం కాని, తనంటే ప్రత్యేకమైన సానుభూతి కాని కనబడలేదు. 'ఆంత్రోపాలజీ' విభాగంలో డిగ్రీ తీసుకున్న సుగుణకి ఉద్యోగావకాశాలు తక్కువ కావడంతో ఏదో చిన్న ఆఫీస్‌లో పన్జేస్తోంది. ఉద్యోగం దొరకక కొన్నాళ్ళు, జీతం తక్కువిచ్చే ఉద్యోగానికి ఉదయం ఓ గంట, సాయంకాలం ఇంకోగంట ప్రయాణానికి వెచ్చించడానికి ఇష్టంలేక కొన్నాళ్లు ఉద్యోగంలో చేరలేదు. తరువాత కూతురు పుట్టడంతో పిల్ల సంరక్షణకి ఇబ్బంది అవుతుందని మరో మూడేళ్ళు ఉద్యోగానికి వెళ్ళకుండా గడిచేయి. కూతుర్ని క్రచ్‌లో ఉంచి 'ఏదో ఒక ఉద్యోగం' అంటూ ఇంటికి దగ్గరగా ఉన్న ఉద్యోగంలో చేరేటప్పటికి డిగ్రీ తీసుకున్న తరవాత ఎనిమిది సంవత్సరాలు గడిచేయి.

సుగుణ భర్త శంకర్రావ్ ఇంజనీర్.

"ఈ దేశంలో ఆర్థికంగా ఎదగడానికి భార్యాభర్తలు ఇద్దరూ ఉద్యోగం చేయడం ఎంతో ముఖ్యం. సుగుణకి డిగ్రీ ఉన్నా ఏం లాభం? ఆ డిగ్రీకి విలువ లేదు. ఆంత్రోపాలజీ విభాగంలో కాకుండా ఏ కంప్యూటర్ సైన్స్‌లోనో, కెమిస్ట్రీలోనో చేసి వుంటే మంచి ఉద్యోగం లభించేది. మావగారు సుగుణని అవసరమైన కోర్సు చేయిస్తే ఆమెకి ఈ ఉద్యోగపు వేటలో ఇబ్బందులు ఉండేవికావు. జీతమూ ఎక్కువ వచ్చేది" అన్నాడు ఒకరోజు.

భర్త దెప్పిపొడుపు నచ్చకపోయినా సుగుణ ఏమీ మాట్లాడలేదు. అమృత కూడా మౌనం వహించింది మొదటిసారి. కాని శంకర్రావ్ అదే భావనని రెండు మూడుసార్లు వ్యక్తపరచినపుడు "ఆయన సుగుణను విభాగం మార్చుకొమ్మని చెప్పేరు. కాని సుగుణ వినిపించుకోలేదు" అంది భరించలేక.

"బాగుందండీ, సుగుణ అప్పట్లో చిన్న

పిల్ల. ఏది మంచిదో, ఏది మంచిది కాదో పెద్దవాళ్ళకి తెలిసినట్లు అప్పుడే హైస్కూల్ చదువు ముగించిన సుగుణకి ఎలా తెలుస్తుంది? " అన్నాడు శంకర్రావ్.

శంకర్రావ్ చదువంతా ఇండియాలోనే నడిచింది. ఇంజనీరింగ్ విభాగంలో మాస్టర్స్ డిగ్రీ పుచ్చుకుని అమెరికా వచ్చిన శంకర్రావ్‌కి తన స్వంత చిన్ననాటి అనుభవం మీద చాలా నమ్మకం. ఇండియాలో పిల్లల చదువుమీద తలిదండ్రుల ప్రభావానికి, అమెరికాలో పుట్టి పెరిగిన పిల్లల మీద తల్లిదండ్రుల ప్రభావానికి చాలాతేడా ఉందని చెప్పాలనిపించింది. కాని అల్లుడితో వాదనకి దిగడానికి సుముఖంగా లేక తను మౌనంగా ఉండిపోయింది.

సుగుణ, శంకర్రావ్ ఉద్యోగాలకి ఉదయం ఏడున్నర గంటలకి వెళ్ళి తిరిగి సాయంకాలం ఆరున్నర, ఏడుగంటలకి తిరిగొస్తుంటే మనవరాలు జ్యోతిని సముదాయించే భారం తనపై పడింది. ఏడేళ్ళ జ్యోతికి మంకుపట్టు ఎక్కువ "పిల్లలు అందరూ అంతే" అని తను ఎంతసరిపెట్టుకున్నా, చెప్పినమాట అస్సలు వినేదికాదు.

'ఎర్రరంగు గౌన్ వేసుకుంటాను' అంటే చాలు, అది వేసేదాక జ్యోతి ఏడుపు ఆపేదికాదు.

"ఈవేళ నాకు పీజా కావాలి" అందొక రోజు.

"ఈవేళ దోసెలు వేసేను, రేపు పీజా తిందువుగాని" అంటే జ్యోతి ఎంతమాత్రమూ తనపంతం సడలించలేదు.

"రోజురోజుకీ జ్యోతి మంకుపట్టు ఎక్కువవుతోంది. కట్టడి చేయకపోతే లాభం లేదు" అంది తను ఒకరోజు దాని ఆగడం భరించలేక.

"దీనిలో లాభం, నష్టం అంటూ ఏమీ లేదు. ఉన్నది ఒకే ఒక పిల్ల. దానికి నచ్చినట్లు చేయడంలో ఆనందం ఉంది. తల్లిదండ్రులు, తాత అమ్మమ్మలు తమ ఉద్దేశాలని వాళ్ళమీద రుద్దితే వాళ్ళు క్రమేణా వాళ్ళ ఆలోచనాశక్తిని కోల్పోతారు. వాళ్ళలో ఉన్న సృజనాత్మక కళ చచ్చిపోతుంది" అన్నాడు శంకర్రావ్.

'నోర్మూసుకోండి. తెలియని అనవసర విషయాలలో జోక్యం చేసుకోకండి'అని నేరుగా చెప్పకుండా, చెప్పినట్లున్న పూతపూసిన అల్లుని మాటలకు ఆలోచనలో పడింది అమృత.

పగలు పన్నెండు గంటలు వాళ్ళుండరు. ఆఫీసుల నుంచి తిరిగి వచ్చి "అబ్బ! తెగ అలసిపోయేం" అంటూ నిస్తేజంగా కాస్సేపు కాళ్ళు జాపుకుని, డిన్నర్ తిని, పగలు రికార్డయిన టెలివిజన్ ప్రోగ్రాం చూస్తూ, ఆవలిస్తూ, 'నాకు నిద్రవస్తోంది' అంటూ రోజు ముగించే వాళ్ళ జీవితాలు ఒక ధోరణిలో వెళ్తుంటాయి. 'తన మాటకి ఏమైనా విలువ ఉందా? ' అన్నది అనుమానమే అయినా 'తను వాళ్ళకి ఏవిధంగా ఉపయోగపడుతోంది? లేకపోతే తను ఇక్కడ ఎందుకున్నట్లు? ' అన్న ప్రశ్న కళ్ల ముందర తరచూ నిలిచేది. ఆ సమయంలో "హైదరాబాద్ నుంచి ఓ వేదాంతి వచ్చేడు. సాయంకాలం అతని భాషణ ఉంది, వెళ్దాం" అన్నాడు శంకర్రావ్.

ఆశ్చర్యంగా అతని వేపు చూసింది.

"సాయంకాలం ఒకరింటికి మేం వెళ్ళాలి. ఈ ఉపన్యాసవేదిక మేం వెళ్లబోయేచోటుకి దగ్గరే. మిమ్మల్ని అక్కడ వదిలేసి తరువాత పికప్ చేస్తాం" అన్నాడు అల్లుడు.

తీరా అక్కడికి వెళ్లాక "ఈ ఉపన్యాసం వినడానికి టిక్కట్ అంటూ ఏమీలేదు. కాని ఆయనని ఇక్కడకు తీసుకురావడానికి ఖర్చులు ఉంటాయిగా. మీకు తోచిన డొనేషన్ ఇస్తే బాగుంటుంది. బలవంతమేమీ లేదు" అన్నాడు ఒక కార్యకర్త.

శంకర్రావ్ ముడుచుకున్న మొహాన్ని

అదుపులోకి తెచ్చుకుంటూ పర్స్‌లోంచి పది డాలర్లు తీసి కార్యకర్తకి అందిచ్చేడు.

"మీరు ఇక్కడే ఉండండి, మేము త్వరగానే వచ్చేస్తాం" అంటూ నిష్క్రమించకముందరే ఉపన్యాసం మొదలైంది. ఆ ఉపన్యాసం ఏ అంశం మీదో తను గ్రహించలేదు, దానిమీద దృష్టినీ కేంద్రీకరించలేదు. "మంచానపడినప్పుడు ఇంకొకరి సహాయం కావాలి. పుట్టినప్పటి దశ తిరిగి వస్తుంది. ఇది అందరూ చూసేదే. యవ్వనం ఒక వరం, వృద్ధాప్యం ఒక శాపం అంటూ ఎవరో అనగా విన్నాను. అయితే వృద్ధాప్యాన్ని శాపం అననవసరంలేదు. వృద్ధాప్యం ఎపుడు మొదలవుతుంది? " అంటూ ఉపన్యాసకుడు ఆగేడు.

### కొత్తగాలి...

**బాణసంచా మిరుమిట్లకి**
**తోకముడిచిన చీకట్లు**
**పేదల ముంగిళ్లలో**
**గూడుకట్టుకు నిలిచాయి**

– పి. స్వర్ణకుమారి,
రాజమండ్రి

'అరవయ్యవ ఏట' అని కొందరు, 'అమెరికాలో అరవైఎనిమిదవ ఏట' అని మరి కొందరు అరిచినంత బిగ్గరగా సమాధానమిచ్చేరు.

చిరునవ్వు నవ్వేడు ఉపన్యాసకుడు. "వృద్ధాప్యం గురించి మనం ఎప్పుడైతే ఆలోచించడం మొదలెడతామో అప్పుడే మొదలవుతుంది" అన్నాడు ఉపన్యాసకుడు. ఒక్కసారి హాలులో నిశ్శబ్దం నెలకొంది. తిరిగి ఉపన్యాసకుడు ప్రసంగాన్ని అందుకున్నాడు. తన మనస్సులో ఆలోచనలు దొర్లుకువచ్చేయి అమృతకు. తనకి ఇప్పుడు ఏభై ఏడేళ్ళు. ఇతరులమీద ఆధారపడే స్థితిలో లేదు. ఇతరులు తన జీవిత గమనాన్ని జీవితధ్యేయాన్ని నిర్దేశించడమెందుకు? తను వృద్ధాప్యపు ఆలోచనవేపు చూడకూడదు, చూడదు. దానికి ఇంకా చాలా వ్యవధి ఉంది" అని అనుకుంటుంటే చప్పట్ల ధ్వని తనని ఆలోచనల్లోంచి మేల్కొలిపింది. చేతివాచీ తొమ్మిది గంటలు చూపిస్తుంటే ఇతర శ్రోతలతోపాటు బైటకి నడిచింది తను. కార్యకర్తలు కుర్చీలు సర్దుకోవడం పూర్తవుతుంటే అర గంట తరువాత "అప్పుడే ఉపన్యాసం అయిపోయిందా? " అంటూ వచ్చి అటూ ఇటూ చూసేడు శంకర్రావ్.

తలూపి శంకర్రావ్ వెనకాల నడిచింది తను.

రెండురోజుల తరువాత బెడ్రూంలో సుగుణ, శంకర్రావ్‌ల మధ్య జరుగుతున్న సంభాషణ తన చెవిలో పడింది.

"మా అమ్మ కేలిఫోర్నియాకి వెళ్ళిపోతానంటోంది. ఫ్లైట్ టిక్కట్ కొనమని స్పష్టంగా చెప్పింది" అంది సుగుణ. రాత్రి పదిగంటలకి నిశ్శబ్దంగా ఉన్న ఇంట్లోంచి సంభాషణ వినిపిస్తోంది.

"ఇప్పుడు అక్కడకి వెళ్ళవలసిన అవసరం ఏముంది? మనం ఆఫీసు నుంచి రావడం ఆలస్యమైనా ఆమె ఉంటే జ్యోతి గురించి బెంగ అక్కరలేదు. మనం ఎప్పుడైనా సాయంకాలం ఎక్కడికైనా వెళ్ళాల్సి వస్తే, ఆమె ఉంటే మనకి ఎవరి సహాయమూ అక్కరలేదు. అక్కడ ఇల్లు అద్దెకి ఇచ్చేసి ఇక్కడికి వస్తుందనుకున్నానే" అన్నాడు శంకర్రావ్.

"అవును. మా అమ్మ కేలిఫోర్నియా రాష్ట్రానికి తిరిగి వెళ్ళడానికి ప్రత్యేకమైన కారణాలేమీ నాకు కనిపించడంలేదు" అంది సుగుణ భర్తతో ఏకీభవిస్తూ.

కేలిఫోర్నియా తిరిగి రావడానికి కార

ణాలు ఒక పక్కన పెడితే అక్కడ ఉండడానికి కారణాలేమిటి? ఎన్నాళ్ళు అక్కడ ఉండగలదు? అక్కడ నెలకొన్న జీవితాన్ని తను శేషజీవితమంతా భరించగలదా? చెప్పినమాట వినిపించుకోని మనవరాలు!

"పిల్లలు పిల్లలే కదా, వాళ్ళమాట కాదంటే మనం వాళ్ల మంచి కోరడంలేదన్న అపోహ వచ్చి వాళ్ళు మనకి దూరం అవుతారు. ఈ దేశంలో సైకాలజిస్ట్లు ఇలాంటి అంశంమీద తెగ పరిశోధన చేసి ఇవన్నీ కనుక్కున్నవే" అంటూ శంకర్రావ్ జ్యోతినే సమర్థిస్తుంటే, ఆ పిల్ల దృష్టిలో తను క్రమేణా దిగజారిపోతోంది. ఆ అనుమానం మొదలైనప్పటి నుంచి తనలో కొత్త అసహనం మొదలైంది. ఇక్కడ ఉంటే తను మౌనంగా ఏమీ పట్టనట్లు ఉండలేదు. తను కలగచేసుకుంటే అవాంఛనీయమైన సన్నివేశాలు ఎదురవవచ్చు. అలాంటి ఊబిలో ఎక్కువ కూరుకుపోక ముందరే బైటపడకపోతే తరువాత అది సాధ్యపడకపోవచ్చు. గరాజ్‌లో ఒకసారి వాడి మూలపడవేసిన పనిముట్టులా ఇంటిలో తన ఉనికి మరుగున పడడం తను సహించలేదు. అందుకే తన స్వంత ఇంటికి వెళ్లిపోతానని ఖండితంగా కూతురితో చెప్పింది. అలా చెప్పడంతో తాత్కాలికంగా సుగుణ, శంకర్రావ్‌ల మధ్య ఘర్షణ రేగుతుందేమో అనిపించినా 'అది తాత్కాలికం, వాళ్ళు సర్దుకుంటారు' అనుకుంది తను.

పదిరోజుల తరువాత స్వంత ఇంటికి చేరుకుంది తను.

ఇక్కడ తను ఒంటరిగా బతకగలదా? ఇంటిలో ఏ రకమైన మరమ్మతులు వచ్చినా, కామేశం సమర్థంగా సరిచేసేవాడు, లేదా సరిచేయించేవాడు. తనకి అలాంటి చతురత లేదే! కామేశం ఆకస్మిక మరణం తరువాత వచ్చిన ఇన్సూరెన్స్ డబ్బు, రిటైర్‌మెంట్ డబ్బు గణనలోనికి తీసుకుంటే, తనకి ఆర్థిక ఇబ్బందులేమీలేవని విశదమైంది. అప్పులు ఏమీలేవు. అయినప్పటికీ తను అమెరికా వంటి దేశంలో ఒక విధంగా ఒంటరి! అనుకుంటూ గింజుకుంది అమృత.

సుగుణ దగ్గరనుంచి స్వంత ఇంటికి తిరిగి రావడం పెనం మీద నుంచి పొయ్యిలో పడిన పెసరగింజ మాదిరి అవుతుందేమో? అందరికీ జీవితకాలంలో ఇలాంటి అలజడులు వస్తాయా? లేక ఇది తనకే వచ్చిందా? అనుకుంటూ కళ్ళు మూసుకుంది అమృత.

కేలిఫోర్నియాకి తిరిగి వచ్చేక అడపాదడపా సుగుణతో మాటలాడడం మినహా ఇంకెవరికీ తను ఫోన్ చేయలేదు. తనకి ఉన్న పరిచయస్థులందరూ తను సుగుణ దగ్గరే ఉంటోందని అనుకుంటున్నారు కాబోలు. అతి దగ్గరగా ఉన్న సునంద, రంగనాథ్‌లు ఇండియా వెళ్ళేరు. తిరిగి వచ్చేరో లేదో తను వాకబు చేయలేదు. ఇంకెవరి దగ్గరి నుంచి వస్తాయి తనకి టెలిఫోన్లు? అనుకుంటూ బ్రేక్‌ఫాస్ట్‌కి కావలసిన సరుకులు అయిపోయాయని జ్ఞాపకానికి రావడంతో వాల్‌మార్ట్ దుకాణానికి వెళ్ళి అవి తెచ్చుకుందామా? అన్న ఆలోచన వచ్చింది. దగ్గరగా ఉన్న వాల్‌మార్ట్ దుకాణానికి మార్గం కనుక్కోవడానికి కంప్యూటర్ తెరచి వివరాలు వెతుకుతుంటే, కంప్యూటర్ స్క్రీన్ మీద వివిధ రకాల ఎడ్వర్టయిజ్‌మెంట్లు ఉండడం గమనించింది. 'బరువు తగ్గాలా? బరువు పెరగాలా?', 'మీకు ఇన్సూరెన్స్ కావాలా?', 'మీకూ మీ భార్యకి పక్కపక్కని పాతిపెట్టడానికి చవుకగా స్థలం కావాలా?', 'ఈ పరిగెడుతున్న కోతిని మీరు పట్టుకోగలిగితే ఒక ప్రైజ్ వస్తుంది పట్టుకుంటారా?' లాంటి ఎడ్వర్టయిజ్‌మెంట్లు అమృతని

ఆశ్చర్యపరిచేయి. "మీరు ఒక్కరే ఉంటు న్నారా? స్నేహం చేయడానికి సిద్ధంగా ఉన్నారా?" అని స్క్రీన్‌పై కనిపిస్తే దాని వేపు చూస్తూ వాల్‌మార్ట్ దుకాణానికి వెళ్ళడానికి దారి వివరాలు రాసుకుని కంప్యూటర్ మూసి కారుతాళాలు అందు కుంది అమృత.

వాల్‌మార్ట్ స్టోర్‌లో జనం రద్దీగాలేరు. స్టోర్ ప్రవేశద్వారం దగ్గర కొంతమంది, వయసుమళ్ళిన వాళ్ళు ఎదురుపడి "మీరు ఈవేళ ఎలా ఉన్నారు?" "వస్తువులు ఉంచడానికి తోపుడుబండి కావాలా?" అని స్వాగతం పలుకుతూ కార్ట్‌ని అందిస్తు న్నారు. వాళ్ళలో నలుగురైదుగురు భారతీ యులు ఉండడం చూసి 'ఈ వయస్సు పై బడిన ఇండియన్లు ఉద్యోగం చేయడానికి కారణమేమిటి? పిల్లలకి ఆర్థికంగా సాయ పడదామనా? లేక ఇంట్లో గోళ్ళు గిల్లుకుని కూర్చునేకంటే ఈ పనిలో చేరితే నెలకి దాదాపు వెయ్యిడాలర్లు ఆర్జించవచ్చనా? వీళ్ళలో ఎందరు ఒంటరి జీవితం గడుపు తున్నారు?' అన్న ప్రశ్నలు అమృత మెద డులో మొలిచేయి. తను ఈ మధ్య జీవి తంలో అన్ని అంశాలనీ, సంఘటనలనీ ఒకే కోణంలోంచి చూస్తోందా? అనుకుం టుంటే "ఒరేయ్! సాయంకాలం ఆరున్నర గంటలకి వస్తాను. కబుర్లు చెప్పుకుందాం. ఫ్రిజ్‌లో చల్లని బీర్ ఉంచు" అన్న తెలుగు మాటలు విని తలెత్తి చూసింది.

దాదాపు ఇరవైఆరు- ముప్పయిఏళ్ళ వయస్సులు ఉంటాయేమో. చేతులు ఊపు కుంటూ తమకార్లలో ఎక్కి వెళ్ళిపోయేరు.

కామేశం ఉన్నపుడు తాము ఇబ్బందు లని చర్చించుకునేవారు, అప్పుడప్పుడు మ ద్యం పట్టించేవారు. ఏ ఇబ్బందులూ లేక పోయినా రోజులెలా సాగుతాయి? సాయంకాలం ఎలా గడుస్తుంది? లాంటి ప్రశ్నలు తనని ఇప్పుడు మానసికంగా ఒత్తిడి చేస్తున్నాయి. ఒక్కర్తికీ వంట చేసు కోవడానికి విసుగేసి ఇండియన్ స్టోర్ నుంచి తెచ్చుకున్న తిండి తింటుంటే సమయం ఇంకా ఎక్కువగా మిగిలిపో తోంది. శారీరకంగా ఆరోగ్యంగా ఉన్నా త్వరలో తనకీ సమస్యలు ఉత్పన్నమవు తాయి. అప్పుడు ఒంటరితనం తనని ఇంకా తీవ్రంగా ఇబ్బంది పెడుతుంది. ఒంటరితనం అనే ఉధృత వరదనీటి ప్రవా హంలో తను గడ్డిపోచలా విలవిలలా డుతూ కొట్టుకుపోకుండా ఎలా నిలదొక్కు కోవడం? అబ్బ! ఈ ఆలోచనలు కట్టిపెట్టి ఒక మంచి కాఫీ తాగివస్తే? అన్న మారు ఆలోచన రాగానే కారు తాళాలు అందు కుంది. పది నిమిషాలు గడిచేలోగా ఫ్రీమాంట్ హబ్‌లో స్టార్‌బక్స్ కాఫీహౌస్ కనిపించగానే దుకాణానికి రెండువందల అడుగుల దూరంలో కారుని పార్క్ చేసి దుకాణం వేపు నడక పెట్టింది. పరిసరా లని పరికిస్తూ అడుగులు వేస్తున్న అమృ తకి రెండు దుకాణాల మధ్య ఉన్న ఖాళీ జాగాలో కుర్చీలలో, గ్రెనైట్ చప్టాలమీద గుంపులు గుంపులుగా కూర్చున్న ఇండి యన్లు కనిపించేరు. సర్దార్జీల గుంపు ఒకటి, ఉత్తరాదివాళ్ళ గుంపు ఇంకొకటి. అధికశాతం మంది వయస్సు మళ్ళినవాళ్ళే. వీళ్ళందరూ ఈ దుకాణాల కాంప్లెక్స్‌లో పని చేస్తున్నారా? అన్న అనుమానం వచ్చింది అమృతకి. మాతృభాషలో మాట లాడుకుంటూ, ఒకరి భుజాలమీద ఇంకొ కరు పడుతూ, ఎవరో జోక్ వినిపించేడు కాబోలు.. వంకర్లు తిరిగి నవ్వుకుంటున్న వాళ్ళని చూడగానే అమృతకి ఈర్ష్య కలి గింది. వ్యక్తిగత ఈర్ష్యకాదు. తనలో ఉన్న వెలితిని బహిర్గతపరుస్తున్న ఆ సమూహ ఆనందం తనకి లేకపోవడంతో కలిగిన ఈర్ష్య అది. ఆ సమూహాన్ని దాటి వెళ్తుంటే వాళ్ళ సంభాషణ తాత్కాలికంగా

ఆగింది. తను దుకాణంలోనికి ప్రవేశించేం తవరకు పదిజతల కళ్ళు తనని వెంటాడే యనిపించింది అమృతకి.

కాఫీకోసం క్యూలో నిలబడిన అమృతకి "కల్ మిలేంగి" అన్న అరుపు వినిపించేక అయిదు నిమిషాలలో గుంపు మాయమ యింది. 'లంచ్ సమయంలో ఇక్కడకి వచ్చి కబుర్లు చెప్పుకుంటున్నారు' అనుకుం టుంటే "వాటీజ్ యువర్ ప్లెజర్? " అన డిగింది కౌంటర్‌లో ఉన్న పిల్ల.

"కూల్ కాఫీ" అంటూ రెండు డాలర్ల బిల్ అందిచ్చింది.

చూడముచ్చటగా ఉంది కౌంటర్ పిల్ల. కాఫీ అందిస్తూ "ఎంజాయ్ యువర్ కాఫీ" అంది.

కాఫీ దుకాణం రద్దీగా ఉంది. పనివాళ్ళు చురుకుగా పనిచేస్తున్నారు. కాఫీ అందిచ్చి నపిల్ల తనతోటి వర్కర్ వేపు ప్రత్యేకమైన చూపులు విసురుతుంటే, అవి అందుకు న్నానన్న ప్రతిచూపులు తిరిగి పంపుతు న్నాడతను.

కిటికీ దగ్గరగా ఉన్న కుర్చీలో కూర్చుని కాఫీ తాగడం మొదలుపెడుతూ 'ఇంతకాఫీ నేనొక్కర్తినీ తాగలేను, ఇంకొకరితో పంచు కోవలసినంత ఉంది' అనుకుని చెత్తకుం డీలో సగం కాఫీని ఒంపింది. కాఫీ దుకా ణంలో తన గురించి ఎవరూ పట్టించుకో వడం లేదు. కాసేపుక్రితం ఇండియన్ల గుంపు తనని పరీక్షగా చూడడం, తను వాళ్ళని దాటినా వాళ్ళదృష్టి తనమీదే నిల వడం జ్ఞాపకానికి రాగానే మొహం మీదకి చిరునవ్వు వచ్చింది. "నీ వయస్సు ఏభైనా లుగైనా, ఇంకా చాల తక్కువ వయస్కురా లిలా కనిపిస్తావు" అన్నాడు కామేశం నాలుగేళ్ళ క్రితం ఈర్ష్యతో ప్రశంసిస్తూ.

పొగడ్త! కావాలని అభిలషించదు తను, కాని చెవిలో పొగిడిన గుసగుసలు నన్ను తెగ ఉత్తేజపరుస్తాయి! అంటూ తనెక్కడో చదివింది. 'అది నిజం' అనుకుంది అమృత. ఆనందం వ్యక్తిగతమే అయినా, దానిని ఇంకొకరితో పంచుకోవడంలో ఒక ప్రత్యేకత ఉంది అనుకుని ఖాళీ కప్పుని చెత్తకుండీలో గిరవాటేసి కారు నడుపుతూ చేతివాచీ వేపు చూస్తే వాచీ మూడుగం టలు చూపించింది. అంటే కాఫీ ఆలోచన లతో రెండుగంటలు గడిచేయన్నమాట.

## చతురలో ఏడో నవల!



### అక్కినపల్లి సుబ్బారావు

అక్కినపల్లి సుబ్బారావు విజయనగ రంలో 1939లో జన్మించారు. విద్యాభ్యాసం విజయనగరం, కాకినాడ, చెన్నై, ఢిల్లీలలో సాగింది. ఐ.ఐ.టి ఢిల్లీ నుంచి పిహెచ్.డి పట్టా పొందారు. తర్వాత అమెరికా వలస వెళ్లారు. 1999లో విస్కాన్‌సిన్ యూనివ ర్సిటీ నుంచి ఎమిరెట్ ప్రొఫెసర్‌గా పదవీ విరమణ చేశారు. 'చతురలో 'నీళ్లలో చంద్రుడు', 'శీతాకాలం సూర్యుడు', 'అంచు అంచుకీ మధ్య', 'మరో వసంతం', 'సంజ వెలుగు' తదితర ఆరు నవలలు ప్రచురి తమయ్యాయి. ఇవి కాకుండా విపుల తది తర తెలుగు పత్రికలలో దాదాపు డెబ్బై కథలు అచ్చయ్యాయి. 'తోడు' చతురలో ఆయన ఏడో నవల.

**చిరునామా:**
**డా. అక్కినపల్లి సుబ్బారావు,**
ఫ్లాట్ నెం. 412, సాయి టవర్స్-2
జైలు రోడ్డు, విశాఖపట్నం-530002

ఇంటికి తిరిగి వెళ్ళి ఏం చేయాలి? నిర్మానుష్యంగా ఉన్న ఆ ఇంటికి కళ ఎలా తెప్పించడం? అనుకుంటూ గరాజ్‌లోనికి కారు నడిపింది అమృత.

'ఈవేళ వంటిల్లు సర్దాలి', 'ఈరోజు పరదాలకి ఊడిపోయిన హుక్స్ కుట్టాలి', 'ఈరోజు తోటపని చేయాలి', 'ఈరోజు బేంక్ కాగితాలు చూడాలి' అంటూ నాలుగు రోజులు పని కల్పించుకున్న అమృతకి అయిదవరోజు వచ్చేసరికి ఏంచేయాలో తెలియలేదు. 'గోళ్ళసింగారింపు, కనుబొమ్మలు సరిదిద్దించుకోవడానికి వెళ్దామా?' అనిపించినా ఎందుకు ఈ అలంకరణ? అద్దంలో చూసుకోవడానికా? అన్న ప్రశ్నకి సమాధానం దొరకక ఆ ఆలోచనని వెనక్కి నెట్టింది.

మరో రెండురోజులు భారంగా గడిచేటప్పటికి అమృతకి దాదాపు పిచ్చెక్కినట్లనిపించింది. ఈవేళ బైటకి వెళ్ళకపోతే పరిస్థితి అదుపు తప్పేలా ఉంది. మాల్‌కి వెళదామా? అనుకుంటుంటే సన్నని జల్లుతో ఆరంభమైన వాన ఉధృతంగా మారింది.

బూడిదరంగు ఆకాశం తనని చూసి విచారపడి విలపిస్తున్నట్లు మేఘంలోంచి వాన కురుస్తుంటే 'ఇవాళ్టికి బైటకి వెళ్ళే ఆస్కారంలేదు' అని నిట్టూరుస్తూ వానని చూస్తోంది అమృత. వానని చూడడం ఒక అరగంట తరువాత ఆపి పాతఫోటో ఆల్బంని చేతిలోనికి తీసుకుంది. పాత జ్ఞాపకాలు, స్మృతులు అమృతని ఇబ్బంది పెడుతుంటే ఆల్బం మూసింది అమృత.

రెండురోజులు గడిచేక 'ఈవేళ థియేటర్‌కి వెళ్ళి సినిమా చూడాలి' అనుకుంటూ బయలుదేరింది అమృత. విడ్డూరంగా అనిపించిందో లేక అది తన ఊహేమో కాని టిక్కట్ కౌంటర్‌లో 'ఒక టిక్కట్' అనగానే కౌంటర్‌వ్యక్తి యథాలాపంగా టిక్కట్ ఇవ్వకుండా రెండు సెకన్లపాటు ఎక్కువ తన మీద దృష్టి నిలిపేడు. ఇరవై థియేటర్లు ఉన్న భవనంలో సినిమాలు చూడడానికి వచ్చిన ప్రేక్షకులతో ధగధగా వెలుతురుతో ఆవరణం కళకళలాడుతోంది. అటూఇటూ పరీక్షగా చూసిన అమృతకి పిల్లలతో వచ్చిన తల్లిదండ్రులు, ఫ్రెండ్స్ గుంపులు, ఆడా- మగా జంటలు కనిపించేరు. ఒంటరిగా సినిమా చూడడానికి వచ్చినవాళ్ళు ఒకరో, ఇద్దరో మాత్రమే ఉన్నారు. జనం థియేటర్లవేపు కదులుతుంటే ఎదురుగా పాప్‌కార్న్ అమ్మే దుకాణం వెనుక అద్దంలో అమృతకి తన ప్రతిబింబం కనిపించింది. అయిదడుగుల ఆరంగుళాల పొడవు, పొడవుకు తగ్గ శరీరంతో ఉదాసీనత మూర్తీభవించిన ప్రతిబింబం ఏదో కోల్పోయిన వస్తువు కోసం వెతుకుతూ ఆరాటపడుతున్నట్లు దర్శనమయింది. బలంగా కంటిరెప్పలని రెండు సెకన్లపాటు మూసేక థియేటర్‌లోనికి నీరసంగా ప్రవేశించింది అమృత. ట్రెయిలర్స్ నడుస్తున్నంతసేపూ కులాసాగా చెట్టాపట్టా లేసుకుని లోపలికి వస్తున్న ప్రేక్షకులలో ఒకరో, ఇద్దరో మాత్రం ఒంటరిగా వచ్చి కూర్చున్నారు. సినిమా మొదలైంది.

సినిమా వేపు దృష్టి నిలిపింది అమృత.

**కొత్తగాలి...**

**శాసనం గుడ్డికన్ను**
**పాలన మెల్లకన్ను**
**న్యాయమే తెరవాలి**
**మూడోకన్ను!**

– కర్లపాలెం హనుమంతరావు,
మోతీనగర్, హైదరాబాద్

'టెర్రరిస్ట్' అన్న అనుమానంతో తీసుకుపోయిన భర్త విడుదలకోసం అతని భార్య పడిన కష్టాలు, చివరికి సాధించిన విజయం మీద అల్లినకథ. ఒంటరిగా ప్రయాణం చేస్తూ కారు ఏక్సిడెంట్‌కి గురయితే చాలా సమయం సహాయం అందక ఆమె పడిన కష్టం, నిస్సహాయతని చూపిస్తుంటే అమృత కంటిలోంచి నీళ్ళు జలజలా రాలేయి. సుఖాంతమైన సినిమా చూసినా బరువెక్కిన అమృత గుండె తేరుకోలేదు. పరధ్యానంగా ఇల్లు చేరబోతూ కారు హార్న్ వినిపించగానే ఉలిక్కిపడి తను ట్రాఫిక్ నిబంధనలని పాటించలేదని గ్రహించింది. ఇలా ఆలోచనలలో మునిగి కారు నడుపుతుంటే ఏమైనా అవవచ్చు అనుకుంటూ తల పట్టుకుంది అమృత.

తను ఒంటరిగా నివసిస్తోంది. తనకేమైనా అయితే ఎవరు ఆదుకుంటారు? కాలో, చెయ్యో విరిగితే ఆ దారుణమైన నొప్పిని ఎలా భరిస్తుంది? ఎవరో వచ్చి తనని హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలి. తన పరిస్థితి గురించి ఎవరికి తెలుసు? బైటకి ధైర్యంగా కనిపించే తనలో కామేశం వెళ్ళిపోయిన దగ్గరనుంచీ పిరికితనం మొలిచి, పెరిగి ఇప్పుడది మహా వృక్షమయింది. దీనికి విరుగుడు ఏమిటి? ఇలా ఒంటరిగా ఆలోచిస్తుంటే తను డిప్రెషన్‌లోనికి వెళ్తుంది. ఇప్పుడు తను డిప్రెషన్‌లోనే ఉందేమో? డిప్రెషన్ తెలియచేసే గుర్తులేమిటి? 'గూగుల్'లో చూస్తే తెలుస్తుందేమోనంటూ కంప్యూటర్ తెరచింది అమృత. పది నిమిషాలయినా ఇంటర్నెట్ కనెక్ట్ కాకపోవడంతో కంప్యూటర్ కట్టేసి, టెలివిజన్ చూడనారంభించింది.

★ ★ ★

రాత్రి తొమ్మిది గంటలకే నిద్రలోనికి జారడంతో ఉదయం అయిదుగంటలకే అమృతకి మెలుకువ వచ్చింది.

తిరిగి నిద్రపోదామన్న కోరిక విఫలమవడంతో, పెరటివేపు తలుపు తెరచుకుని కాఫీకప్పుతో కుర్చీలో కూర్చుంది అమృత.

ఎదురుగా ఉన్న విద్యుత్ తీగల మీద రెండు పక్షులు కూర్చుని రెక్కలు విదిలించుకుంటూ మీదపడి ఉన్న నీటి తుంపర్లని జారవిడుస్తున్నాయి. ఒకదాని దగ్గర ఇంకొకటి చేరి శరీరాల నుంచి ఉత్పన్నమైన వేడిని పంచుకుంటూంటే 'చలిగా ఉంది' అన్నట్లుగా చిన్నశబ్దం చేసింది ఒక పక్షి. 'ఫరవాలేదు, ఇదిగో సూర్యుడు వచ్చేస్తున్నాడు' అన్నట్లుగా రెండవ పక్షి శబ్దం చేసింది. అది సూర్యునికి వినిపించింది కాబోలు, పాతకాలపు విసనకర్ర మీద ఎరుపు రంగునీళ్ళు జల్లితే విస్తరించిన ఎరుపురంగులా సూర్యుడు అతిపలచని ఎరుపురంగుని ఆకాశం మీదకి వదిలేడు. కాస్సేపు ఆకాశం వేపు చూసిన అమృత దృష్టిని తిరిగి పక్షులమీదకి మళ్ళించింది. ఎదురుగా ఉన్న ఒకే ఒక పక్షి బుర్రని అటూఇటూ గుండ్రంగా, త్వరితంగా తిప్పుతూ తోడు పక్షిని తిరిగి రమ్మన్నట్లుగా కొత్తరకంగా అరుస్తోంది. పదిహేను-పదహారు సార్లు పక్షి అరుపు విన్నాక రెండవ పక్షి వచ్చి మొదట పక్షి పక్కన వాలింది. రెండు పక్షులు ఆనందం ప్రకటిస్తున్నట్లుగా జమిలిగా అరుచుకుంటూ ఎగిరి మాయమయేయి.

ఆకాశం మీదకి ఎగబాకేడు బాలభానుడు. లేతనారింజ రంగు క్రమేణా ముదురు నారింజ రంగులోనికి మారినట్లు క్షణక్షణానికి కాంతి తీవ్రతని పెంచేడు సూర్యుడు.

చల్లారిపోయిన కాఫీని తాగుతూ ఆలోచనల్లోకి ఒరిగింది అమృత.

'జతగా ఉన్న పక్షి ఎక్కడికో వెళ్ళేసరికి ఒంటరి పక్షి ఎంత ఆత్రంతో అరించిందో! జత పక్షి తిరిగిరాగానే స్వాగతం పలికి

నట్లు కులుకుతూ శబ్దం చేసింది' అనుకుం టుంటే అమృత మొహంమీద చిరునవ్వు మొలిచింది.

"పక్షుల భాష తెలిసినట్లు పక్షుల శబ్దాలకు మాటలని ఆపాదించకు. నీ మానసిక స్థితి బట్టి నీ ఊహలు, నీ ఆలో చనలకి సరిపడేలా వాటిని అన్వయించకు" అంటూ మెదడు పొడిచింది.

దానిలో ఎంత నిజమున్నా లేకపోయినా తన పరిస్థితి ఆ ఒంటరి పక్షి పరిస్థితిలాగే ఉంది. గత ఏడెనిమిది నెలలుగా నెలకొన్న ఒంటరితనం తనకి వివరించలేనంత ఆరా టాన్ని, ఆవేదనని సృష్టిస్తోంది. తనకి ఇంకా ఏభై ఎనిమిదేళ్ళే! ఎలాగోలాగ సరిపె ట్టుకుందామంటే ఎన్నాళ్ళు? ఒక సంవత్స రమా? రెండేళ్ళా? ముగింపు వచ్చేంత వరకు తను ఈ ఒత్తిడికి తట్టుకోగలదా? బాధని భరించలేనపుడు గుప్పెడు నిద్ర మాత్రలు మింగి ఒక గ్లాసెడు వైన్ పట్టిస్తే మరి లేవకపోవచ్చు. చనిపోతే తన గురించి వెతికే వారెవరూ లేరు. ఇంట్లోనే శవం పడి ఉంటుంది. కుళ్లి కంపు వచ్చేం తవరకు ఎవ్వరూ పట్టించుకోరు. తరువాత శవపరీక్ష చేయాలంటారు. అందరూ తన గురించి ఏమని వ్యాఖ్యానిస్తారు? 'కామేశం చనిపోయేక వియోగం భరించ లేక ఆత్మహత్య చేసుకుంది' అంటారు. అది పూర్తి నిజంకాదు. తను ఒంటరి జీవి తాన్ని గడపలేక ఆత్మహత్య చేసుకుంది కాని ఎడబాటు వలనకాదు. ఇంతకీ చని పోయే తన గురించి ఎవరు ఏమనుకుంటే ఏమిటి? ఏమిటీ ఆలోచనలు? తను చచ్చి పోయినట్లు, ఆ తరువాత పరిణామం గురించి తీవ్రంగా ఈ ఆలోచనలేమిటీ? ఉహూ! తను ఆత్మహత్య చేసుకోదు. అయితే ఈ సమస్యకి పరిష్కారం ఏమిటి? అనుకుంటూ లేచి స్నానం గది లోనికి ప్రవేశించి వేడినీళ్ళ కింద తల ఉంచింది అమృత.

★ ★ ★

సాయంకాలమయ్యేసరికి అమృతకి టెన్షన్ మొదలవుతుంది. గత అయిదారు రోజులు వేడివేడి నీళ్ళతో స్నానం చేస్తే కాస్త తెరపి ఇచ్చినట్లనిపించి యథాప్రకారం స్నానం గదిలోనికి ప్రవేశించి షవర్‌వి ప్పింది. పది నిమిషాలలో బాత్రూం అంతా వేడినీటి ఆవిరి దట్టంగా నిండిపోవ టంతో రెండుసార్లు చేతితో తుడిస్తే కాని ప్రతిబింబం అద్దంలో కనిపించలేదు. మసక మసకగా అలిసిపోతున్నట్లున్న ప్రతి బింబాన్ని తదేకంగా చూడలేక లైట్లన్నీ ఆర్పి పక్కమీద వాలింది అమృత. వేడినీ ళ్ళతో రిలేక్స్ అయిన శరీరానికి బెడ్రూంలో ఉన్న ఎయిర్‌కండీషన్ ఉపశమనం కలి గించడంతో అమృత కళ్ళు మూతపడ్డాయి.

నిశ్శబ్దంగా ఉన్న గదిలో ఏదో అలికిడి అవగానే అమృత ఉలిక్కిపడి లేచి, చీక టిలో ఎలక్ట్రికల్ స్విచ్ వెంటనే కనపడక గాభరాతో గోడల్ని కొట్టుకుంటూ చేతికి తగిలిన స్విచ్ ఆన్ చేసింది. వెలిగిన లైట్ వెలుతురులో ఇంటి 'అలార్మ్' పనిచేస్తోం దన్నదానికి గుర్తుగా ఎరుపురంగు లైట్ వెలుగుతోంది. హమ్మయ్య! అనుకుంది ని ట్టూరుస్తూ. అయినా దొంగ ఇంటిలోనికి జొరపడి ఉన్నవి దోచుకెళ్తే తనేం చేయగ లదు? అయ్యో! దీన్ని గురించి తను ఇంత వరకు ఆలోచించలేదు. భద్రత! 'అలార్మ్' గురించి పట్టించుకోకుండా ఇద్దరు దొంగలు జొరపడితే ఏ ఇంటికైనా రక్షణ ఉంటుందా? 'గుడ్డిలో మెల్ల' అన్నట్లు అ లార్మ్ రవ్వంత కృత్రిమమైన ధైర్యాన్ని ఇస్తుందంతే అనుకుంటుంటే, సాయంకాలం తనేమీ తినలేదని జ్ఞాపకానికి వచ్చి, రిఫ్రిజ రేటర్‌లోంచి రెండు సమోసాలని తీసింది. మైక్రోవేవ్‌లో వేడిచేసి, ఊదుకుంటూ వాటిని తిని గ్లాసు నీళ్ళు తాగింది అమృత.

కాని రెండుగంటలు గడవక ముందరే అరుస్తూ పీడకలలోంచి లేచింది. తనకి కలలే వచ్చేవికావు. కాని ఈ మధ్యకాలంలో కలలు రావడం సామాన్యమయింది. ఈ భయంకర కల వలన రెండు గంటలు గడవకుండానే తనకి తెలివివచ్చిందనుకుంటుంటే కడుపులో నొప్పి! విపరీతమైన కడుపు ఉబ్బరం ఉధృతమవుతుంటే బాత్రూం మెడిసిన్ కేబినెట్‌లో ఉన్న 'జలోసిల్' రెండు చెంచాలు తాగింది. రెండు సార్లు టాయిలెట్‌కి వెళ్లి వచ్చాక కడుపు పట్టుకుంటూ తలగడని ఆశ్రయించింది అమృత. ఏమయింది తనకి? ఇదంతా చాలాకాలంగా రిఫ్రిజరేటర్‌లో దాచి ఉంచిన సమోసాల మహత్యమే అని అర్థం చేసుకునే సరికి ఒళ్ళంతా కంపించింది. 'జ్వరం వచ్చింది' అనుకుంటూ కంఫర్టర్‌ని పీకలవరకు లాక్కుంది. ఉదయం ఏడుగంటలకి తెలివివచ్చిన అమృతకి కాఫీ తాగాలని ఉన్నా, లేచి కాఫీ కలుపుకునే ఓపికలేక కళ్ళుమూసుకుంది. కాఫీకి బానిస అయిన అమృత కడుపు కాఫీకోసం వెంపర్లాడుతుంటే అతికష్టంమీద పరుపుమీద నుంచి లేచి, రెండుసార్లు తూలిపడబోయి, గోడ ఆసరాతో తమాయించుకుని కాఫీ కాచుకుంది. సగం కప్పు కాఫీ తాగేక కాస్త బలం వచ్చినట్లనిపించి హాల్‌లోనికి చేరి సోఫాలో కాళ్ళు జాపుకుని కూర్చుని మళ్లీ ఆలోచించసాగింది.

మసాలా పడని తను, పాచిపోయిన సమోసా తిని రోగాన్ని కొని తెచ్చుకుంది.

ఇప్పుడేం చేయడం? తొమ్మిది గంటలవుతోంది, ఫోన్ చేసి డాక్టర్ అపాయింట్‌మెంట్ అడగనా? అపాయింట్‌మెంట్ దొరకకపోవచ్చు ఇదేమీ ఎమర్జెన్సీ కేస్ కాదు కదా? డాక్టర్ దగ్గరికి పరిగెత్తేంత తీవ్రమైన జబ్బుకాదిది. రాత్రి కడుపునొప్పి వచ్చినప్పుడు 'అపెండిసైటిస్' లేదా 'గాల్ బ్లాడర్' ప్రోబ్లెమ్ అవవచ్చా? అన్న సందేహం వచ్చింది. ఒకవేళ డాక్టర్ అపాయింట్‌మెంట్ దొరికినా తను కారు నడుపుకుంటూ హాస్పిటల్‌కి వెళ్ళలేదు. లాభం లేదు, మరొక రెండు స్పూన్లు 'జెలోసిల్' తాగి పత్యం చేస్తే ఇంకోరోజు గడిచేటప్పటికి తగ్గిపోతుందని అనుకుంది అమృత.

పత్యం చేయాలి. రిఫ్రిజరేటర్‌లో పత్యం కూరలేమీలేవు. 'బీరకాయ కూర కమ్మగా

## కె.వి.చలం చతురోక్తులు



కె.వి.చలం సాధారణ నటుడైనా హాస్యప్రియుడు, సమయస్ఫూర్తిని ప్రదర్శించి నవ్వులు పూయించడంలో దిట్ట. అతని చతురోక్తులు కొన్ని..

### నాకంటే గ్రేటా?

చిలకాగోరింకా చిత్రం షూటింగు వాహినీ స్టూడియోలో జరుగుతోంది దర్శకుడు ప్రత్యగాత్మ, యస్వీఆర్ ప్రధానపాత్ర చేస్తున్నారు. ఆ చిత్రంతోనే కృష్ణంరాజు, రమాప్రభ వెండి తెరకి పరిచయమయ్యారు. సెట్‌లో కృష్ణంరాజు కాంబినేషన్‌లో యస్వీఆర్‌కి సంబంధించిన వర్క్ జరుగుతోంది. యస్వీఆర్ ఫ్లోర్ బయటికి వచ్చి బర్కిలీ సిగరెట్ అంటించి సీరియస్‌గా వున్నారు. ప్రత్యగాత్మ యస్వీఆర్ దగ్గరికొచ్చి విషయం అర్థంకానట్లు ముఖం పెట్టారు. అదిచూసి యస్వీఆర్ 'చూడండి ప్రత్యగాత్మ! ఆ అబ్బాయెవరో సెట్‌లో తెగ డిస్టర్బ్ చేస్తున్నాడు. అరె! నాకు డైలాగు మాడ్యులేషన్ చెప్తున్నాడేంటండీ!' అన్నాడు విసుగ్గా కృష్ణంరాజునుద్దేశించి.

అందరూ సీరియస్ మూడ్‌లో వున్నారు. కె.వి.చలం కల్పించుకొని 'దీనికంత బాధపడవలసిన పనిలేదండీ. యస్వీఆర్‌గారికి మాడ్యులేషన్ చెప్పాడంటే ఎంతో కొంత అర్థముంది. ఆ అబ్బాయి నాకూ చెప్తున్నాడండీ!' అన్నాడు సీరియస్‌గా. అంతే! యస్వీఆర్‌తో సహా అంతా పగలబడి నవ్వారు.

చేసి ఎవరైనా పట్టుకువస్తే బాగుండును' అనుకునేసరికి అమృతకి నోటిలో నీరూరింది. ఎవరికైనా ఫోన్‌చేసి తన దుస్థితి వివరిస్తే? ఏదో సామెత చెప్పి నట్లు 'ఓస్, ఇంత చిన్నదానికే రాద్ధాంతం చేస్తున్నావు'అంటూ గేలిచేస్తారు. అది ని జమే కానీ, జ్వరం పూర్తిగా తగ్గేంతవరకు ఎవరో ఒకరు ఇంటిలో మసలుతుంటే బాగుంటుంది. కాని అది ఎలా సాధ్యం? ఎవరికి అంత తీరుబడి ఉంది ఈదే శంలో? ఎవరి పరుగులు వాళ్ళే పరిగెత్త లేక అలసిపోతున్నారు. తనకి బ్రెడ్ ముక్కలేగతి. కళ్ళు మూసుకుని గంటలు గడపడమే తప్ప ఇంకే మార్గంలేదు. ఈ రోజు వచ్చిన జ్వరంలో తీవ్రతలేదు. తను తేరుకుంది. కాని ముమ్ముందు పరిస్థితి ఏమిటి? ఇలాంటివి లేదా ఇంతకన్నా గడ్డు పరిస్థితులు ఎదురైతే.. అప్పుడు?

అమృత గుండె ఒక్కసారి జల్లుమంది. ఎలా చూసినా తనకి ఇంకొకరి సహాయం అవసరం ఉంది. ఈ జ్వరం నుంచి బయ టపడగానే, దానిమీద దృష్టి కేంద్రీకరించి పరిష్కారమార్గం కనుక్కోవాలి అను కుంటూ చల్లని కాఫీ ఒక గుటకవేసింది.

కాఫీ ప్రభావమో, ఇంకే కారణమోకాని తిరిగి కడుపులో గుడగుడమన్న శబ్దం విన గానే, కాఫీని సింక్‌లో ఒంపి, ఆరు బ్రెడ్ ముక్కల్ని కాల్చుకుని, రిఫ్రిజిరేటర్‌లోంచి స్ప్రైట్ సీసాని బయటకి తీసింది. మరో రెండుస్పూన్లు 'జెలోసిల్' తాగి, బ్రెడ్ ముక్కల్ని స్ప్రైట్ సీసాతో సహా దగ్గరగా ఉన్న టేబిల్ మీద ఉంచి నీరసంతో పరుపు మీదకి చేరింది. 'మంచి కాఫీ, రుచి కరమైన ఆహారం' అంటూ కడుపు అరు స్తున్నా ఏమీ చేయలేక తలగడని బాదింది.

రోజంతా అర్ధాకలితో అల్లల్లాడుతూ పరుపు మీద విశ్రమిస్తున్న అమృతని ఆలోచనలు మాత్రం వదిలిపెట్టడంలేదు.

నిన్నరాత్రి, ఈ వేళ రోజంతా ఎంత భారంగా గడిచేయో! ఈ వేళ మళ్ళీ నిద్ర మాత్ర వేసుకుంటే కాని నిద్ర రాదు. ఒళ్లంతా పచ్చిపుండులా ఉంది. ఏ కీలుకా కీలు ఊడి వచ్చేలా ఉన్నాయి. జ్వరం తగ్గి నట్లనిపించినా విపరీతమైన నీరసం, నిస్స త్తువ.

వెధవ సమోసాలు! ఇంత రాద్ధాంతం చేస్తాయని తను ఊహించలేదు. ప్రతీ మనిషికి సహాయం అవసరం ఉంటుంది. కామేశం బతికి ఉన్న రోజుల్లో ఈ వెలితి తను ఎప్పుడూ చూడలేదు. ఇప్పుడు జ్వరం రాగానే ఎటు చూసినా ఆ వెలితి భూతంలా వ్యాపించి తనని భయపెడు తోంది. ఈ దేశంలో ఒంటరితనం తను భరించలేదు. ఇండియా వెళ్ళిపోతే? అక్కడ కామేశం దగ్గర బంధువులు, తన మేనమామ కుటుంబం ఉన్నారు. వాళ్ళ సహాయం తీసుకోవచ్చు, జీవితాన్ని నెట్టే యవచ్చు. ఇండియాలో ఒక చిన్న ఫ్లాట్ కొనుక్కోవడమో, లేక అద్దెకి తీసుకోవ డమో చేస్తే తన స్వతంత్రం తనకి ఉంటుంది. డబ్బుకి ఇబ్బంది లేదు కాబట్టి అన్ని హంగులూ అమర్చుకోవచ్చు అని ఆలోచిస్తుంటే దాదాపు పదేళ్ల క్రితం జరి గిన రెండు సంఘటనలు అమృతకి జ్ఞాప కానికి వచ్చేయి. అన్ని రకాల మామిడి పళ్ళు తిందామని వేసవిలో హైదరాబాద్ విమానాశ్రయంలో దిగి బైటకి వచ్చేరు. తెల్లవారుజామున ఎయిర్‌పోర్ట్ లోంచి బైటకి రాగానే వేడి గాలులు మొహాన్ని తాకితే "ఇదేమిటి తెల్లవారు జామునే ఇంత వేడిగా ఉంటే మధ్యాహ్నం ఎలా ఉంటుందో? " అని భయపడుతూ ఎయిర్ కండిషన్డ్ టేక్సీలో కామేశం పెదనాన్న కొడుకు రమేష్ ఇంటికి చేరేరు. వేడికి భయపడి బైటకి వెళ్ళకుండా ఇంట్లోనే గడి పేరు. మామిడి పళ్ళు బాగా తిని మగత

నిద్రలో ఉన్న తనకి కామేశం, రమేష్‌ల మధ్య జరుగుతున్న సంభాషణ సన్నగా వినిపించింది.

"అయిదు లక్షలు చేబదులుగా ఇయ్యి. అమ్మాయి పెళ్ళి సెప్టెంబర్‌లో జరపడానికి నిశ్చయించేను. త్వరలో ఒక ఇన్సూరెన్స్ పాలసీ మెచ్యూర్ అవబోతోంది. నీ డబ్బు నీకు ఇచ్చేస్తాను"

"నా దగ్గర అంత డబ్బు లేదు. అమ్మతతో సంప్రదించి నీకు ఏవిషయమూ తెలియపరుస్తాను"

కామేశం తన దగ్గర ఆ ప్రస్తావన తెచ్చినపుడు "డబ్బు ఇస్తే ఇవ్వండి, కాని మన అమ్మాయి కాలేజీ చదువు, పెళ్ళి దగ్గరలో ఉన్నాయన్న సంగతి జ్ఞాపకం ఉంచుకోండి" అని తను హెచ్చరించడంతో "లక్షన్నర వరకూ సర్దగలను. అంతకన్నా ఎక్కువ ఇవ్వలేను" అని కామేశం, రమేష్‌కి తెలియపరిచేడు.

తరువాత డబ్బు అవసరం లేకుండానే రమేష్ తన కూతురు పెళ్ళి జరిపించేడు. తనేమీ పట్టించుకోకపోయినా కామేశం ఖిన్నుడయేడు.

ఆ వేసవిలోనే తను, కామేశం తన మేనమామ కొడుకు రవి ఇంటికి తరచూ వెళ్లేవారు. తాము తిరిగి అమెరికా వచ్చే ముందర రోజు రవి, రవిభార్య ఉమ వచ్చి "మా వాడికి యూనివర్సిటీ ఆఫ్ కేలిఫోర్నియా, సేంటాక్లారాలో సీటు, వెళ్ళడానికి వీసా వచ్చేయి. కంప్యూటర్స్‌లో ఎమ్.ఎస్. చేయడానికి ఎడ్మిషన్ వచ్చినా ఆర్థిక సహాయం ఇవ్వలేదు. మొదటి సెమిస్టర్‌లో ప్రతిభ చూపిస్తే రెండవ సెమిస్టర్‌లో ఏదో ఒక సహాయం లభించే ఆస్కారం ఉందని తెలిసింది. మొదటి సెమిస్టర్ ఎలాగోలాగ పూర్తయితే వాడు గట్టెక్కేస్తాడు. పూర్తి ఫీజ్ కట్టి, హాస్టల్‌లో ఉండే స్థోమత మాకులేదు. ఆ కేంపస్ ఎలగూ మీ ఇంటికి చాలా దగ్గరలోనే ఉంది. ఒక సెమిస్టర్ మీ ఇంటిలో ఉండడానికి వీలవుతుందా అక్కయ్యా?" అనడిగింది ఉమ.

అవాక్కయింది తను. తేరుకుని "మేము ఇల్లు మారబోతున్నాం. మేం కొనబోయే ఇల్లు ఇప్పుడున్న ఇంటికి చాలా దూరం. మా కొత్త ఇంటిలో ఉండి సేంటాక్లారా కేంపస్‌కెళ్ళడం సాధ్యంకాదు" కొత్త ఇంటి 'వేటలో ఉన్న తను నిజాన్ని చెప్పింది.

కాని రవి, ఉమలు తనమాట నమ్మినట్లనిపించలేదు. వాళ్లనుమానించినట్లే బేరం కుదరక ఆ ఇల్లు కొనడం కుదరలేదు. ఆ ప్రతిపాదన దరిమిలా వీగిపోయింది.

> **కొత్తగాలి...**
>
> **ఆవు చేలో మేస్తే**
> **దూడ గట్టున మేస్తుందా?**
> **ప్రధాని మౌనం వహిస్తే**
> **క్యాబినెట్ మాట్లాడుతుందా!**
>
> – మోదు రాజేశ్వరరావు,
> విశాఖపట్నం

చాలాకాలం క్రితం జరిగినా ఆ సంఘటనలు వాళ్ళ మనస్సులో ఉండవచ్చు. ఇండియాలో ఉన్న చాలా మందికి అమెరికాలో ఉన్న ఇబ్బందుల గురించి నిర్దిష్టంగా తెలియదు. రెండు చేతులా ఆర్జిస్తున్నారని, పుష్కలంగా డబ్బు నిల్వ ఉంటుందని నమ్మకం. నానా టాక్సులు కట్టేసరికి దుంప తెగిపోతుందని చెప్పినా నమ్మరు. రమేష్, కామేశంని డబ్బు అడిగినప్పుడు సుగుణ కాలేజీలో చదువుతోంది. అయిదులక్షల నగదు అప్పు ఇచ్చేంత స్థితిలో లేరు.

కామేశం ఇప్పుడు లేదు. ఇండియా వెళ్తే తనకి ఉన్న దగ్గర బంధువులు రమేష్,

రవిలే. ఆర్థికంగా వాళ్ళమీద ఆధారపడక పోయినా తనకి వాళ్ళ మాట సహాయం కావాలి. వాళ్ళమీద ఆ ఆశతో తను ఇండియా వెళ్దామనుకోవడం సరైనదేనా? అప్పుడు వాళ్ళకి సహాయం అందించకుండా పదేళ్ళు మౌనంగా ఉండిపోయి ఇప్పుడు 'మీ సహాయం కావాలి' అంటూ వాళ్ళ దగ్గరకి వెళ్లడంలో ఔచిత్యం లేదు. పరిష్కార మార్గం దొరికిందని, ఒక గంట గడవకముందరే ఆ పరిష్కారం సరి అయినది కాదని విశదమవడం ఎంత దారుణం! అని వాపోయింది అమృత. ఇండియా వెళ్ళి శేషజీవితం గడపడం సాధ్యం కాకపోతే ఇక్కడే ఏదో విధంగా తన జీవితాన్ని తను మలచుకోవాలి. లేకపోతే ముందు తను డిప్రెషన్‌కి గురవుతుంది. 'ఏ సందేహ నివృత్తికయినా ఇంటర్‌నెట్‌లో గూగుల్ రామబాణంలాంటిది' అన్నాడు కామేశం ఒకసారి. కంప్యూటర్ వాడకం గురించి తనకి అట్టే తెలియదు. అయినా రేపు ఇంటర్నెట్‌లో 'డిప్రెషన్ గురించి వివరాలు వెతకాలి' అనుకుంటూ తెప్పరిల్లింది అమృత.

★ ★ ★

స్నాన పానాదులు ముగించి కంప్యూటర్ తెరచింది అమృత. ఎవరైనా తనకి ఇ-మెయిల్ పంపేరేమోనని వెతికింది. ఏమీ కనిపించలేదు. 'డిప్రెషన్ చిహ్నాలేమిటి?' అని గూగుల్‌లో వాకబు చేస్తే కనిపించిన వ్యాసాలు చూసి, నోరు వెళ్ళబెట్టింది. 'ఇన్ని వ్యాసాలు చదవడం నాతరం కాదు. ఒక గంటసేపు మాత్రం చదువుదాం' అని చదవడం మొదలుపెట్టింది అమృత.

'మీలో అతిగా అంతర్మథనం ఎక్కువైందా?', 'ఏపనిలోను ఆసక్తి ఉండడం లేదా?', 'ప్రతీ చిన్నదానికీ చిరాకు పడడం ఎక్కువైందా?', 'జీవితం నిరర్థకం అనిపిస్తోందా?', 'నిద్ర పట్టడంలేదా?', 'ఆత్మహత్య చేసుకుంటే?' లాంటి ఆలోచనలు వస్తున్నాయా?' అంటూ కొంత మంది డిప్రెషన్ గురించి చేసిన విశ్లేషణలు చదివేసరికి తనకు డిప్రెషన్ వచ్చేసింది అనిపించింది అమృతకు. 'డిప్రెషన్ మీద వ్యాసాలు ఇక చాలు' అని కంప్యూటర్ మూయబోతుంటే, 'మీరు స్నేహం చేయడానికి తయారుగా ఉన్నారా? మీరు ఏమీ చేయనక్కరలేదు. దిగువన ఉన్న బాక్స్ క్లిక్‌చేసి, మీ ఇ-మెయిల్ ఎడ్రస్ పొందుపరచండి' అనే ప్రకటన చూసి, క్లిక్‌చేసి ఇ-మెయిల్ పంపింది. పదినిషాలు గడిచేటప్పటికి ఆరు ఇ-మెయిల్స్ 'మీ వివరాలు తెలియపరచండి' అంటూ వచ్చేయి. వాటి గురించి పట్టించుకోకుండా మెటికలు విరుచుకుంటూ కంప్యూటర్ మూసింది అమృత. రెండు రోజులు గడిచేక టెలివిజన్‌లో 'ఇటలీలో భూకంపం! ప్రాణ, ఆస్తి నష్టం! వివరాలు ఇంటర్నెట్‌లో చదవండి' అన్న వార్త చూసి కంప్యూటర్ తెరచింది.

'మీ ఎక్కౌంట్‌లో మీరు చదవని ముప్ఫయి ఆరు ఇ-మెయిల్స్ ఉన్నాయి' అన్న హెచ్చరిక చూసి, ఆశ్చర్యపడుతూ 'ఏమిటిదంతా?' అనుకుంటూ వివరాల కోసం వెతికింది.

ముప్ఫయి ఆరు ఇ-మెయిల్స్ చదవాలంటే చాలా సమయం పడుతుందని గ్లాసులో లిమ్కా పోసుకుని వచ్చి, దాన్ని తాగుతూ మెయిల్స్ చదవటం మొదలుపెట్టింది అమృత.

"మీరు ఫ్రెండ్‌షిప్ కోసం స్పందించడం చూసి ఈ ఇ-మెయిల్ పంపుతున్నాను. మీరు ఒంటరిగా ఉన్నారా? మీ వివరాలు రాయండి"

"ఎందుకో మీ అభిరుచులు, నా అభిరుచులు కలుస్తాయనిపిస్తోంది. మీ గురించి వివరాలు ఏమీ రాయలేదు. మీ ఎడ్రస్,

టెలిఫోన్ నెంబర్ రాస్తే మనం కలుసుకునే అవకాశం గురించి చర్చిద్దాం"

"అది ముఖ్యంకాదు కాని మీ వయస్సు సుమారు ఎంత ఉంటుంది? దీనితోపాటు నా ఫోటో పంపుతున్నాను, మీ ఫోటో పంపండి" లాంటి ఇ-మెయిల్స్ చదివేక తను ఆలోచించకుండా 'స్నేహం కావాలా? లేక స్నేహం చేస్తారా? ' లాంటి దాని మీద క్లిక్ చేయడంతో ప్రతిస్పందనగా ఇవన్నీ వచ్చేయా? ఈ ఇ-మెయిల్స్ పంపిన వాళ్ళలో ఒంటరి మనుషులు ఎంతమంది? అని ఆశ్చర్యపడింది.

'ఇపుడేం చేయడం? సంభాషణ కొనసాగించడమా? సంభాషణ పొడిగిస్తే ఎంత మందితో పొడిగించాలి? సంభాషణలోనికి దిగితే ఏమవుతుందో!? విపరీతాలకి దారితీస్తే? తెలిసిన వాళ్లెవరైనా చూస్తే ఏమనుకుంటారు? పరువు పోదూ? సుగుణ, శంకర్రావ్‌లు తనని నిలదీయరూ? వద్దు, ఈ దారి సరి అయినది కాదు' అనుకుని కంప్యూటర్ ఆఫ్ చేసి, టీవీలో యూరోకప్ ఫుట్‌బాల్ మేచ్ చూడసాగింది.

రాత్రి పడుకునే ముందర అమృత ఆఖరి ఆలోచన తనని తాను నిగ్రహించుకోవాలి, నిగ్రహించుకుంది కూడా.

నిద్రమాత్ర ప్రభావం వలన ఉదయం ఎనిమిది గంటలకి లేచింది అమృత.

"ఈవేళ శనివారం రైతుబజారు ఉంటుంది. మంచి తాజా కూరలు దొరుకుతాయి, తెచ్చుకోవాలి" అనుకుంటూ కాఫీ తాగి బయలుదేరింది అమృత.

రెండు సంచుల నిండా కూరగాయలు తెచ్చి రిఫ్రిజరేటర్‌లో సర్దుతూ 'ఏం కూర చేసుకుందాం? ' అని తటపటాయించింది.

"ఒక్క మనిషికి వండుకోవాలంటే పరమ బోర్ బాబూ, రేపు చూద్దాం" అంటూ కూరలని లోపల ఉంచి ఫ్రిజ్ తలుపు మూసింది.

ఉదయం పదకొండు గంటలయింది.

'ఇప్పుడేం చేయాలి? ' అన్న కొరకరాని కొయ్య ప్రశ్న ముందరకొచ్చి నిలుచుంది.

మెల్లిగా స్నానపానాదులు కావించేసరికి పదకొండు గంటలయింది. 'తరువాత ఏమిటి? ' అన్న ప్రశ్న వెంటపడి తరుముతుంటే ఉక్కిరిబిక్కిరవుతోంది అమృత. చలిగా ఉంటే దుప్పటి కప్పుకోవచ్చు. కళ్ళ చుట్టూ పొగకమ్మితే, కళ్ళకిగంతలు కట్టుకోవచ్చు. కాని కడుపులోంచి, ఊపరితిత్తుల లోంచి, గుండెలలోంచి చిమ్ముకుంటూ జనిస్తున్న దిక్కుమాలిన ఒంటరితనం అనే భయానికి తన దగ్గర కవచం లేదు. ఈ బాధ భరించలేక తను ఏ అఘాయిత్యమో చేసుకునే అవకాశం ఉంది. అంటే తను నిజంగా డిప్రెషన్‌లో మునిగే ఉందన్న మాట. 'మద్యం బానిసల సహాయ సంస్థ' , 'మాదక ద్రవ్యాలకి బానిసలైన వాళ్ళ రక్షణ, సహాయ సంస్థ'లా ఈ డిప్రెషన్ నుంచి కోలుకోవడానికి ఏవైనా స్వచ్ఛంద సేవాసంస్థలు ఉన్నాయేమో అంటూ కంప్యూటర్‌లో వెతకడం మొదలుపెట్టింది.

'మీకు పది సరికొత్త ఇ-మెయిల్స్ వచ్చేయి' అంటూ హెచ్చరిక కనిపించే సరికి వాటివేపు దృష్టిని మరల్చింది అమృత.

గతంలో తను చదివిన ముప్ఫయి ఆరు

## కొత్తగాలి...

**నేటి సంసారాలు**
**గాలిలో దీపాలు**
**రెపరెపలాడుతూ...**
**కొండెక్కుతూ...**

– జూటూరు కృష్ణవేణి,
గూడూరు

ఇ-మెయిల్స్ పంపినవాళ్లలో కొందరు మళ్ళీ ఇ-మెయిల్స్ పంపేరు. ఏంచే యాలి? ఎవరినైనా సలహా అడిగితే? ఎవరున్నారు తనకి సలహా ఇవ్వడానికి? ఒంటరితనం తన సమస్య. ఒంటరితనం అనే నదీ ప్రవాహంలో ఈదవలసినది తను. చూద్దాం, ఏమైనా మంచి స్నేహం లభిస్తుందేమో? అనుకుని ఇ-మెయిల్ పంపిన వ్యక్తులని గమనించింది.

ఎక్కువమంది ఇండియన్లు, అమెరికన్లు, హిస్పానిక్స్‌లు ఉన్న ఆ గుంపులోంచి నాలు గు పేర్లు- ముగ్గురు ఇండియన్లు, ఒక అమె రికన్ పేరు ఎన్నుకుని, వాళ్ల వివరాలు వేరే కాగితం మీద రాసుకుంది. అసంకల్పి తంగా తను ముగ్గురు ఇండియన్లని ఎంచు కుంది. ఒక అమెరికన్‌ని మాత్రమే తీసు కుంది. ఇతరులంటే భయమా? సంవత్స రాలుగా నరాలలో నెలకొన్న పాత ఆలోచ నలా? సంప్రదాయమా? ఒక స్త్రీ మరో పురుషునితో స్నేహం అంటూ ముందుకు రావడం ఏం సంప్రదాయం? అన్న ప్రశ్న లని అణగతొక్కి 'జవాబు ఏం రాద్దాం?' అంటూ ఒక నిమిషం ఆలోచించి, తన పట్టికలో ఉన్న మొదటి వ్యక్తికి 'కలిసి కాఫీ తాగుదామా?', 'లేక కలిసి లంచ్ చేద్దామా?' అని తన వివరాలు ఏమీ ఇవ్వ కుండా ఒక పొడి ప్రతిపాదనని మెయిల్ చేసింది అమృత.

'ఆదివారం ఒంటిగంటన్నరకి లంచ్‌కి కలవడానికి వీలవుతుందా?' అని తిరుగు మెయిల్ రాగా, ఆలివ్‌గార్డెన్ రెస్టారెం ట్‌లో ఒంటి గంటన్నరకి లంచ్ తిందాం' అని జవాబిచ్చి, వాషింగ్ మెషిన్‌లో బట్టలుతికే కార్యక్రమంలో పడిందామె.

ఆలివ్ గార్డెన్ రెస్టారెంట్ లాంజ్‌లో కూర్చున్న అమృతకి రోడ్డుమీద వెళ్తున్న ప్రజలు అందరూ కనిపిస్తున్నారు. పేవ్ మెంట్ మీద నడిచి వస్తున్న తనేజాని ఆనవాలు కట్టి, రెస్టారెంట్‌లోనికి వచ్చిన అతనికి తనని తాను పరిచయం చేసు కుంది.

"మీ ఫొటో పంపలేదు. ఈ రెస్టారెం ట్‌కి చాలా మంది ఇండియన్లు వస్తారు. మిమ్మల్ని ఎలా ఆనవాలు కట్టాలా? అన్న సందిగ్ధంలో ఉండగానే మీరే నన్ను గుర్తు పట్టేరు. నా పేరు తనేజా" అంటూ కరచా లనం కోసం చేయి చాచేడు తనేజా.

చిరునవ్వు నవ్వుతూ కరచాలనం చేస్తూ "నా పేరు అమృత. గ్లాడ్ టు మీట్ యు, ఇద్దరికి టేబిల్ కావాలని నా పేరు నమోదు చేయించేను" అంది అమృత, తనే జాని పరీక్షగా చూస్తూ. అతని వయస్సు ఏభైఏడని అతని వివరాలలో రాసి ఉన్నా, అంతకన్నా ఎక్కువ వయస్కుడిలాగే ఉన్నాడు. ఇతనికి కారులేదా? కాలి నడ కనే రెస్టారెంట్‌కి వచ్చినట్లుంది. లేకపోతే అతను కారుని దూరంగా పార్క్ చేసి ఉండాలి" అని తనేజాని బేరీజు వేస్తుంటే వెయిట్రెస్ వచ్చి "మీ టేబిల్ రెడీగా ఉంది" అంటూ కేటాయింపబడిన టేబిల్ దగ్గరకి తీసుకెళ్ళింది. ఇద్దరూ తమ సీట్ల లో ఆసీనులయేరు.

వెయిటర్ వచ్చి "హలో, నా పేరు జానీ. ఈ వేళ మీ వెయిటర్‌ని, ఈ వైన్ రుచి చూస్తారా? వైన్ నచ్చితే తరువాత ఆర్డర్ చేద్దురుగాని" అన్నాడు.

అమృత "నో థేంక్స్" అంది, "ష్యూర్" అన్నాడు తనేజా. వైన్‌గ్లాస్‌లో అర ఔన్స్ వైన్ పోసి "ఆర్డరివ్వడానికి మీకు రెండు, మూడు నిమిషాలు కావాలా?" అనడిగేడు జానీ.

"వుయ్ ఆర్ రెడీ టు ఆర్డర్" అన్నారు ఇద్దరూ.

"మినిస్ట్రోనీ సూప్ ఎండ్ సాలెడ్" అన్నాడు తనేజా. "నాకూ అదే కాని సాలెడ్ డ్రెస్సింగ్ వేరే కప్పులో తీసుకురా"

అంది అమృత.

అమృత ఒక బౌల్ సూప్, కాస్త సాలెడ్ తినేలోగా తనేజా రెండు బౌల్స్ సూప్ కాకుండా బౌల్ నిండా తెచ్చిన సాలెడ్‌ని సొంతం ఖాళీ చేసేడు.

తిండి తింటూ కబుర్లలో పడ్డారు. తూతూ మంత్రాల లాగా పొడిపొడిగా అమృత తన గురించి చెప్పింది. కాని తన ఆర్థిక పరిస్థితులు బైటపెట్టలేదు.

"మీరేం చేస్తుంటారు?" అనడిగింది అమృత తనేజాని.

"రియల్ఎస్టేట్ వ్యాపారం చేసేవాడిని, కాని ఆర్థిక మాంద్యంలో దెబ్బతిన్నాను."

"మరి ఇప్పుడు?"

"ఒక రియల్ ఎస్టేట్ మేనేజ్‌మెంట్ కంపెనీ నన్ను కన్సల్టెంట్‌గా ఉపయోగించుకుంటోంది. నా దగ్గర విడాకులు తీసుకున్న నా భార్య ఒక కంపెనీలో పనిచేస్తోంది. అందుచేత ఆమెకి నేనేమీ భరణం ఇవ్వనవసరంలేదు" అంటూ కొత్తగా తెచ్చిన సాలెడ్‌ని తన ప్లేట్‌లో వడ్డించుకుని ఫోర్క్‌ని సాలెడ్‌కి గుచ్చేడు తనేజా.

అమృత ఏమీ వ్యాఖ్యానించలేదు.

"నేనే అంతా మాటలాడేను. మీరు మీ గురించి ఏమీ చెప్పలేదు" అన్నాడు తనేజా ఫోర్క్‌ని కింద ఉంచుతూ.

"ప్రత్యేకంగా చెప్పడానికి ఏమీలేదు. ఈ మధ్యనే భర్తని పోగొట్టుకున్నాను. నేను ఏ ఉద్యోగం చేయడం లేదు"

"ఎనీ డిసర్ట్?" అంటూ వెయిటర్ జానీ దగ్గరగా నిలుచున్నాడు.

"నో" అంది అమృత.

"స్వీట్, నో" అన్నాడు తనేజా కడుపు పట్టుకుంటూ.

"నేను చెక్ తెస్తాను" అంటూ జానీ వెళ్ళగానే "ఇండియాలో బిల్ అంటారు, ఇక్కడ చెక్ అంటారు" అంటూ నవ్వేడు తనేజా.

మందహాసం చేసింది అమృత.

నామమాత్రంగా అభ్యంతరాన్ని వెలిబుచ్చిన తనేజాతో "లంచ్‌కి కలుద్దామన్నది నా ప్రతిపాదన, అందుచేత నేను బిల్ పే చేయడం సబబు" అంటూ జానీకి క్రెడిట్ కార్డ్ అందిచ్చింది అమృత.

"థ్యాంక్స్! నెక్స్ట్ టైమ్ బిల్ నాది" అన్నాడు తనేజా.

ఇద్దరూ కలిసి బైటకి రాగానే "నైస్ టు హేవ్ మెట్ యు, నాకు చాలా ఆనందంగా ఉంది" అంటూ తనేజా చేయిచాచేడు.

"నాకూ అలాగే ఉంది" అంటూ కరచాలనం చేసింది అమృత.

"అప్పుడే మూడయింది. నాకు ఇక్కడకి దగ్గరగా ఉన్న ఇండియన్ స్టోర్‌లో పని ఉంది. మీరు మెయిల్ పంపండి" అంటూ దగ్గరగా ఉన్న ఇండియన్ స్టోర్ వేపు కదిలివెళ్ళేడు తనేజా.

అప్పుడే సునంద కొడుకు వినోద్ ఒక అమ్మాయితో కారు దిగి ఆలివ్ గార్డెన్ రెస్టారెంట్‌లోకి వెళ్ళడం చూసి 'పలకరిద్దామా?' అనుకుని వెన్వెంటనే 'వాళ్ళని డిస్టర్బ్ చేయడమెందుకు?' అనుకుంటూ తన కారు వేపు కదిలింది అమృత.

"తనేజా ధోరణికి తన ధోరణికి పోలికే లేదు. అతనితో పరిచయానికి ఇంతే సంగతులు" అనుకుంది అమృత, కారుని పార్కింగ్ ప్రదేశంలోంచి బైటకి తీస్తూ.

రెండు రోజులు గడిచేక తనేజా తరువాత వరుస క్రమంలో ఉన్న జేమ్స్‌తో సంప్రదింపులు అయ్యేక, జేమ్స్‌ని 'పీట్స్ కాఫీ హౌస్' దగ్గర కలవడానికి నిరీక్షిస్తోంది అమృత.

కాఫీ హౌస్‌కి ఏభై అడుగుల దూరంలో కారు పార్క్ చేసి జేమ్స్ లోపలికి ప్రవేశిస్తుంటే అతనిని ఆనవాలుపట్టి "నేను అమృతని" అంది.

"ఇటీజ్ నైస్ టు మీట్ యు" అంటూ బలమైన చేతితో కరచాలనం చేసాడు జేమ్స్.

ఇద్దరూ కాఫీ హౌస్ లోనికి ప్రవేశించేక "అక్కడ కూర్చోండి.. నేను తెస్తాను. మీకు ఏం కావాలి? " అనడిగాడు జేమ్స్.

"ఒక బటర్ క్రొసాంట్, రెగ్యులర్ కాఫీ. మనం బిల్ పంచుకుందాం" అంది అమృత.

"దాని గురించి మీరు ఏమీ వ్యాకులపడ కండి ఇది నా ఆనందం" అంటూ కౌంటర్ వైపు వెళ్తున్న జేమ్స్‌ని గమనించింది అమృత. ఆకు పచ్చని ఫుల్ షర్ట్ టక్‌చేసి, ఎత్తుకు తగ్గ లావుతో హుందాగా నడిచి వెళ్తున్న జేమ్స్ ఇ-మెయిల్‌లో ఉదహరించిన వయస్సుకంటే తక్కువ వయస్సు ఉన్న వ్యక్తిలా కనిపిస్తున్నాడు. 'బాగున్నాడు' అనుకుంది అమృత.

ట్రేలో ఇద్దరికి కావలసిన పదార్థాలు తెచ్చి, అమృత ఎదురుగా ఉంచి, "ఇదిగో మీ క్రొసాంట్ కాఫీ, స్టార్‌బక్స్‌లో లభించే కాఫీ కంటే పీట్స్ కాఫీకి ఎక్కువ రేటింగు ఇస్తాను. బహుశా పీట్స్ కాఫీలో ఉన్న సువాసన నాకు సరిపడుతుంది" అంటూ సంభాషణ మొదలుపెట్టాడు జేమ్స్.

"నాకూ ఇక్కడ కాఫీ అంటే ఇష్టమే అయినా మీలా- ఇది ఎందుకు బాగుంటుంది? - అన్నదాని గురించి ఆలోచించను"

"నా విషయంలో అది విరుద్ధం యునో. జీవితంలో తర్కించుకుంటూ కాలం చేజార్చుకున్న వాళ్ళలో నేనొకడిని. ఎనీవే, మీరు ఏమీ అనుకోనంటే ఒక వాక్యం చెబుతాను"

అమృత అంగీకారంగా తల ఊపింది.

"అందం మాట సరేసరి. దానికి తోడు మీరు చాలా హుందాగా ఉన్నారు" అన్నాడు జేమ్స్ కాఫీ తాగుతూ.

"థేంక్స్" అంది అమృత. అనుకోకుండా బైటపడిన సిగ్గుని కప్పిపుచ్చుకోవడానికి అమృతకి రెండు నిమిషాలు పట్టింది.

"మీరు గమనించే ఉంటారు. ఇక్కడ పొరలు పొరలుగా ఉన్న క్రొసాంట్‌కి ఇత

## అవ్వి కాకులు సార్!

'సమత' బ్యానరు అధినేతలు చటర్జీ, ముఖర్జీలు అప్పట్లో విజయవంతమైన నిర్మాతలు. శోభన్‌బాబుతో వరుసగా చిత్రాలు తీస్తుండేవారు. చటర్జీవారింట్లో ఆయన తండ్రిగారు శివసాయుజ్యం పొందిన సందర్భంగా పిండప్రదానం జరుగుతోంది. ముఖ్యమైన బంధుమిత్రులందరూ హాజరయ్యారు. దానికి శోభన్‌బాబు కూడా వచ్చారు. శోభన్‌కి కె.వి.చలం మంచి మిత్రుడు. శోభన్ కూడా హాస్యప్రియుడు గనుక కె.వి.ని పక్కనే కూర్చోబెట్టుకునేవాడు. మధ్యాహ్నం భోజన సమయమవు



తోంది. పితృ దేవతలకి ప్రసాదం పిట్టగోడ మీద పెట్టారు. ఎంతసేపైనా కాకులు రావడం లేదు. సమయం మించిపోతోంది. వచ్చిన అతిథులంతా గడియారాలు చూసుకుంటున్నారు. చటర్జీ, శోభన్‌తో 'ఏవిటండీ! ఎంతపిలిచినా ఒక కాకీ రాలేదు.. ఇప్పుడెలా? ' అన్నారు బాధగా.

వెంటనే కె.వి.చలం కల్పించుకొంటూ "మీరు పిలవకున్నా రావడానికి అవ్వేమైనా కె.వి.చలం, మాడాలా సార్... కాకులు సార్.. కాకులు!" అన్నాడు, పక్కనే వున్న మాడాని చూసి. అంతే! అప్పటికే అసహనంగా వున్న అందరూ హాయిగా నవ్వారు. శోభన్‌బాబయితే మరీనూ.

రచోట్ల లభ్యమయే క్రొసాంట్‌కి చాలా తేడా ఉంటుంది. చూడండి, మీరు దానిని కొరుకుతుంటే 'టర్'మన్న శబ్దం అందంగా, వింతగా అనిపించలేదూ? "

ఒక్కసారి క్రొసాంట్ కొరకడం నిలుపుచేసింది అమృత. పకపకా నవ్వేడు జేమ్స్. అతనితో శృతి కలిపింది అమృత.

"నాకు ఫార్మసీలో డిగ్రీ ఉంది. నేను చాలా కంపెనీలలో పనిచేసాను. మొదట్లో జీతం పెరుగుదల గురించే పట్టించుకునే వాడిని. ఈ దేశంలో మోతాదుకి మించి విపరీతమైన లాభాలు గడిస్తున్న వ్యాపారాల్లో ఫార్మాస్యూటికల్ కంపెనీలదే అగ్రస్థానం. ప్రజా ప్రతినిధులని తమ గుప్పెట్లో ఉంచుకుని, తమకి అనుకూలంగా చట్టాలని తెచ్చి ప్రజల గురించి పట్టించుకోవడం లేదు. ఎనీవే, ఆ దారివదిలి, కంప్యూటర్ విభాగంలో కోర్సులు చేసి ఒక కంపెనీలో చేరాను. ఆ కంపెనీని ఇంకో పెద్ద కంపెనీ కొనుగోలుచేయడంతో పాత కంపెనీ నాకు ఇచ్చిన స్టాక్ ధర ఆకాశాన్నంటుకుంది. రెండేళ్ళ తరువాత వాటిని అమ్మేసి, ఇప్పుడు కన్సల్టెంట్‌గా పనిచేస్తున్నాను. ఫ్రీలాన్సర్, నాకు ఇష్టమైనపుడే పనిచేస్తాను. నేను జీవితంలో పెళ్ళి చేసుకోలేదు. కొత్త ప్రదేశాలకి తరచూ వెళ్తుంటాను. ఇహ మీ గురించి చెప్పండి" అన్నాడు జేమ్స్.

"చెప్పడానికేముంది? నాకు ఒక కుమార్తె, వివాహమైంది. మా అమ్మాయి, అల్లుడు, మనవరాలు టెక్సాస్ రాష్ట్రంలో నివసిస్తున్నారు. నా భర్త ఎనిమిది నెలల క్రితం చనిపోయేడు అంతే"

"ఐ యామ్ సారీ" అన్నాడు జేమ్స్.

అమృత ఏమీ మాటలాడలేదు వెంటనే.

"మీరు రోజంతా ఎలా గడుపుతారు? సినిమాలకి వెళ్తూంటారా? క్రాస్‌వర్డ్ పజిల్స్ చేస్తారా? హౌ డజ్ ఇట్ గో? రోజు ఎలా గడుస్తుంది? "

"కాస్సేపు టెలివిజన్ చూస్తాను. కొంత సమయం వంట వండుకోవడానికి ఉపయోగపడుతుంది. నిజం చెప్పాలంటే రోజు భారంగా గడుస్తుంది. ఒకమంచి కంపెనీ ఉంటే రోజు మరొకవిధంగా గడుస్తుందనుకుంటున్నాను" అంది అమృత.

"నాదొక ప్రతిపాదన. ఒక మీ'రేపు'ని నాకు వదిలేయండి. రేపు రోజు, మీరు ఇప్పుడు గడుపుతున్నరోజుకి భిన్నంగా గడుపుదాం. అదీ మీకభ్యంతరం లేకపోతేనే! ఏమంటారు? " అనడిగేడు జేమ్స్.

"సరే" అంది అమృత.

"థాంక్యూ. రేపు ఉదయం పదకొండు గంటలకి మిమ్మల్ని పికప్ చేస్తాను. తిరిగి సాయంకాలం ఏడు-ఎనిమిది గంటలకి మిమ్మల్ని మీ ఇంటి దగ్గర వదిలి వెళతాను. నేను అలా చేయాలంటే మీ ఎడ్రస్ కావాలి"

అమృత అరక్షణం తటపటాయించింది. ఇప్పుడే పరిచయమైన వ్యక్తికి ఎడ్రస్ ఇవ్వడం మంచిది కాదనిపించినా 'జేమ్స్ దగుల్బాజీలా లేడు' అనుకుని తన ఎడ్రస్ కాగితం మీద రాసి జేమ్స్‌కి అందిచ్చింది.

"ఏమైనా మార్పు ఉంటే మీకు మెయిల్ ద్వారా తెలియపరుస్తాను. ఇది నా టెలిఫోన్ నెంబర్" అంటూ తన టెలిఫోన్ నెంబర్ అందిచ్చేడు జేమ్స్.

★ ★ ★

ఉదయం సరిగ్గా పదకొండు గంటలకి అమృత ఇంటి కాలింగ్ బెల్ నొక్కేడు జేమ్స్.

అమృత తలుపు తెరచి "నేను తయారుగా ఉన్నాను" అంది.

అమృతతో కరచాలనం చేస్తూ ఆమెకి దగ్గరగా జరిగి "మీరు నిన్నటికంటే ఈవేళ ఎక్కువ అందంగా కనిపిస్తున్నారు" అన్నాడు జేమ్స్.

"థాంక్స్... ఇలా అందరినీ పొగడడం మీకు అలవాటులా ఉంది" అని జేమ్స్‌వేపు చూడకుండా అతని కారు వేపు నడిచింది అమృత.

కారు తలుపు తెరిచేడు జేమ్స్. లోపలికి దూరింది అమృత. తన సీట్‌లో సర్దుకుని సీట్‌బెల్ట్ పెట్టుకుంటూ "కేలిఫోర్నియా రాష్ట్రంలో సీట్‌బెల్ట్ పెట్టుకోకపోవడం నేరం" అన్నాడు జేమ్స్.

అమృత తన సీట్‌బెల్ట్ రాక కుదిపిలా గుతుంటే, అమృత శరీరం మీద నుంచి వంగి సీట్‌బెల్ట్ లాగి అమృతకి అందిస్తూ "దీనికి ఒకచిన్న ట్రిక్ ఉంది" అంటూ జేమ్స్ నవ్వేడు.

ట్రిక్ బెల్ట్‌లో ఉందా? లేక యాదృచ్ఛికంగా తన శరీరాన్ని స్పృశించేలా దగ్గరగా రావడంలో ఉందా? అనుకుంటూ ఆశ్చర్యం, సిగ్గు, అనుమానం, రవ్వంత ఆనందం మిళితమైన భావన మొహం మీదకి రాగా అది కనిపించకుండా మొహాన్ని రెండవవేపు తిప్పింది అమృత. పీట్స్ కాఫీహౌస్ కనిపించగానే కారుని పార్కింగ్ ప్రదేశంలో నిలుపు చేసేడు జేమ్స్. రెస్టారెంట్‌లోనికి ప్రవేశిస్తుంటే "ఈమారు ఖర్చు నాది" అంటూ చెప్పింది అమృత.

కబుర్లలో పడి అమృత క్రొసాంట్ తింటుంటే "మీ పెదవి చివర క్రొసాంట్ అంటుకుంది" అంటూ పేపర్ నేప్‌కిన్‌తో జేమ్స్ తుడవబోతుంటే "ఫరవాలేదు" అని చటుక్కున తనే తుడుచుకుని "నెక్ట్స్ మనం ఏం చేయబోతున్నాం? " అనడిగింది అమృత.

"వెయిట్, ఏమౌతుందో త్వరలో తెలుస్తుంది"

కారులో అరగంటసేపు ప్రయాణం చేసేక ఒక సినిమా థియేటర్ల సమూహం దగ్గర కారు ఆపి, "మీరు దిగండి, కారు పార్క్ చేసి వస్తాను" అన్నాడు జేమ్స్.

అమృత చుట్టూ ఉన్న పరిసరాలని గమనిస్తూ, ఆశ్చర్యంతో తలమున్కలౌతుంటే "ఏవెంజర్స్ సినిమా బాగుంది అని రివ్యూలు చదివేను. మీకు సినిమా చూడడానికి అభ్యంతరం లేదుకదా? " అంటూ చేతిమీద రెండువేళ్ళతో తట్టి, ఎస్కెలేటర్ వేపు వెళ్ళాలని సూచించేడు జేమ్స్. సినిమాలో ఉన్న అపరిమితమైన శబ్దాలు, అర్థంకాని వయొలెన్స్ చూసి ఆమె ఇబ్బంది పడుతుంటే "ఐయామ్ సారీ, కష్టంగా ఉంటే వెళ్లిపోదాం" అమృత చెవిలో గొణిగేడతను.

"ఫరవాలేదు" అంది అమృత.

సినిమా ముగిసేక హాల్‌లోంచి బైటికి వస్తూ చేతివాచీ వేపు చూసి "ఇప్పుడేం చేద్దాం? " అనడిగింది అమృత.

"మీకు ఆకలిగా ఉందా? "

"ఫరవాలేదు."

"మీరు 'ఫరవాలేదు' పదాన్ని తరచూ వాడుతారా? లైట్‌గా ఏదైనా ఫలహారం చేస్తే డిన్నర్ డిస్టర్బ్ అవదు. ఫలహారం చేసేక మిమ్మల్ని ఒక ప్రదేశానికి తీసుకువెళ్తాను. బహుశా ఆ ప్రదేశాన్ని మీరు చూసేరేమో" అన్న జేమ్స్ ఇంకా వివరాలు చెబుతాడేమోనని చూసింది.

సన్నగా విజిల్ వేస్తున్న జేమ్స్‌తో "రాత్రి డిన్నర్ ఖర్చు నాది" అంది అమృత.

ఫలహారం ముగించేక, అరగంట కారులో ప్రయాణం చేసేక కారు ఆపి "దిగండి" అన్నాడు జేమ్స్. శూన్యంలోనికి చూస్తూ పరిసరాలని గమనించని అమృత కారులోంచి దిగగానే బలమైన గాలితో పోటీ పడుతూ ఉరకలు పెడుతున్న దట్టమైన మేఘాలు చల్లని గాలులని ఆఘ్రాణించి ఊపిరివదిలినట్లు వదులుతూ కనిపించాయి. కొన్ని మేఘాలు బాగా ఎత్తు కొండల మీద కూర్చుని అలసట తీర్చుకుం

టున్నాయి. బలమైన గాలి ధాటికి దాసోహం అంటూ ఎగిరిపోతున్న ముంగురులని కట్టడి చేస్తూ "ఈ ప్రదేశానికి నేను ఎప్పుడూ రాలేదు" అంది అమృత.

"ఈ ప్రదేశాన్ని 'కయోటిహిల్' అంటారు. అదిగో ఆ చిన్న కొండ ఎక్కితే శాన్‌ఫ్రాన్సిస్కో పట్టణం అంతా కనిపిస్తుంది. ఈ ప్రదేశం అంటే నాకెంతో ఇష్టం. ఒంటరితనంలో కూడా తాను ఉన్నానని గాలి మనచుట్టూ కమ్ముతుంది. ఇక్కడ ఎంతసేపు కావాలంటే అంతసేపు కూర్చోవచ్చు. తరువాత డిన్నర్‌కి వెళదాం. అయితే అప్పుడప్పుడు చటుక్కున సన్నని వానజల్లు పడొచ్చు" అంటూ కొండమీదకి నడక ప్రారంభిస్తూ, సందేహిస్తున్న అమృతతో "కమాన్, ఎనీ ప్రోబ్లెమ్?" అనడిగేడు జేమ్స్.

మెట్లు ఎక్కితే ముడుకులు నొప్పెడతాయని చెప్పాలని ఉన్నా జేమ్స్ ముందర వెలితిపడడం ఇష్టంలేక "నో ప్రోబ్లెమ్" అంటూ అతనిని అనుసరించింది అమృత. ఐదునిమిషాల తరువాత కొండ ఎక్కి దూరంగా కనిపిస్తున్న పసిఫిక్ సముద్రం బే, శాన్‌ఫ్రాన్సిస్కో నగరంచూసి, జుత్తుని అదుముకుంటూ "ఫెంటాస్టిక్" అంది.

"మీరు ఈ చిన్నకొండ ఎక్కడానికి కాస్త ఇబ్బంది పడ్డారు. కొన్ని చోట్ల మోకాలు... మొహమాటం పనిచేయదు. కాసేపు కూర్చుందామా?"

ఉత్సాహం, కొండ ఎక్కడం వలన కల్గిన ఆయాసాన్ని బలంగా ఊపిరిపీల్చి వదిలి తనని కంట్రోల్ చేసుకుని, మాటలాడకుండా పచ్చికమీద చతికిలపడింది అమృత. ఆమెకి మూడడుగుల దూరంలో పేంట్ సరిచేసుకుంటూ కూర్చున్నాడు జేమ్స్.

"నేను ఇరవై ఐదేళ్ళ క్రితం బ్రిటన్‌లో ఒక సంవత్సరం గడిపేను. ఆ రోజుల్లో ఆంగ్లసాహిత్యం మీద చాలా ఆసక్తి ఉండేది. 'సోమర్‌సెట్ మామ్' నాకు నచ్చిన రచయిత. అతని కథలు చాలా చదివేను. ఇది ఎందుకు చెపుతున్నానంటే మనుష్యుల హావభావాలని, అంతరంగ ఆలోచనల్ని విశదపరుస్తూ రాస్తాడాయన. మీరు ఏమిటి ఆలోచిస్తున్నారో నేను ఊహించలేను. అయితే సోమర్‌సెట్ మామ్ మీ ఆలోచనల్ని సునాయాసంగా పసికట్టేవాడేమో!" అన్నాడు జేమ్స్.

అమృత సన్నగా నవ్వింది, కాని ఏమీ మాటలాడలేదు.

"నేను రేపు న్యూయార్క్ వెళ్ళబోతున్నాను. పదిరోజుల తరువాత తిరిగి వస్తాను. మీతో అయిన ఈ పరిచయం నాకు ఆనందాన్నిస్తోంది" అన్నాడు జేమ్స్.

'మీ పరిచయం అవడం నాకూ ఆనందాన్నిచ్చింది' అని చెబుదామని ఉన్నా అమృత నోట్లోంచి మాటలు వెలువడలేదు.

రెండునిమిషాలు గడిచేక "స్వతహాగా నేను మితభాషిని. మీరు నాకు పరిచయమై ఇంకా ముప్ఫయిగంటలు కాలేదు. నా మనోభావాలన్నీ మీకు వ్యక్తపరిచేటంత వాతావరణం మన మధ్య ఇంకా నెలకొనలేదు. నేను పెరిగిన సంప్రదాయానికి ఇది కొత్త" అంది అమృత.

"నిజమే కావచ్చు కాని ఏదీ వ్యక్తపరచకుండా మౌనంగా ఉంటే కాలం చేతివేళ్ళలోంచి జారిపోతుంది. అఫ్‌కోర్స్, ఏం చేయాలన్నది మీ ఇష్టం మీద ఆధారపడి ఉంటుంది" అన్నాడు జేమ్స్.

"అవును" అంటూ ఆలోచనలో పడింది అమృత.

ఒకగంట గడిచింది. వెలుతురు తగ్గుతుంటే జేమ్స్ లేచి నిలబడి దూరంగా కనిపిస్తున్న శాన్‌ఫ్రాన్సిస్కో నగరంలో ముఖ్యమైన ప్రదేశాలని చూపిస్తుంటే అతనికి దగ్గరగా నిలబడి ఆసక్తికరంగా వింటోంది

అమృత. జేమ్స్ ప్రదేశాల గురించి చెబుతూ అమృత మొహానికి దగ్గరగా ఉన్నపుడు జేమ్స్ విడిచిన ఊపిరి అమృత చెంపలని తాకగానే మెల్లిగా రవ్వంత దూరం జరిగి చెంపల్ని తడుముకుంది అమృత.

సాయంకాలం ఇండియన్ రెస్టారెంట్‌లో డిన్నర్ ముగించేక అమృతని ఇంటిదగ్గర వదులుతూ కరచాలనం చేసి అమృత చెంపల్ని దాదాపు స్పృశిస్తూ "థాంక్స్ ఫర్ ద కంపెనీ, గుడ్‌నైట్" అన్నాడు జేమ్స్.

ఒక్కసారి ఉలిక్కిపడి తేరుకుని "గుడ్ నైట్" అంది అమృత.

మరుగవుతున్న జేమ్స్ కారువేపు చూస్తూ పరధ్యానంగా ఇంటి తలుపు తెరచి 'సెక్యూరిటీ అలారం'ని ఆపు చేసింది అమృత. అంతవరకూ పడుకున్న నిశ్శబ్దం లేచి పరుగెత్తుకుంటూ వచ్చి బావురుమంటూ అమృతని వాటేసుకుంది.

రోజంతా సందడిగా గడిచిన తరువాత బిక్కుబిక్కుమంటూ పలకరిస్తున్న గోడలు, సోఫాలు చూడగానే పగలంతా ఉన్న ఉత్సాహం హరించుకుపోయి నిస్సత్తువ ఆవహించింది. గోరువెచ్చని నీళ్ళతో స్నానంచేసి, బట్టలు మార్చుకుని టెలివిజన్ ఆన్ చేసినా దాని మీద దృష్టి నిలవలేదు అమృతకి.

జేమ్స్‌తో రెండురోజుల పరిచయం బాగానే ఉంది.

జేమ్స్ తనంటే శ్రద్ధ, గౌరవం కనపరిచేడు. అందులో ఆశ్చర్యం లేదు. ప్రతి పురుషుడూ తను చేరువవుదామన్న స్త్రీ దృష్టిలో పడడానికి ఇలాంటి ప్రదర్శన మామూలే కావచ్చు. కాని చాలామంది పురుషుల్లా కాకుండా తన ఉద్దేశాలు ఎలాంటివో కనుగొనడానికి ప్రయత్నించేడు. తనని వ్యక్తపరచుతున్నాడు. అది ఒక పాయింటే. డబ్బు ఖర్చు పెట్టడానికి ఏమీ వెనుదీయలేదు. ఒక్క సినిమా టిక్కట్ ఖరీదు ఆ థియేటర్‌లో పద్నాలుగు డాలర్లు! అయినా సంకోచించలేదు. తనే జాలా ఏబ్రాసిలా ప్రవర్తించలేదు. ఆ! ఇక్కడ చాలాకాలంగా నివసిస్తున్న జేమ్స్

## జంతుభాష!

'సర్కస్ రాముడు' చిత్రం షూటింగ్ ఒక సర్కస్ కంపెనీలో జరుగుతోంది. అవుట్ డోర్ షూటింగంటేనే టెన్షను. దానికి తోడు పులుల మధ్య షూటింగ్ చెయ్యాలి. ఆ చిత్రంలో కె.వి.చలం సర్కస్‌రాముడి అసిస్టెంట్‌గా చేస్తున్నాడు. దాసరి తన చిత్రాల్లో



అతనికి ఏదో ఒకపాత్ర ఇచ్చి ప్రోత్సహిస్తుండేవారు. చలం కూడా సందడి చేసేవాడు. ఆ రోజు షాట్‌లో సమయానికి డైలాగు రాలేదు. వెంటనే కె.వి.చలం సర్కస్‌రాముడి పాత్రధారి ఎన్టీఆర్‌తో "అలో సాలో వీడి తలా పులి కచబిచ... కచబిచ" అన్నాడు, పక్కనున్న రింగు మాస్టరు పాత్రధారి అల్లురామలింగయ్యని చూసి. అల్లు వూరుకుంటాడా? తనదైన స్టైల్లో రియాక్షన్‌ను మూలుగులతో సరిపెట్టాడు.

ఆ వెంటనే కె.వి.చలం 'కసా బిసా మహా నసా!' అన్నాడు. సొంత కల్పితాలతో. అయితేం ఎప్పుడూ నవ్వని ఎన్టీఆర్ పగలబడి నవ్వారు. దాసరి ఆనందానికి అవధుల్లేవు. 'చలం! నువ్వు జంతుభాష ఎప్పుడు నేర్చుకున్నావయ్యా!' అన్నారు దాసరి.

'జంతువులకి జంతుభాష ఎవరు నేర్పుతారు? ' అన్నాడు కేవీ చలం ఠక్కున.

అంతే, దాసరి కడుపారా నవ్వారు.

తన జాగ్రత్తలో తను ఉండకుండా ఎలా ఉంటాడు? క్లుప్తంగా తన తృప్తికరమైన ఆర్థికస్థితి గురించి ప్రస్తావించేడు, కాని వివరాలు చెప్పలేదు. చెబితే ఏం, చెప్పక పోతే ఏం? ఐ డోంట్ కేర్! తన విష యాలు మాత్రం అతనికి చెప్పిందా? తను స్త్రీ. స్త్రీలు ఇలాంటి విషయాల్లో ముందర బైటపడరు. ముందరేమిటి ఎప్పుడూ బైట పడరు. సహజసిద్ధంగానే ఉంది తన ప్రవ ర్తన. అయితే జేమ్స్‌లో ఉన్న అతిచొరవ తనకి నచ్చలేదు. కారులో సీట్ బెల్ట్ సరిచే స్తున్నట్లు తన శరీరం మీద ఒరిగీ ఒరగ నట్లు ఒరగడం, సినిమాహాల్లో తన చెవిద గ్గర ఊపిరి వదులుతూ మాటలాడడం తనని రెచ్చకొట్టడానికే. అలా మాట్లాడడం బాగుంది, అది వేరే విషయం. అన్నిటికన్నా ముఖ్యం తనని ఇంటి దగ్గర వదులుతూ అతను తనని చుంబించడానికి ప్రయత్నించేడా? ప్రయత్నించేడనే అనిపిం చింది. స్త్రీగా పురుషుని వెకిలి చేష్టలు తను ఊహించగలదు. తను సాదాగా హిందూ సంప్రదాయంతో జీవితం గడిపిన స్త్రీ. తను ఇంకా నిన్నటి సంఘ రివాజుల చట్ర బంధంలోనే ఉంది. జీవితంలో బోర్లాప డిన తనని ఒక సాఫీ జీవితానికి తీసు కెళ్ళేందుకు సహాయంగా ఉండే వ్యక్తి కావాలి. తనలో ఏర్పడిన వెలితిని పూడ్చే వ్యక్తి జేమ్స్ కాదు. జేమ్స్ పదిరోజులు న్యూయార్క్ వెళతానన్నాడు. ఈ పదిరో జులూ ఆలోచించి ఇక అతనిని కలవనన్న సంకేతం పంపాలి అనుకుని స్థిమితపడి నిద్రలోనికి జారప్రయత్నించింది అమృత. సీట్ బెల్ట్ ఊడిరాకపోవడం చూసి జేమ్స్ వంగి సహాయం చేయబోయేడు. లేకపోతే కారుని ఆపి, తనున్న వైపు వచ్చి తలుపు తెరచి ఫిక్స్ చేస్తాడా? అతను చేసిన దాంట్లో తప్పేమిటి ఉంది? సినిమాలో శబ్దకాలుష్యం ఉన్నప్పుడు 'కావాలంటే వెళ్లి పోదాం' అని చెవిదగ్గర నోరు ఉంచి మెల్లగా చెప్పడంలో విడ్డూరమేముంది? లేకపోతే హాలంతా దద్దరిల్లేలా అరవాలా? దీంట్లో చొరవ ఏముంది? ఇహ కారులో దింపి "గుడ్ నైట్" చెప్పే ముందర చుంబించ ప్రయత్నించడం గురించి అమె రికాలో ఆత్మీయత, దగ్గరతనం వ్యక్తపర చడం ఇండియాలో ప్రదర్శించే విధానానికి విరుద్ధంగా ఉండవచ్చు దానికి ఈ దేశంలో పుట్టిపెరిగిన జేమ్స్‌ని తప్పు పట్ట గలదా? అని మెదడు మరో కోణంలోంచి ఆలోచించడం మొదలుపెట్టేసరికి పెదవి కొరుక్కుంటూ 'జేమ్స్‌కి పంపించే సంకేతం జాగ్రత్తగా ఉండాలి. కమ్యూనికేషన్ చటు క్కున తెగిపోయేలా ఉండకూడదు' అను కుంటూ నిద్రమాత్ర వేసుకుని దుప్పటి కప్పుకుంది అమృత.




**శం**షాబాద్ ఎయిర్‌పోర్ట్‌లో దిగిన రంగనాథ్‌కి ఒకర్ని ఒకరు తోస్తూ కదులు తున్న జనాభాని చూసేక 'మూడు నెల లలో ప్రయాణీకుల రద్దీ బాగా ఎక్కువ యిందా?' అనిపించింది. ప్రీ పెయిడ్ టేక్సీలో సామాన్లు ఉంచి సర్దుకుని "జూబ్లీ హిల్స్" అన్నాడు టేక్సీ డ్రైవర్‌తో. ఎయిర్ కండిషన్డ్ కారులో ప్రయాణం హాయిగా అనిపిస్తున్నా, 'అర్ధాంతరంగా తను ఇండియా రావడం గురించి తండ్రి ఏమ

నుకుంటాడు? అనుకోకుండా ఇక్కడ ఆఫీస్ పని తగిలింది, బయలుదేరేనన్న సగం నిజం చెప్పడమా? చీఫ్ ఇంజనీర్ చేసి జీవితం నేర్పిన అనుభవం తన రాకలో ఉన్న మర్మాన్ని ఇట్టే పట్టేయదూ? ఇక్కడ ఉండబోయే ఇరవై రోజులు ఎలా గడుస్తాయో!'

"నత్తి ఉన్న వానిలా కాకుండా ధైర్యంగా ఆయనని రిటైర్‌మెంట్ హోమ్‌లో చేర్పించి రండి" అంది సునంద, తను బయలుదేరు తుంటే. అలాంటి ఉద్బోధనే గత మూడు నెలలుగా ఇస్తోంది. పెళ్ళయిన కొత్తలోనే ఆధిక్యత చేజిక్కించుకున్న సునందతో వాదానికి దిగడం దండగ! సునంద దగ్గర రెండు ఆయుధాలు ఉంటాయి. బండగా వాదనలో జోరపడి "నాకు అంతా తెలుసు, నేను చెబుతున్నాను" అన్నది ఒకటి. "మీకు ఏమీ తెలియదు, ఇది అందరికీ తెలిసినదే" అన్నది రెండవది. తండ్రి ఎలా ఉన్నాడో! అనుకుంటుంటే టేక్సీ మాసాబ్ ట్యాంక్ కూడలి దాటి బంజారాహిల్స్ వైపు మళ్ళింది. ముప్పై నిమిషాలు గడిచేసరికి తండ్రి ఇల్లు సమీపించింది. ఆకస్మికంగా వచ్చి తండ్రిని ఆశ్చర్యపరుస్తాననుకున్న రంగనాథ్‌కి తండ్రి ఇల్లు మరమ్మతులతో దర్శనమవగా 'ఇంటికి మరమ్మతులు ఏమిటి?' అంటూ ఆశ్చర్యపడ్డాడు.

టేక్సీ డ్రైవర్‌కి టిప్ ఇచ్చి కాలింగ్‌బెల్ నొక్కబోతూ హాలులో సంభాషణ, తండ్రి నవ్వు వినిపించి బెల్ నొక్కకుండా ఆగేడు.

"ఈ మేచ్ గెలవకపోతే మనం టోర్న మెంట్ నుంచి నిష్క్రమిస్తాం" అంది ఒక స్త్రీ గొంతు.

"చూస్తూ ఉండు, ఈ మేచ్ మనం చాలా సునాయాసంగా గెలుస్తాం" అన్న తండ్రి మాటలు విని "తండ్రి ఇంత రాత్ర ప్పుడు స్త్రీతో సంభాషణా?" అని అబ్బుర పడుతూ కాలింగ్‌బెల్ నొక్కేడు రంగనాథ్.

తలుపు తెరచుకుని ఒక స్త్రీ ద్వారంలో నిలబడి ఉంది. గంధపురంగు వెంకటగిరి చీరలో హుందాగా ఉంది. కంటికి ఉన్న రిమ్‌లెస్ కళ్ళద్దాలు ఆమె హుందాతనాన్ని ఇంకా పెంచేయి. అరవై ఏళ్ళు పైపడిన ట్లున్నా, జుత్తు ఇంకా నల్లగానే ఉంది. బహుశా రంగువేసుకుందేమో. పదిసెక న్లలో ఉద్భవించిన వింత ప్రశ్నలతో ఉన్న రంగనాథ్ మొహాన్ని పరీక్షగా ఆమె చూస్తుంటే "ఎవరది?" అంటూ విశ్వ నాథం ఆమె వెనకాలే వచ్చి రంగనాథ్ వేపు చూసి "అదేమిటోయ్, చెప్పకుండా వచ్చేవు. నాకు తెలిస్తే ఎయిర్‌పోర్ట్‌కి వచ్చే వాడినిగా" అన్నాడు ఆశ్చర్యంగా.

"నా ప్రయాణం ఆఖరి నిమిషం వరకు ఖరారు అవలేదు" అన్నాడు రంగనాథ్.

"రా. రా. పది గంటలవుతోంది. ఫ్లైట్‌లో ఏమైనా తిన్నావా?" అంటూ కొడుకును ఆహ్వానిస్తూనే "ఫ్రిజ్‌లో ఏమైనా తినడానికి ఉన్నాయా విశాలాక్షీ?" అడిగాడు విశ్వనాథం.

"మేడ మీద రెండు గదులని ఆమె ఉప యోగిస్తున్నారు. పేరు విశాలాక్షి. ఇతను మా అబ్బాయి రంగనాథ్" అంటూ పరిచ యాలు చేసేడు విశ్వనాథం.

విశాలాక్షి వేపు చూసి ఆశ్చర్యాన్ని కప్పి పుచ్చిన చిరునవ్వుతో లోపలికి వస్తూ "ఫ్లైట్‌లో తిండి బాగా పెట్టారు. ఆకలిగా లేదు. రెండు బ్రెడ్ స్లైసెస్ తిని పడుకుం టాను. జెట్‌లాగ్ వలన నిద్ర రాకపో వచ్చు. ముందు స్నానం చేసి వస్తాను" అన్నాడు రంగనాథ్.

"ఈ ఫ్లోర్‌లో ఉన్న గదులలో సామాన్లు ఉంచి, స్నానం చేసి వచ్చేక మాట్లాడు కుందాం" అన్నాడు రంగనాథ్.

స్నానం చేస్తూ ఎవరీమె? తండ్రితో



ఒంటరిగా ఇక్కడ ఎందుకు ఉంటోంది? చూడడానికి బాగానే ఉంది. తండ్రితో ఇంత సన్నిహితంగా మాట్లాడుతున్న ఈమె అసలు ఎవరు? 'ఫ్రిజ్‌లో ఏమైనా తినడానికి ఉందా విశాలాక్షీ?'- అన్న తండ్రి ప్రశ్న తనని ఆశ్చర్యంలో ముంచింది. తండ్రి రెండు గదులు ఆమెకి నిజంగానే అద్దెకి ఇచ్చేడా? ఎంతకి ఇచ్చేడు? వంటి సవాలక్ష ప్రశ్నలు మెదడుని వేడెక్కిస్తుంటే షవర్ కట్టి, తువ్వాలు అందుకున్నాడు రంగనాథ్. ఆలోచనల్లో మునిగిపోతూనే నైట్‌డ్రెస్ వేసుకుని హాల్‌లోకి వచ్చేసరికి డైనింగ్ టేబుల్ మీద నాలుగు బ్రెడ్ ముక్కలు, వాటి పక్కనే బటర్, జామ్‌లు ఉన్నాయి.

"ఎంత బటర్ రాయాలో తెలియక రాయలేదు" అంది విశాలాక్షి.

శ్రావ్యమైన విశాలాక్షి కంఠం వినగానే తరచూ వినే సునంద కీచుమాటల శబ్దం ఎంత దారుణమో రంగనాథ్‌కి తెలియవచ్చింది.

డైనింగ్ టేబుల్‌కి ఒక ప్రక్కన కూర్చున్న రంగనాథ్‌కి ఎదురుగా విశాలాక్షి, విశ్వనాథం కూర్చుని ఉన్నారు.

ఎలక్ట్రికల్ బల్బ్‌లోంచి వెలువడుతున్న తెల్లని కిరణాలు విశాలాక్షి నుదుట మీద పడి నున్నగా ఉన్న చెంపల మీద నుంచి జారిపోతూ ఆమె ధరించిన గంధపు రంగు పువ్వుల చీర మీద కరచి పట్టుకుని ఇహ కదలనని మొరాయించుకున్నాయి.

"విశాలాక్షికి ఉన్న ఒకే ఒక కూతురు భర్తతో కలిసి అమెరికాలోనే ప్రాక్టీస్



చేస్తోంది చాలా కాలంగా. విశాలాక్షికి ఇద్దరు మనవరాళ్ళు. తను బేంక్‌లో మేనేజర్‌గా పని చేసి నాలుగు సంవత్సరాల క్రితం రిటైరయింది. ఆమెకి విజయానగర్ కాలనీలో ఒక ఇల్లు ఉంది" అంటూ విశాలాక్షి గురించి క్లుప్తంగా వివరించేడు విశ్వనాథం.

'ఆమె నీకు ఎలా పరిచయం అయింది? స్వంత ఇంటిలో ఉండకుండా ఇక్కడ ఎందుకు ఉంటోంది? ఒంటరిగా ఉన్న ఆమె, ఒంటరిగా ఉన్న మీతో ఇక్కడ ఉండడం ఆమె కూతురికి, బంధువులకి ఎలా అనిపిస్తుంది? విడ్డూరమనిపించదూ? ఆమె ఎంత అద్దె ఇస్తోంది?' లాంటి ప్రశ్నలు రంగనాథ్ మెదడులోంచి, కుళ్ళు కాలువలోకి ఎగసివస్తున్న దుర్గంధపు వాసనలా లోపలి నుంచి తన్నుకు వచ్చి నాలిక చివర్న ఆగేయి.

దాదాపు ఇరవై ఐదేళ్లుగా అమెరికాలో నివసిస్తున్న రంగనాథ్‌కి అక్కడి సంస్కృతి జ్ఞాపకానికి వచ్చి తండ్రిని ప్రశ్నలు వేయకుండా అతికష్టం మీద నిగ్రహించుకున్నాడు.

"నువ్వు, సునంద అమెరికా వెళ్లిన కొద్ది రోజులకే విశాలాక్షి పరిచయం అయింది. పరిచయం అయింది అన్నది సగం నిజం. ఒకరోజు తాజ్ ట్రైస్టార్ రెస్టారెంట్‌లో లంచ్ చేయడానికి వెళ్లేను. అక్కడికి నా స్నేహితుడు రవి నాతో లంచ్ చేయడానికి వస్తానన్నాడు. ఆ రెస్టారెంట్ బేస్‌మెంట్‌లో ఉంది. బేస్‌మెంట్‌లో మెట్ల దగ్గర రవి కోసం నిలబడి ఎదురు చూస్తున్నాను.

ఆ సమయంలో విశాలాక్షి మెట్లు దిగుతూ చీర కుచ్చిళ్ళు కాళ్లకి అడ్డం పడడంతో తొట్రుపడి కిందకి దొర్లబోతుంటే నేను అడ్డుపడి ఆమె పడకుండా ఆపేను. 'థేంక్స్' అంది విశాలాక్షి. 'డోంట్ మెన్షన్' అన్నాను కాబోలు. తర్వాత నా స్నేహితుడి కోసం అక్కడ ఉన్న కుర్చీలో ఒక దాంట్లో విసుగ్గా కూర్చున్నాను. నాలుగు కుర్చీల అవతల విశాలాక్షి వాచీ వేపు చూస్తూ కూర్చుని ఉండడం చూసేను.

బహుశా అరగంట గడిచిందేమో.

నా దగ్గరగా నిలుచున్న విశాలాక్షి 'నేను నా మేనకోడలు గురించి చూస్తున్నా. తను రావడం లేదని ఇప్పుడే ఫోన్ చేసింది. మీరు నిరీక్షిస్తున్న వ్యక్తి కూడా ఇంకా వచ్చినట్లు లేదు. మీకు అభ్యంతరం లేకపోతే మనం కలిసి భోజనం చేద్దామా? ' అంది.

ఇద్దరం కలిసి లంచ్ తిన్నాం. లంచ్ తరువాత తన కారులో నన్ను ఇంటి దగ్గర వదిలింది.

'మీరు నన్ను దెబ్బలు తగలకుండా ఆపినందుకు కాదు, కాని ఒకసారి మా ఇంటికి వచ్చి లంచ్ చేస్తే నే సంతోషిస్తాను' అంది విశాలాక్షి, కారులోంచి దిగుతున్న నాతో.

విజయానగర్ కాలనీలో ఉన్న ఆమె ఇంటికి భోజనానికి వెళ్ళేను. తరువాత విశాలాక్షి ఇక్కడికి వచ్చి వంటమనిషి చేసిన చపాతీలు తింది. విశాలాక్షి ఇంటికి దగ్గరగా ఆమె బంధువులు ఎవ్వరూ లేరు. ప్రత్యేకంగా ఆమె గురించి పట్టించుకునే వారు లేరు. ఒక మేనకోడలు జూబ్లీహిల్స్‌లో మన ఇంటికి దగ్గరగానే ఉంది.

పది రోజులు గడిచేయి. ఆ పది రోజుల్లో మూడు నాలుగుసార్లు లంచ్‌కో, డిన్నర్‌కో కలిసేం. మేడ మీద గదులు ఖాళీగా ఉన్నాయి. 'అద్దెకి ఇద్దామా? ' అన్న ఆలోచన వచ్చినా ఆ ప్రయత్నం విరమించుకున్నాను. 'చీకటి పడేక మీరు కారు డ్రైవ్ చేసుకుంటూ ఇంటికి వెళ్ళే కంటే మీరు ఆ గదులని వాడుకోవచ్చు' అన్నాను విశాలాక్షితో" అన్నాడు విశ్వనాథం.

రంగనాథ్ తండ్రి వేపు పరీక్షగా, నిశితంగా చూసేడు. విశాలాక్షితో అయిన పరిచయం, ఆమె ఇక్కడ ఉండడం గురించి చెబుతున్న తండ్రి మొహంలో బిడియమూ, సంకోచమూ ఏమీ లేవు. గిల్టీ భావం అస్సలే కనపడలేదు. తప్పు చేస్తే నిజాన్ని కప్పిపుచ్చుకుని దానిని మరుగుపరుస్తూ ఏ బెరుకూ లేకుండా నటించే శక్తి తండ్రికి లేదు. 'విశాలాక్షి ఈ ఇంటిలో ఉండడం గురించి ఎక్కువ ఆలోచన అవసరమా? ' అనుకున్నాక కూడా రంగనాథ్ విశాలాక్షి గురించి ఆలోచనల్ని పారద్రోలలేకపోయాడు.

"మరో రెండు బ్రెడ్ స్లైసెస్ టోస్ట్ చేసేదా? " అనడిగింది విశాలాక్షి. 'స్లైసెస్' అంటూ మృదుమధురంగా ఉచ్చరించిన పదం రంగనాథ్‌ని ఆలోచనల్లోంచి మేల్కొల్పింది. ఆలోచనలో పడి ప్లేట్‌లో ఉంచిన నాలుగు బ్రెడ్ ముక్కలు తినేసేడని గ్రహించి రవ్వంత సిగ్గుపడుతూ "వద్దు. ఆలోచనలో పడి చూడలేదు" అన్నాడు.

"కొత్త ప్రదేశాలు, కొత్త మనుషులు, కొత్త సన్నివేశాలు మనల్ని కావలసిన దానికన్నా ఎక్కువ ఆలోచింపచేస్తాయి. అప్పుడప్పుడు అవి అలజడిని రేకెత్తిస్తాయి" అంటూ మెల్లగా నవ్వింది విశాలాక్షి. శబ్దం లేకుండా నవ్విన నవ్వది. గంపెడు విరజాజుల్ని ఒక్కసారి కుప్పగా పోస్తే మెత్తని శబ్దం సువాసనని విస్తరించినట్లు విశాలాక్షి నోటంబడి ఆ రెండు వాక్యాలు బైట పడి, కంటిలోంచి తొంగిచూసిన మందహాసం చెక్కిళ్ల మీదకి వ్యాపించింది.

'ఆమె నా ఆలోచనలని పసిగట్టిందే' అనుకుని "నాన్నా ఈ జెట్‌లాగ్ వలన ఎప్పుడు లేస్తానో తెలియదు. ఉదయమే

లేచి కాఫీ చేసుకోవడానికి వీలుందా? రేపు ఉదయం పది గంటలకి ఆఫీసుకి వెళ్ళాలి" అన్నాడు రంగనాథ్.

"మార్నింగ్ వాక్‌కి మేమూ తొందరగా నే లేస్తాం" అన్నాడు విశ్వనాథం.

"రెండు పాల పేకెట్లు రిఫ్రిజిరేటర్‌లో ఉంటాయి" అంది విశాలాక్షి.

"గుడ్ నైట్" అంటూ తన గదివేపు నడి చేడు. పరుపు మీదకి చేరిన రంగనాథ్‌ని తికమక పెట్టే ఆలోచనలు రొద చేస్తూ ని ద్ర రానివ్వడంలేదు.

'మేమూ తొందరగా లేస్తాం' అన్న తండ్రి వాక్యంలో అర్థం ఏమిటి? ఇద్దరూ ఒకే సమయానికి లేస్తారనా? ఇద్దరూ కలిసి లేస్తారనా? విశాలాక్షి చాలా సమ ర్థురాలిలా ఉంది.

'హైదరాబాద్‌లో ఉన్న ఇల్లు అమ్మి, ఆ వచ్చిన డబ్బుని డాలర్లలోనికి మారిస్తే, మనం పిల్లలకి ఇళ్లు కొనుక్కోవడానికి డబ్బు ఇవ్వగలం' అంటూ హెచ్చరిస్తూ సాగనంపింది సునంద. ఇక్కడ కనిపి స్తున్న పరిణామాల గురించి చెబితే ఆమె బహుశా జుత్తు పీకేసుకుంటుందేమో! రెండు సంవత్సరాల తరువాత అమెరికాలో చేరిన ఉద్యోగంలో జీతం అంతకుముందర జీతంతో లెక్కకడితే కేవలం అరవై శాతం. టేక్స్‌లు పోగా తనకేమీ మిగలదు. పిల్లల చదువులకి, ఇంటిమీద అప్పు తీసుకో వడంతో తన పేరు మీద ఉన్న ఇల్లు విలువ సున్నా. అమెరికా వెళ్లి దాదాపు ఇరవై నాలుగేళ్లయింది. తనది పెన్షన్ ఉద్యోగం కాదు. రిటైర్‌మెంట్ కంటూ తను కొంత డబ్బు జమచేస్తే బేంక్ దానికి కొంత జమ చేస్తుంది. ఆ మొత్తం పైకం తన పేరునే ఉన్నా ఆ డబ్బు అరవై ఏళ్లు రాకముందు వాడితే పెనాల్టీ వేస్తారు. తను రిటైరయే సమయం ఇంకా ఇరవై ఏళ్లపైనే ఉంది. ఐనప్పటికీ చాలా మంది అమెరికన్లలాగా దాని గురించి తలచు కుంటే భయం వేస్తుంది. ఇప్పుడు పిల్లలు తనంటే ఆప్యాయత కనపరుస్తున్నారు. కాని తను వృద్ధాప్యంలోనికి అడుగు పె ట్టాక వాళ్ళ ప్రవర్తన ఎలా ఉంటుందో! డబ్బు! డబ్బు! అమెరికాలో సౌఖ్యంగా ఉండడానికి డబ్బు దండిగా కావాలి అను కుంటుంటే మేడ మీద నుంచి తండ్రి దగ్గు వినిపించింది. రంగనాథ్ ఆలోచనలు పుటుక్కున తెగాయి.

"ఖళ్.. ఖళ్.." మంటూ తండ్రి దగ్గు విని మేడ మీదకి వెళ్లి చూద్దామా? అని పించినా తండ్రి పడక గదిలో ఒంటరిగా ఉన్నాడా? అన్న అనుమానం రంగనాథ్‌ని పెనుభూతమై కట్టి పడేసింది. తండ్రికి విశాలాక్షి నీళ్లు అందించిందా? లేక తండ్రి తనంత తాను నీళ్లు తెచ్చుకుని తాగేడా? ఏది ఏమైనా తండ్రి దగ్గు మళ్లీ వినిపించ లేదు.

ఏమిటో! తను ఇక్కడికి రాకుండా ఉండాల్సింది. అమెరికా తిరిగి వెళ్లిన మూడు నెలలకే తనని ఉక్కిరి బిక్కిరి చేసే పరిస్థితులు ఎదురవుతాయని తను ఊహించలేదు. అరవై ఎనిమిదేళ్ల తండ్రి గురించి ఆలోచనలు ఆరంభమై, తన రిటై ర్‌మెంట్ రోజుల దగ్గరికి తీసుకెళ్ళాయి. అంతా గందరగోళంగా ఉంది. తను ఇక్క

## కొత్తగాలి...

**ఆప్తమిత్రుడు**
**బాహ్యంగా కంటిరెప్ప!**
**అంతర్గతంగా**
**గుండె చప్పుడు!!**

– ఎం. కృష్ణ,
కాకినాడ

డికి ఇరవై రోజులు ఆఫీస్ పని మీద వచ్చేడు. తను అమెరికా తిరిగి వెళ్లేలోగా ఏమైనా పురోగమనం ఉంటుందా? తండ్రి ఆలోచనలేమిటో? గత రెండు సంవత్సరాలలో తండ్రితో పరిచయం పెరిగినా, డబ్బు విషయంలో తప్ప తండ్రితో తనేమీ ఎప్పుడూ చర్చించలేదు. ఈ రెండేళ్ళే ఏమిటి? అంతకు ముందర ఇరవై నాలుగేళ్ల అమెరికా జీవనంలో, ఆ పరుగులో తనూ, తండ్రి ఉప్పుడుబియ్యం మెతుకుల్లా ఉండిపోయేరు. ఇప్పుడు గబుక్కున ఇద్దరి మధ్యా ఉన్న అగాధం మీద వారధి కట్టడం సాధ్యమా? తండ్రి గురించి తనెప్పుడూ ప్రత్యేకంగా వ్యాకుల పడలేదు.

## కొత్తగాలి...



**అధికార యోగం**
**అహంకార రోగం**
**పదవి పోయినా**
**మత్తు వదలదు**

– జె.ఎం. శర్మ,
హస్తినాపురం సౌత్, హైదరాబాద్

తను గత్యంతరం లేక ఇండియా రావడంతో ప్రాముఖ్యత కోల్పోయిన తండ్రికి మళ్ళీ ప్రాముఖ్యత వచ్చింది. ఆ ప్రాముఖ్యత చెప్పలేనంత ఎత్తుకి ఎదగడానికి కారణం ఈ కోట్ల ఖరీదు చేసే ఇల్లు. తండ్రి ఇక్కడ సామాన్యంగా బ్రతుకుతూంటే, తనూ, సునంద ఆయన గురించి ఇంతగా ఆలోచించేవారా? ఒక్కసారి రంగనాథ్‌లో దాక్కుని ఉన్న గిల్ట్ బైటపడగా కణతలు నొక్కుకుని తలగడని వాటేసుకున్నాడు.

దాదాపు మిలియన్ డాలర్ల జూబ్లీహిల్స్ ఇల్లు! కొత్తగా దానిని కాపలా కాస్తున్నట్లు కనిపించిన విశాలాక్షి! కత్తి పట్టుకుని జడిపిస్తూ అందులోనికి జొరపడడానికి ప్రయత్నిస్తున్న సునంద! అంతా పీడకలలా రాత్రి గడిచింది రంగనాథ్‌కి. చేతివాచీ ఉదయం ఐదున్నర గంటలు చూపించగానే లేచి పళ్ళు తోముకుని కాఫీ కలుపుకోవడానికి హాల్‌లోనికి వచ్చేడు. డైనింగ్ టేబుల్ దగ్గర ఉన్న కుర్చీలో తండ్రి కూర్చుని ఉన్నాడు. విశాలాక్షి కాఫీ కలుపుతోంది.

రంగనాథ్ రావడం చూసి "మీ కాఫీలో చక్కెర మామూలుగా వేసేదా? " అనడిగింది విశాలాక్షి.

తండ్రి అప్పుడే లేచి కాఫీ తాగడానికి తయారుగా ఉండడం చూసి 'గతంలో తండ్రి ఇంత త్వరగా లేచేవాడా? ' అన్న ప్రశ్న ఉదయించింది.

"చక్కెర వెయ్యవద్దు" అంటూ తండ్రి పక్కనే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు రంగనాథ్.

వేడి స్ట్రాంగ్ ఫిల్టర్ కాఫీ ఒక గుక్క తాగేసరికి దానిలో ఉన్న రుచి, సువాసన ఆస్వాదించగానే రంగనాథ్ నోటిలో నీరూరింది.

"కాఫీ బాగుంది" అన్నాడు.

'థేంక్స్' అన్నట్లుగా మందహాసం చేసింది విశాలాక్షి. ఐదు నిమిషాల తరువాత తండ్రి కాఫీ తాగడం ముగించి, లేచి ఖాళీకప్పుని కడగడం కొత్తగా అనిపించింది రంగనాథ్‌కి.

"మన కప్పు మనం కడుక్కోవడం మంచి అలవాటు. అలా చేయకపోతే కప్పులకి గార పట్టేస్తుంది" అన్నాడు విశ్వనాథం.

"బయలుదేరుదామా? " అంటూ వాహ్యాళికి నిలబడింది విశాలాక్షి.

'ఓ, యస్" అంటూ హుషారుగా నడకకి వెళ్తున్న తండ్రిని చూసి 'ఈయనలో

మార్పు వచ్చింది' అనుకుంటూ తల పంకించేడు రంగనాథ్.

"కాఫీ డికాక్షన్ ఫ్రిజ్‌లో ఉంది. కావాలంటే వాడుకో. ఒక గంటలో తిరిగి వస్తాం" అంటూ విశాలాక్షి బైటకి వెళ్లగానే, మళ్లీ కాఫీ కలుపుకుని తాగుతూ కళ్ళు మూసుకున్నాడు.

కాఫీ తీయగా ఉంది. పరాకున తను పంచదార వేసుకున్నానని గ్రహించి 'ఇండియాలో కాఫీకి పంచదార కలిపితేనే రుచి బాగుంటుంది. డికాక్షన్ పలచగా తను అమెరికాలో తాగే కాఫీకి పంచదార వేయకపోయినా ఫరవాలేదు' అనుకుంటూ తొందరగా కాఫీ తాగనారంభించాడు రంగనాథ్. కాఫీలో పంచదార వేసుకోవడం అంటే గేలిచేసిన రోజు జ్ఞాపకానికి వచ్చింది. బేంక్‌లో తను పనిచేసే విభాగంలోని రోజ్ ఆఫీస్ అసిస్టెంట్. "సెక్రటరీ అన్న బిరుదు బాగా లేదని, 'ఆఫీస్ అసిస్టెంట్' అయితే గంభీరంగా ఉంటుందని, జీతం పెంచకపోయినా టైటిల్ మార్చేరు" అంది ఒకరోజు, గలగలా నవ్వుతూ. రోజీ చాలా స్మార్ట్. పనిలో కూడా అంతే. ఆరడుగుల పొడవు, డెబ్బయి ఐదు కిలోల బరువుతో రోజీది భారీ విగ్రహమే. ఆమెకి నలుగురు పిల్లలు. భర్త గురించి ఎప్పుడూ ప్రస్తావించేది కాదు. ఆమెకి వచ్చే అత్తెసరు జీతంతో నలుగురు పిల్లల్ని ఎలా పోషించేదో? అని తను ఆశ్చర్యపడేవాడు. ఆఫీస్‌లో ఎప్పుడూ చిరాకు ప్రదర్శించకుండా ప్రవర్తించే రోజీ అంటే అందరికీ మంచి అభిప్రాయం ఉండేది. ఆమె అరవయ్యవ జన్మదినంనాడు ఆఫీస్‌లో అందరూ చందాలు వేసుకుని కేక్ తెచ్చి ఆమెచేత కట్ చేయించేరు. తను కాస్త ఖరీదయిన బొకే తీసుకెళ్ళి ఆమెకి అందిచ్చి 'హ్యాపీ బర్త్‌డే' అన్నాడు. అది అందుకుని స్నేహపూర్వకంగా తన బుగ్గని, బుగ్గకి ఆనిచ్చి కౌగిలించుకుంటూ "యూఆర్ నైస్ రామ్! కాని అరవయ్యవ జన్మదినోత్సవం అందరినీ ఆనంద పరచదు" అందామె.

"కమాన్ చీర్ అప్" అని మాత్రం చెప్పి తన గదిలోనికి వచ్చేడు.

సాయంకాలం ఆఫీస్‌ను వదిలి వెళ్లబోతూ రోజీ గదిలోనికి చూశాడు. ఆమె ఉదాసీనంగా ఉండడం గమనించి "ఏమిటి ప్రోబ్లెమ్ రోజీ? " అనడిగేడు.

"అలా అడిగినందుకు థేంక్స్. అరవై ఏళ్లు వచ్చేయి. అంటే జీవితం..." అంటూ గొణిగింది రోజీ.

"నీకేమి తక్కువ రోజీ. యు ఆర్ స్మార్ట్. నీకు జీవితం చాలా ఉంది" అన్నాడతను.

"థాంక్యూ..థాంక్యూ" అంటూ తన బుగ్గ మీద తన రెండువేళ్లతో తట్టి బాత్రూం వేపు వెళ్ళింది రోజీ.

ఆమె రాకకోసం నిరీక్షించాడతను.

ఐదు నిమిషాల్లో తిరిగి వచ్చిందామె.

"పిల్లలు వాళ్ళ జీవితాలని వాళ్లు మలుచుకున్నారు. మా ఆఖరి అమ్మాయి వయస్సు ముప్ఫయి రెండు. యు ఆర్ రైట్. నా మానాన నేను జీవిస్తున్నాను" అంది కాసేపటికి తేరుకుని.

"నీ పిల్లలు నిన్ను వచ్చి రోజూ పలకరిస్తుంటారా? "

రోజీ పకపకా నవ్వింది. "వెర్రి రామ్. నేను ఒక హైవేమీద కారులో ప్రయాణం చేస్తుంటే, వాళ్ళు ఇంకోహైవే మీద పరుగులు పెడుతూ ఉంటారు. ఆప్యాయత లేదని కాదు, నువ్వు విన్నావో లేదో కాని ఒకసారి గూటిలోంచి ఎగిరిపోయిన పక్షి పిల్ల తన పాత గూటికి చేరదు" అంది.

"ఇండియాలో అరవై ఏళ్ళు వచ్చేసరికి రిటైర్ అవమంటారు. తరువాత చాలామందికి కావాలన్నా పని దొరకదు"

"ఇంకో నాలుగు, ఐదు సంవత్సరాలలో కాస్త డబ్బు పోగయేక నేనూ రిటైర్ అవుతాను. కొత్త ప్రదేశాలు చూస్తాను" అంది ఎటో చూస్తూ.

ఇది జరిగి నాలుగేళ్లయింది. తను ఇండియాలో ఉండగా 'నువ్వు నా శ్రేయోభిలాషివి. వచ్చే వారం నేను పెళ్లి చేసుకోబోతున్నాను. ఏభై ఏళ్ల తరువాత నా హైస్కూల్ స్వీట్ హార్ట్ కనిపించేడు. అతను ఒంటరిగా జీవిస్తున్నాడు. పెళ్ళి లూథరన్ చర్చిలో. పెళ్ళయేక కరేబియన్ క్రూయిజ్ మీద హనీమూన్‌కి వెళ్తాం. "విష్ మి బెస్ట్ ఆఫ్ లక్" అంటూ మెయిల్ పంపింది.

తను గ్రీటింగ్స్ పంపేడు.

'రోజీ పెళ్ళి చేసుకుంది' అని తను సునందకి చెబితే "అరవై ఐదేళ్ల బాలాకుమారికి పెళ్ళేమిటి? ఎవడిని పట్టింది? " అంది.

"తన హైస్కూల్ స్వీట్‌హార్ట్‌ని పెళ్ళిచేసుకుంది. షి డిసర్వ్స్ ఇట్" అన్నాడతను.

"ఇహ ఇద్దరూ కర్రల ఊతలతో చెట్టాపట్టాలేసుకుని తిరుగుతారు కాబోలు"

'ఐ లైక్ రామ్', 'ఐ లవ్ రామ్' అన్న పదాలు గతంలో రోజీ సునందతో అనడం సునందకి సుతరామూ నచ్చలేదు.

అమెరికాలో ఐ లైక్ యు, ఐ హేట్ యు, ఇటీజ్ ఇంటరెస్టింగ్.. సంకోచించవద్దు, అవసరమైతే నన్నుపిలు.. లాంటి పదాలు తెగ విరివిగా ఉపయోగిస్తారని, వాటికి ప్రత్యేక విలువ ఆపాదించకూడదని సునందకి రెండు మూడుసార్లు వివరించబోతే, "వాళ్లకి అంటూ సొంటూ లేదు, దేనికీ విలువ ఇవ్వరులెండి" అంటూ సునంద పెదవి విరిచింది.

"ఏంటోయ్, ఏదో ఆలోచనలో పడ్డావ్" అంటూ తండ్రి పలకరించడంతో వాస్తవంలోనికి వచ్చేడు రంగనాథ్. జోళ్ళని విప్పి డైనింగ్ టేబిల్ వద్దకు వస్తున్న విశాలాక్షి వేపు దృష్టి మరలింది. పొడిగా ఉన్న వాతావరణం, పట్టిన చమటని ఆవిరి చేసినా, విశాలాక్షి నుదుటిమీద రవ్వంత చెమట నిలబడి మెరుస్తోంది. అలసట వలన కలిగిన ఉద్వేగం చెంపలకి రవ్వంత ఎరుపు రంగుని అందిచ్చింది. సరిగ్గా దువ్వుకోని జుత్తులోంచి ఎగురుతున్న ముంగురులని చూసేక- ఇప్పుడు, అరవైనాలుగేళ్ల వయసులో ఈమె ఇలా ఉంటే యవ్వనంలో ఇంకా చాలా అందంగా ఉండేది అనుకుని, "ఆలోచన అంటూ ఏమీ లేదు. ఎంతదూరం నడుస్తారు? " అనడిగేడు రంగనాథ్.

"బహుశా మూడు కిలోమీటర్ల దూరానికి నలభై అయిదు నిమిషాలు పడుతుంది. విశాలాక్షి ఇంకొంచెం దూరం నడుద్దామని అంటుంది. కాని ఈ నడక చాలు అంటుంటాను"

"రిఫ్రిజిరేటర్‌లో ఉన్న డికాక్షన్ వాడేసాను" అన్నాడు రంగనాథ్ వాష్‌బేసిన్ దగ్గర కప్పు కడుగుతూ.

"మళ్లీ ఫిల్టర్ వేసేను. మీకు ఇడ్లీ బ్రేక్‌ఫాస్ట్ ఇష్టమేనా? "

"ష్యూర్. అరగంటలో స్నానం చేసివస్తాను"

'విశాలాక్షికి ఈ ఇంటికి ఏమిటి సంబంధం? ' అన్న ప్రశ్న వక్కపొడి నోటిలో వేసుకుంటూంటే దానిలో వచ్చిన పెద్ద వక్కముక్కలా, కొరుకుడు పడడం లేదు. 'ఇంకా ఇరవై రోజులు ఉన్నాయి. ఈ చిక్కుముడి వీడుతుందా? చూద్దాం. తండ్రి తన మాట వింటాడు' అనుకుని తేలిక పడిన మనసుతో స్నానం ముగించి బట్టలు వేసుకుని హాల్‌లోనికి వచ్చేడు రంగనాథ్.

విశ్వనాథం, విశాలాక్షి పేపర్లు చదువుతున్నారు. కళ్లద్దాలలోంచి నిశితంగా అక్ష

రాల మీద దృష్టి కేంద్రీకరించిన విశాలాక్షి రంగనాథ్‌ని చూడగానే పేపర్ మడిచి పక్కకి పెట్టింది. డైనింగ్ టేబిల్ మీద గిన్నెలలో ఇడ్లీ, సాంబార్, కొబ్బరి పచ్చడి, కారప్పొడి ఉన్నాయి.

"వేడి చల్లారిపోతాయి" అంటూ ప్లేట్లలో మూడు ఇడ్లీలను, బౌల్స్‌లో సాంబార్‌ని పోసింది. మెత్తగా ఉబ్బి ఉన్న ఇడ్లీలు, రుచికరంగా ఉన్న చిన్న ఉల్లిపాయల సాంబార్, పచ్చడితో అయిదు ఇడ్లెన్లు ప ట్టించేడు రంగనాథ్.

"నీ ఆఫీసు పంజాగుట్టలో కదూ? విశాలాక్షి తనకారులో నిన్ను మీ ఆఫీస్ దగ్గర వదిలేస్తుంది. నువ్వు మీ ఆఫీస్‌కి ఎన్నిగంటలకి చేరాలి? "

"అనవసరంగా ఆవిడని ఇబ్బంది పెట్టడ మెందుకు? నేను ఆటోరిక్షాలో వెళతాను" అన్నాడు రంగనాథ్ మొహమాటపడుతూ.

"ఇబ్బంది ఏమీలేదు. ఆ ప్రాంతంలో నాకు పని ఉంది" అంది విశాలాక్షి.

ట్రాఫిక్‌జామ్‌లో కారు చిక్కడిపోయినా, ఎంతో శాంతంగా కారు నడిపిన విశాలాక్షి, ఆమె ప్రవర్తన ఆఫీస్‌లో చర్చలలో పాల్గొంటున్న రంగనాథ్ మనస్సులో ఓమూల మెదులుతూనే ఉంది. 'విశాలాక్షి వయస్సు అరవై నాలుగు, నెలకి దాదాపు ముప్ఫయి అయిదువేల రూపాయల పెన్షన్, విజయా నగర్ కాలనీలో స్వంత ఇల్లు ఉంది. బాదరబందీలు ఏమీలేవు. మరి తండ్రి నుంచి విశాలాక్షి ఏమాశిస్తోంది? అయిదు కోట్ల ఖరీదుచేసే ఇల్లా? తండ్రి ఆమెని ఆహ్వానించడంలో ఉద్దేశ్యమేమిటి? ఈ ప్రశ్నలన్నింటికి రాబోయే ఇరవై రోజుల్లో సమాధానాలు దొరుకుతాయా?' అనుకుంటూ ఆఫీస్ చర్చవేపు దృష్టి కేంద్రీకరించాడు రంగనాథ్.

★ ★ ★

'రంగనాథ్ ఇండియా వెళ్లి వారం రోజులయింది. ఇండియా చేరేక అక్కడ నెల కొన్న పరిస్థితుల గురించి ఫోన్ చేస్తానన్నాడు. కాని ఇంకా ఫోన్ రాలేదు. ఏమయిందో!' అని సునంద అనుకుంటుంటే ఫోన్ మోగింది.

"మమ్మీ! నేను వినోద్‌ని ఫోన్ చేస్తున్నాను. మనఇంటికి దగ్గరగా ఉన్న కంపెనీలో నాకు, నా ఫ్రెండ్‌కి ప్రోజెక్ట్ వర్క్ చేసే అవకాశం వచ్చింది. ఈ ప్రోజెక్ట్ వర్క్ పదిహేడు- పద్దెనిమిది రోజులు ఉంటుంది. డిగ్రీ అందుకోవడానికి ముందర ఇవే ఆఖరి శెలవులు. నేనూ, నా ఫ్రెండ్ మేడమీద గదులు వాడుకుంటాం. దీనికి నీ అభ్యంతరం ఉండదన్న నమ్మకంతో నేను తనకు వాగ్దానం చేసేను. రేపు మధ్యాహ్నం శాన్‌ఫ్రాన్సిస్కో ఎయిర్ పోర్ట్‌లో దిగి ఇంటికి వస్తాం. నా ప్రోజెక్ట్ వర్క్ పూర్తయ్యేలోగా డాడీ ఇండియా నుంచి తిరిగి వచ్చేస్తారనుకుంటాను" అంటూ హడావుడిగా సంభాషణ ముగించిన వినోద్ మీదకి సునంద ఆలోచన వెళ్లింది.

ఇరవై నాలుగేళ్ల వినోద్ ఎక్కౌంటెన్సీ విభాగంలో డిగ్రీ పుచ్చుకోబోతున్నాడు. ఇప్పుడు అమెరికాలో ఎక్కౌంటెంట్స్‌కి గిరాకీ ఉందో లేదో? ఇండియాలో అయితే చార్టెడ్ ఎక్కౌంటెంట్ పరీక్ష పాసయితే

## కొత్తగాలి...

**వైద్యులకు**
**రోగులు**
**వ్యాపారులకు**
**కరువులు**
**కల్పతరువులు!!!**

*– డి. చిరంజీవి రావు, శ్రీకాకుళం*

రెండు చేతులలో పడేది డబ్బు కాదు, బంగారం. మరి ఇక్కడ అలాంటి అవకాశం ఉందా? దేముని దయవలన సవ్యంగా చదువు పూర్తయి మంచి ఉద్యోగం వస్తే, వాడి పెళ్లి వెంకన్న సాన్నిధ్యంలో చేయిస్తానని తను మొక్కుకుని ముడుపు కట్టింది. ఎంచక్కా వినోద్ మంచి గ్రేడ్స్‌తో డిగ్రీ తెచ్చుకోబోతున్నాడు. మరొక మూడు నెలలు, అంతే! వాడు ఉద్యోగపు వేటలో పడతాడు. సాధారణంగా ఈపాటికి కేంపస్ ఇంటర్వ్యూ లాంటివేవో జరిగితే వాడికి ఉద్యోగం వచ్చేదే. కాని ఈ ఆర్థికమాంద్యం పుణ్యమా అని అవేమీ జరగలేదు. వినోద్ ఫోన్ చేసినపుడు ఎయిర్‌పోర్ట్ నుంచి పికప్ చెయ్యమని అడగలేదు. అంటే వాడి స్నేహితుని సహాయంతో ఇంటికి వస్తాడు కాబోలు. వినోద్ తనని ఎయిర్‌పోర్ట్‌కి రమ్మనమని అడిగి ఉంటే తను గాభరా పడేది. దారంతా తెగ రద్దీగా ఉంటుంది. సాయంకాలం వేళ మరీను. కారు పార్కింగ్‌కి పది డాలర్లు, వెళ్లి రావడానికి ఇరవై డాలర్ల పెట్రోల్ ఖర్చు. అంటే వెరసి ముప్పయి డాలర్లు ఖర్చు. కారు నడపడం వలన కలిగే టెన్షన్! 'రేపు వినోద్ వచ్చేలోగా ఇల్లంతా శుభ్రంచేసి ఇండియన్ స్టోర్‌కి వెళ్లి కూరగాయలు తెచ్చి వివిధ రకాలైన కూరలు చేసి రిఫ్రిజిరేటర్‌లో పడేస్తే ఎప్పుడు కావాలంటే అప్పుడు మైక్రోవేవ్‌లో వేడి చేసుకోవచ్చు' అనుకుని సోఫాలో బరువుగా కుదేసిన శరీరాన్ని లేపింది సునంద.

ఒక గంట తరువాత ఇండియన్ అంగడి నుంచి తెచ్చిన కూరల్ని సర్దుతూ 'వినోద్‌తో వచ్చే వ్యక్తి ఇండియనా? తెలుగు మాట్లాడే మనిషా? ఉత్తరాది వాడా? అతని వివరాలు తెలియకుండా ఇప్పుడు ఏ వంట మొదలుపెట్టను?' అనుకుంటూ సందిగ్ధంలో పడింది సునంద.




**ఇం**టి ముందర కారు ఆగిన శబ్దం విని సునంద తలుపు తెరచి ఎదురుగా నిలబడ్డ వినోద్‌ని చూసి "రా వినోద్" అని ఆహ్వానిస్తూ, వినోద్ వెనకాతల నిలబడ్డ వ్యక్తి వేపు దృష్టి మళ్లించింది.

"కమాన్ మరియా. ఈవిడ మా మమ్మీ. ఈమె మరియా" అంటూ తనతో వచ్చిన వ్యక్తిని పరిచయం చేసేడు వినోద్.

ఒక్కసారి ఉలిక్కిపడి, తేరుకుని, కృత్రిమమైన తెచ్చి పెట్టుకున్న నవ్వుతో "ప్లీజ్ కమిన్" అంటూ స్వాగతం పలికింది సునంద.

"మమ్మీ సూట్‌కేస్‌లు మేడమీద గదిలో పెట్టి వస్తాం" అంటూ వినోద్, మరియా మేడ మెట్లు ఎక్కుతుంటే వాళ్లని ఆశ్చర్యంతో గమనించింది సునంద.

'ఎవరీ మరియా? వినోద్‌కి ఆమెకి ఎలాంటి పరిచయం? ఒంటరి ఆడపిల్లతో ఇంటికి వచ్చే ధైర్యం వినోద్‌కి వచ్చేసిందా?' చూసిన అరక్షణంలో 'మరియా బాగానే ఉంది' అనిపించినా, 'ఎలా ఉంటే ఏం? ఆమె వినోద్‌కి ఏమౌతుంది?' అన్న ప్రశ్నలకి ఒకేసారి సమాధానం చెప్పుకోలేక సతమతమవుతుంటే-

"మరియా షవర్ చేసి వస్తానంది. ఇప్పుడు అయిదున్నరే అయింది. ఆమె

వచ్చేక డిన్నర్ చేద్దాం. నీకు ఆలస్యమవుతుందనిపిస్తే నువ్వు తినేయవచ్చు" అంటూ వచ్చి తల్లికి ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు వినోద్.

"ఫరవాలేదు, ఆమె వచ్చాకే తిందాం. తొందరగా డిన్నర్ చేసే అలవాటు నాకు లేదు. స్నానానికి ఆమెకి అవసరమైనవి బాత్రూంలో ఉన్నాయో లేవో చూసేవా? " అనడిగింది సునంద.

"తువ్వాళ్లు, సబ్బు బాత్రూంలో పెట్టే వచ్చేను. ఎలా ఉన్నావు మమ్మీ? ఇందాక అమృత ఆంటీ కనిపించారు. చెయ్యి ఊపేను. ఆమె గమనించినట్టు లేదు" అన్నాడు వినోద్.

"ఎక్కడ కనిపించింది? ఎలా ఉంది? "

"ఎయిర్‌పోర్ట్ నుంచి వస్తూ నేను, మరియా దారిలో మాల్‌లో కాఫీకోసం ఆగాం. అమృత ఆంటీ అక్కడికి దగ్గరగా ఉన్న ఆలివ్ గార్డెన్ రెస్టారెంట్‌లోంచి ఒక అపరిచిత వ్యక్తితో బైటికి వచ్చింది. ఆయనని నేను ఇదివరలో ఎప్పుడూ చూడలేదు"

"నేను ఇండియా నుంచి తిరిగి వచ్చేక అమృత ఆంటీని కలవలేదు. కామేశం అంకుల్ చనిపోయాక కూతురి దగ్గరికి వెళ్లి ఉంటోందని విన్నాను. తిరిగి వచ్చిందా? లేక మళ్లీ వెళ్లిపోయిందా? అన్నది ఆమెకి ఫోన్‌చేస్తేగాని తెలియదు"

"మమ్మీ. నాకు నీ కారు ఇవ్వగలవా? లేకపోతే డాడీకారు వాడుకునేదా? అద్దెకి తెచ్చిన కారుకి అవసరంగా డబ్బు ఎందుకు ఇవ్వడం? "

"రేపు నాకు ఏమీ పనిలేదు. అయినా డాడీ కారునే తీసుకెళ్లు"

విరబోసుకున్న జుత్తుని సవరించుకుంటూ మరియా రావడంతో సునంద, వినోద్‌ల మధ్య సంభాషణ ఆగింది.

"డిన్నర్ చేద్దామా? ఇండియన్ వంటకాలు మరియాకి నచ్చుతాయో లేదో? " అంటూ ప్లేట్లని అమర్చింది సునంద.

"మరియాకి ఇండియా వంటకాలు కొత్త కాదు. మసాలా కూరలంటే చాలాఇష్టం" అన్నాడు వినోద్.

జుత్తుని వెనక్కి విదిలిస్తూ మరియా నవ్వింది. వినోద్ వేపు తిరిగి మరోసారి జుత్తుని విదిలిస్తూ "ఐ లైక్ ఇండియన్ ఫుడ్ వెరీమచ్" అంటూ సునంద అందిచ్చిన ప్లేట్లో ఆహార పదార్థాలని వడ్డించు

## క్రియేటివిటీ అంటే ఇదేనా?!

'అల్లూరి సీతారామరాజు' చిత్రం షూటింగ్ జరుగుతోంది. వి.రామచంద్రరావు మధ్యలో చనిపోవడంతో ఆ బాధ్యత కె.యస్.ఆర్. దాసుతో బాటు విజయనిర్మల కూడా తీసుకున్నారు. పిళ్ళై పాత్రధారి కె.వి.చలంకి త్రిపురనేని మహారథి రాసిచ్చిన డైలాగులు ఇచ్చారు. ఆ డైలాగులలో ఒక్క డైలాగు కూడా ఒంటబట్ట



లేదు. అతడు తెలుగు, తమిళ భాషలు మాట్లాడ్డంలో మాస్టర్ కదా! దాంతో తన సొంత డైలాగులు చెబుతుండేవాడు. ఆ డైలాగులు బావుండటంతో అవే కంటిన్యూ చేయమనేవారు. అయితే ఒక్కో టేక్‌కి ఒక్కోలా చెప్పేవాడు కె.వి.చలం. మిగతా కాంబినేషన్‌లో వున్న ఆర్టిస్టులంతా కంగారు పడేవారు.

దాసుగారు సీరియస్‌గా "నువ్వు ఏదో ఒక డైలాగ్‌కి ఫిక్స్ అవ్వు. ఇన్ని వెర్షన్లు చెప్పకు!" అన్నారు.

"క్రియేటివిటీ అంటే ఇదే సార్ మరి!" అన్నాడు చలం సీరియస్‌గా.

దాంతో యూనిట్ అంతా గొల్లుమంది.

కుంది మరియా.

ఆమెవేపే తదేకంగా చూస్తున్న వినోద్‌తో "నువ్వు వడ్డించుకో" అంది సునంద.

"మా మమ్మీ బాగా వండుతుంది" అంటూ పదార్థాలన్నీ ప్లేట్లో వేసుకుని మరియా వైపు తిరిగి మందహాసం చేసేడు వినోద్.

"వాసన బట్టే తెలుస్తోంది, ఐనో" అంటూ కళ్లు చికిలించి నవ్వింది మరియా.

మరియా, వినోద్‌ల మధ్య నడుస్తున్న కొంటెచూపుల ధారావాహినిని గమనించగానే సునందకి లోలోపల చిర్రెత్తుకు వచ్చింది.

కొత్తగాలి...

**ప్రపంచాన్నంతటినీ**
**సమైక్యంగా**
**ఉంచేది**
**గ్లోబు**

– డి. చంద్రావంశీ,
కర్నూలు

మణిపూర్ నాట్యకత్తెలు వేసుకునే కోవకి చెందిన నైట్‌డ్రెస్‌లో సన్నని నడుము, బలంగా ఉన్న ఉపరిభాగం, మోహనంగా ఎగురుతున్న ఒత్తుజుత్తు, చెవులకి వాడుతున్న రింగులతో లైట్ల వెలుతురులో వెలిగిపోతున్న మరియాని చూడగానే సునందలో ఈర్ష్య రాజుకోవడం మొదలుపెట్టింది. సభ్యత కోసం తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో "మీరు తింటూ ఉండండి. ఇప్పుడే వస్తాను" అంటూ బాత్రూంలో ప్రవేశించి అద్దంలో తన ప్రతిబింబం చూసుకుంది. నడుము దగ్గర మడతలు, చంకలను ఆనుకుని ఉబ్బిపోయి వ్రేలాడుతున్న మాంసపు ముద్దలు, నుదుటన స్పష్టంగా కనిపిస్తున్న నాలుగు రేఖలు చూడగానే ఈర్ష్య బుసకొట్టింది.

'ఇరవై రెండు, ఇరవై నాలుగేళ్ల పిల్లతో మధ్య వయస్కురాలైన తనకి పోలికేమిటి? ఎందుకీ ఈర్ష్య?' అని మెదడు శాంతపరచ ప్రయత్నించినా, మనస్సు కుదుటపడలేదు.

'ఇప్పుడే పరిచయమైన వ్యక్తి గురించి ఇంత ఆలోచన అనవసరం' అనుకుంటూ డైనింగ్ టేబిల్ దగ్గరకి వస్తూ వినోద్, మరియాలు తుళ్లుతూ నవ్వుకోవడం చూసి భరించలేక సునంద "వినోద్ కాస్త మెల్లగా మాట్లాడు. మన మాటలు పక్కింటివాళ్లకి కూడా వినిపించేలా ఉన్నాయి" అంది.

"అంత పెద్ద శబ్దం చేస్తున్నామా? అయినా మన ఇంట్లో మనం ఇష్టం వచ్చినట్లు మాట్లాడుకోవడంలో తప్పు ఏమిటి?" అని మాటల శబ్దం తగ్గించి మరియా చెంపల దగ్గర తననోరు ఉంచి గుసగుసలాడేడు వినోద్.

ఆ ఇద్దరి మధ్యా నెలకొన్న సాన్నిహిత్యం చూసి అవాక్కయింది సునంద.

"మమ్మీ, మరియా బయోకెమిస్ట్రీ విభాగంలో డిగ్రీ పుచ్చుకోబోతుంది. ఇక్కడికి దగ్గరగా ఉన్న ఒక కంపెనీలో డేటా కావలిసి వచ్చి నాతో ఇక్కడికి వచ్చింది. 'జీన్స్' గురించి రీసెర్చ్ ప్రోజెక్ట్ ఆశించిన ఫలితాలని అందిస్తే, ఆమెకి మంచి ఉద్యోగం వస్తుంది"

ఆ మాటలు విన్న మరియా మొహం ఆనందంతో వెలగడం సునంద గమనించింది.

"మీ ఇద్దరికి ఎలా పరిచయం అయింది?" అనడిగింది సునంద ఉండబట్టలేక.

"ఒకే కేంపస్‌లో ఉన్నాం. లైబ్రరీలో, స్టార్‌బక్స్ కాఫీ షాప్‌లో ఆమె తరచూ కనిపించేది. రెండు మూడు సార్లు కేంపస్‌కి

దగ్గరగా ఉన్న ఇండియన్ రెస్టారెంట్‌లో ఆమెని చూసేక పరిచయం చేసుకున్నాం. కేంపస్‌లో ఉన్న హౌసింగ్ ఖరీదెక్కువ. కేంపస్‌కి కొంచెం దూరంగా ఉన్న ఇళ్ల అద్దె తక్కువ. కాని ఆ ఇళ్లలో ఉంటే కారు లేకపోతే ఇబ్బంది. మరియా దగ్గర కారు ఉంది. ఇద్దరమూ ఇంటి అద్దె పంచుకోవ డానికి ఇష్టపడటంతో రెండు గదులున్న ఒక ఇంటిని అద్దెకి తీసుకున్నాం. అప్పుడ ప్పుడు వంట చేసుకోవడానికి వసతి ఉంది. ఖర్చు అప్పు తక్కువయేయి" అన్నాడు వినోద్.

ఇంకేమీ ప్రశ్నలు వేయడానికి లేక, ప్లేటులో పదార్థాలు వడ్డించుకుంది సునంద. డిన్నర్ తినడం పూర్తయ్యాక వద్దన్నా వినకుండా వినోద్ సహాయం చేస్తుంటే, కడిగిన ప్లేట్లని డిష్ వాషర్‌లో ఉంచి చేతులు తుడుచుకుని సునందకి ఎదురుగుండా కూర్చుంది మరియా. ఆమె పక్క కుర్చీలో ఆసీనుడయ్యేడు వినోద్.

ముగ్గురూ కబుర్లలో పడ్డారు.

"ఉదయం తొమ్మిది గంటలకి మరియాను తను వెళ్దామనుకున్న కంపెనీ దగ్గర వదిలి నేను నా ప్రోజెక్ట్ పనిచూసుకుంటాను. అలసిపోయేను. తొందరగా పక్క ఎక్కేస్తాను" అన్నాడు వినోద్.

"నాకు కాస్త రాత పని ఉంది" అంది మరియా.

"గుడ్ నైట్" అంటూ ఇద్దరూ మేడ మెట్లు ఎక్కి తమ గదులలోనికి వెళ్లడం గమనించిన సునందకి అంతా అగమ్యగోచరంగా ఉంది. సునంద మెదడులో కలగా పులగంగా ఉద్భవిస్తున్న ప్రశ్నలలో ముఖ్యమైన ప్రశ్న "మరియా వినోద్ గర్ల్ ఫ్రెండా? లేక ఉత్తి ఫ్రెండేనా? ఫ్రెండ్ అయితే పరవాలేదు. లేకపోతే అమ్మో! ఇదేమిటి? మన భారతీయ సంప్రదాయానికి విరుద్ధంగా.. ఈ వినోద్ ధోరణి ఏమీ బాగాలేదు. స్త్రీగా ఇంకో స్త్రీ ప్రవర్తనని ఒక మోస్తరుగా అంచనా కట్టగలదు. మరియా వినోద్‌లు ఒకరివేపు ఇంకొకరు చూస్తున్న చూపులు, అయినదానికి, కానిదానికి మరియా జుత్తుని వెనక్కి తోసుకుంటూ మొహాన్ని వినోద్‌వేపు తిప్పడం, వినోద్ ఆమె చెవిలో గుసగుసలు చూస్తుంటే, 'ఇది స్నేహాన్ని అధిగమించింది. వినోద్‌ని వారించాలి. కాని ఏమని వారించడం? మరియాతో స్నేహం మరీ పెంచవద్దని చెప్పడమా? ఒకే ఇంటిలో ఉంటున్న వాళ్లిద్దరి మధ్య ఏర్పడిన బంధం వివరాలు తెలియకుండా వినోద్‌ని హెచ్చరిస్తే, అది తప్పయితే వినోద్ ఎలా స్పందిస్తాడో! తను ఇప్పుడు కల్పించుకోలేదు' అనుకుంది సునంద. అది సరే, కాని మరియా వినోద్ గర్ల్‌ఫ్రెండ్ అయితే? తనేమీ కల్పించుకోకపోతే ఇండియా నుంచి రంగనాథ్ తిరిగి వచ్చి తనని నిలదీస్తే? ఓరినాయనో! ఏమిటీ విషమ పరీక్ష? మరియా, వినోద్‌లు ఇక్కడ ఇరవై రోజులు ఉంటామన్నారు. ఫోన్‌చేసి రంగనాథ్‌కి ఈ సంగతి చెప్పాలి. కాని ఏమని చెప్పడం? వినోద్ ఎవర్తినో వెంట పెట్టుకు వచ్చేడనా? ఇరవై మూడేళ్లుగా ఇక్కడ ఉండడానికి అలవాటు పడిన తను అంత పచ్చిగా ఎలా చెప్పగలదు? మనిషి తాగుడు ప్రభావంలో ఉన్నప్పుడో, లేదా అతిగా కోపం ప్రజ్వరిల్లినప్పుడో, అంతర్లీనంగా దాగుని ఉన్న ఊహలు బయటపడతాయంటారు. తను ఇప్పుడు తాగిన మైకంలో లేదు. ఇది కోప ప్రభావమైతే ఎవరి మీద కోపం? వినోద్ మరియాలు మంచి జంటగా కనిపిస్తున్నారు. మరియా తెలుపు రంగుపిల్ల, అందుచేత ఫరవాలేదు అనుకుని తాత్కాలికంగా మనస్సుని శాంతింప చేసుకుని నిద్రమాత్ర వేసుకుని దుప్పటిలో దూరింది సునంద. అరగంట గడిచేక మెట్ల పై

భాగంలో ఒక తలుపు తెరుచుకుని తిరిగి మూసుకున్న శబ్దం వినిపించగానే ఉలిక్కి పడి లేచి కాస్సేపు ఇంకేమైనా శబ్దాలు విని పిస్తాయేమోనని చెవులని రిక్కించింది. మరో అరగంట గడిచేక 'ఛ! తను లేని పోని దాని గురించి అనవసరంగా ఏవేవో ఊహిస్తోంది' అనుకుంటూ గట్టిగా కళ్ళు మూసుకుంది సునంద.

★ ★ ★

ఉదయం తొమ్మిది - పది గంటలకి ఇంట్లోంచి బైటపడిన వినోద్ మరియాలు తిరిగి డిన్నర్ సమయానికి రావడం ఒక రొటీన్ అయింది.

వారం రోజులు గడిచాయి.

"మమ్మీ! ఈవేళ అమృత ఆంటీ మళ్లీ కనిపించేరు" అన్నాడు వినోద్ ప్లేట్‌లో చపాతీలను వేసుకుంటూ.

"ఎక్కడ? "

"కారులో వెళ్తూ ఉంటే పీట్స్ కాఫీ అండ్ బేకరీ హౌస్ కనిపిస్తే 'ఇక్కడ కాఫీ కేక్ చాలా బాగుంటుంది' అంది మరి యా. అక్కడ ఆగేం. మేం వెళ్లిన సమ యంలో కాఫీహౌస్‌లో రద్దీలేదు. ఒక మూల కూర్చుని నేను కాఫీ తాగుతుంటే మరియా కాఫీకేక్ తింటోంది. అమృత ఆంటీ ఒక అమెరికన్‌తో లోపలికి వచ్చింది. నన్ను గమనించలేదు. అమెరి కన్ ఒక ట్రేలో తినుబండారాలు, కాఫీలతో ఆమె కూర్చున్న టేబిల్ దగ్గరకి చేరి అమృత ఆంటీకి కాఫీ అందిచ్చేడు. మేము అక్కడ అరగంటసేపు ఉన్నా నన్ను వాళ్లు గమనించలేదు. వాళ్లిద్దరూ ఏదో చర్చించు కున్నట్లు అనిపించింది"

"ఒక వారం రోజుల క్రితం ఒకరితో కని పించిందన్నావు. ఈవేళ అమెరికన్‌తో కాఫీ తాగుతోందంటున్నావు. నువ్వు సరిగ్గా చూసేవా? సమ్‌థింగ్ రాంగ్ హియర్" అంది సునంద.

"అలా ఎందుకనుకోవాలి? ఆమె ఇద్దరు వ్యక్తులతో కనిపించినంత మాత్రాన దాని గురించి ప్రత్యేకంగా ఆలోచన ఎందుకు? ఏదో అవసరమై వినోద్ ఇద్దరు స్త్రీలతో కనిపిస్తే 'సమ్‌థింగ్ రాంగ్' అనుకుం టామా? " అంది మరియా మెల్లగా.

ఏదో అనబోతున్న సునంద మరియా వేపు తీక్షణంగా చూసి "వినోద్ సంగతేమో కాని ఆ ఆంటీ భర్త ఎనిమిది నెలల క్రితం చనిపోయేడు. ఆమె వయస్సు దాదాపు అరవై. ఎక్కడా ఆమె పనిచేయడం లేదు. ఆవిడ ఎవరినో ఇలా కలవడం ఎందుకో? మాదేశ సంప్రదాయంలో ఇలాంటివి జర గవు. ఒంటరి స్త్రీ ఇలా ప్రవర్తించడం సమాజం సహించదు. ఈ సంగతేమిటో ఫోన్ చేసి కనుక్కుంటాను" అంది సునంద దృఢంగా. అలా అనడంలో అమృత ప్రవర్తన సొసైటీలో ఆమోదయో గ్యకరంకాదని, వినోద్‌తో ఒంటరి మరియా ఇలా రావడం అలాంటి బాపతే అని చెప్ప కనే చెప్ప ప్రయత్నించింది సునంద.

"ఐయామ్ సారీ. ఇందాక వినోద్ వెళ్ళి ఆమెని పలకరిస్తానంటే, 'వద్దు, ఆమెని డిస్టర్బ్ చెయ్యవద్దు' అంటూ వారించేను. ఇప్పుడు మీరు 'ఫోన్ చేసి కనుక్కుంటాను' అంటున్నారు. వినోద్‌తో డిస్టర్బ్ చెయ్య వద్దు అన్నాను. ఇప్పుడు మీతోనూ అదే అంటాను" అంది మరియా.

వాతావరణం గంభీరంగా మారడంతో అందరూ మౌనంగా డిన్నర్ ముగించేరు.

★ ★ ★

'డోంట్ డిస్టర్బ్ హెర్' అన్న మరియా హెచ్చరిక జ్ఞాపకానికి వచ్చి అమృతకి ఫోన్ చేద్దామని సునంద ఫోన్ చేతిలోనికి తీసు కుని, ఆ ప్రయత్నాన్ని మూడుసార్లు వాయి దావేస్తూ ఒక రోజు గడిపింది.

'ఫోన్ చేసినంతమాత్రాన డిస్టర్బెన్స్ ఎందుకవుతుంది? అమృతతో మాట్లాడి

చాలా కాలమైంది కదా? ఒక్క నిమిషం ఫోన్ చేసి కుశలమడుగుతాను' అని మూడుసార్లు ఫోన్ చేసినా అమృత ఫోన్ ఎత్తలేదు. 'తను ఫోన్ చేసేనని, తిరిగి ఫోన్ చెయ్యమని మెసేజ్ పెట్టింది. మూడుసార్లు తను మెసేజ్ వదిలినా అమృత ఎందుకు ఫోన్ చేయలేదు? బహుశా ఊరిలో లేదేమో! ఎక్కడకి వెళ్ళి ఉంటుంది? ఎవరితో వెళ్ళి ఉంటుంది? వినోద్ చూసిన ఆ ఇద్దరి వ్యక్తులలో ఒక రితో వెళ్ళిందా? అమృత కామేశం చెట్టాప ట్టాలేసుకుని తిరిగేవారు. కామేశం చనిపో యిన ఎనిమిది నెలల్లోపులోనే అమృత ప్రవర్తన ఇంత విశృంఖలంగా మారిందే

## కొత్తగాలి...

**దేవుడు**
**మనకి చేతులిచ్చింది**
**తనకి దండం పెట్టమని కాదు**
**కష్టపడి పనిచేసుకు బతకమని!**

– బిక్కునూరి రాజేశ్వర్,
పాన్కల్

మిటి? అమృతతో మాట్లాడి వివరాలు కనుక్కుంటేకాని తన వెర్రి ఆలోచనలు ఆగవు. 'చూద్దాం! మరోసారి' అని ఫోన్ చేసి అమృత ఆన్సరింగ్ మెషీన్ మీద నాల్గవ మెసేజ్ వదిలి విసుగ్గా ఫోన్‌ని కింద ఉంచింది సునంద.

'డోంట్ డిస్టర్బ్ హెర్' అంటూ మరియా సలహా ఇచ్చింది.

అందరూ ఉచిత సలహాలు ఇచ్చేవాళ్ళే. తన ఆహ్వానం లేకుండా వినోద్‌తో కలిసి ఇలావచ్చి చాలా రోజులు ఇక్కడ ఉండడం డిస్టర్బెన్స్ కాదా? ఇంతకీ మరియా తనకి సలహా ఇవ్వడమేమిటి? ప్రతీరోజూ ఉదయం బ్రేక్‌ఫాస్ట్ చేసి రింగ్‌రంగాలా తయారయి వినోద్‌తో వెళ్తుంది. ఒక్క పెన్నీ ఖర్చు కాకుండా వినోద్ మరియాని ఆమె పనిచేసే దగ్గర వదిలి వెళ్తాడు. రోజంతా ఏమౌతుందో ఏమో కాని సాయంత్రానికి ఇంటికి వచ్చి తను చేసిన వంటకాలని లొట్టలేసుకుని తింటుంది. ఇద్దరూ తమ గదులలోనికి వెళ్తున్నట్లు కన పడుతుంది. గాఢంగా నిద్రపోయే తనకి ఇంకేమీ తెలియదు.

పదిరోజులైంది ఈ దినచర్య చూస్తూ. తను ఇంకో పది రోజులు తనని తాను నిగ్రహించుకోగలదా? హైస్కూల్ పూర్తయేవరకు ఒద్దికగా నడుచుకున్న వినోద్ ఏమిటి ఇలా తయారయేడు? ఆడ పిల్లని వెంటపెట్టుకుని వచ్చేయడమే? లేటిన్ అమెరికన్ సంస్కృతి అలవాటైన మరియాకి ఏమీ పట్టింపులు లేవేమో. ఏమీ తెలియని అమాయకునిలా పెరిగేడు వినోద్. పదేపదే జుత్తులు విరబోసి, కళ్ళని ఇటూ అటూ కదిలించి చేతులు ఊపుతూ దగ్గరగా మసలి వినోద్‌ని మరియా విహ్వాలుణ్ని చేసింది. ఓరి నాయనో, ఆ సాలెగూడు నుంచి వినోద్‌ని ఎలా బైటకి తియ్యడం? రంగనాథ్ ఉంటే 'ఏమిటి సంగతి?' అని నిలదీసేవాడు. అబ్బే! రంగనాథ్ ఒట్టి మెతకమనిషి, ఎందుకూ పనికిరాడు. పెళ్ళికి ముందర ఎలా ఉండేవాడో ఏమోకాని పెళ్ళయిన దగ్గరనుంచి తను గమనిస్తూనే ఉంది. రంగనాథ్‌ది డొల్ల వ్యవహారం. ప్రతీ దానికీ గంగిరెద్దులా తల ఊపుతాడు. తండ్రి విషయంలోనూ అంతే జరిగింది. కొంత వయస్సు వచ్చాక పెద్దవాళ్ళకు మతి స్థిమితం సరిగ్గా ఉండదు. చిన్నపిల్లల మాదిరి మారాం చేస్తారు. పిల్లలు తల్లిదం డ్రుల విషయంలో అప్పుడు సరిఅయిన నిర్ణయాలు తీసుకోవాలి. రేపు ఇండియా

నుంచి తెల్లమొహం వేసుకుని రంగనాథ్ తిరిగి వచ్చేస్తాడేమో! అక్కడచూస్తే, మావ గారి మొండితనం, ఇక్కడ చూస్తే వినోద్ వెర్రిబాగులతనం. ఈ రెండు సమస్యలనీ అనుకూలంగా పరిష్కారం చేసి నన్ను ఆదుకుంటే నడిచివచ్చి నీ దర్శనం చేసుకుంటాను వెంకన్నా! అంటూ ఒక డాలర్ బిళ్ళని రుమాలులో కట్టి దేముని గదిలో దేవుని ఎదుట ఉంచి, దండంపెట్టి తిరిగి హాల్‌లోనికి వచ్చింది సునంద.

మనస్సు కాస్త తెరపిన పడ్డట్లనిపించింది. ఇప్పుడు ఇండియాలో ఉదయం ఆరు గంటలయి ఉంటుంది. ఒక్కసారి రంగనాథ్‌కి ఫోన్ చేసి చూద్దాం అంటూ ఫోన్ అందుకుంది సునంద.

"ఇంత ఉదయమే ఫోన్ చేసేవేమిటి? ఏమైనా ప్రాబ్లెమా? " అనడిగేడు రంగనాథ్. మరియా సంగతి ఎలా ఆరంభించాలో తెలియక "మీరు వెళ్ళిన పని ఏమైంది? ఇల్లు అమ్మకం విషయమై మా కజిన్‌తో ఏమైనా మాటలు జరిగేయా? పూర్తి డబ్బు ముడితేగాని కాగితాలు అతనికి అందివ్వకండి. అందరూ చేస్తున్నట్లే టేక్స్ తగ్గించడానికి ప్రయత్నించండి. మీరు ఎప్పుడు తిరిగి వస్తున్నారు? " అంటూ సునంద ప్రశ్నల వర్షం కురిపించింది.

"ఇక్కడ పరిస్థితులు ఒక కొలిక్కి రాలేదు. అయినా ప్రయత్నిస్తాను. నేను తిరిగి రావడానికింకా పది రోజుల వ్యవధి ఉంది. టెలిఫోన్ కనెక్షన్ బాగులేదు. తీరుబడి చూసుకుని నేనే ఫోన్ చేస్తాను" అన్నాడు రంగనాథ్.

"మనం ఒత్తిడి పెట్టకపోతే ఏ సమస్యా పరిష్కారమవదు. 'తగుదునమ్మా' అంటూ చిన్న అవకాశం రాగానే పరిగెత్తేరు. నేనూ మీతో రావలసింది. ఎనీవే, కార్యం సానుకూలంగా పూర్తిచేసుకుని రండి" అంటూ ఫోన్ కింద ఉంచింది సునంద.

'పరిస్థితులు ఒక కొలిక్కి రాలేదు' అంటే ఏమై ఉంటుంది? ముసలాయన ఖరీదైన ఫ్లాట్‌లోనికయితేనే మారుతానని అంటాడా? లేక సరి అయిన బేరం కుదరక ఇల్లు అమ్మనన్నాడా? ఏదైనా అఘాయిత్యం జరిగి ముసలాడు 'హరీ' అంటే ఇల్లు అమ్మకం కష్టమవుతుంది, ఆలస్యమౌతుంది. రూపాయి ధర పడిపోతోంది. 'కనెక్షన్ బాగులేదు' అన్నాడు, లేకపోతే వినోద్, మరియా సంగతి చర్చించేదే అనుకుంటుంటే మరియా, వినోద్‌లు ఇంటిలోనికి ప్రవేశించారు.

గతుక్కుమంది సునంద. అదృష్టవశాత్తూ వినోద్, మరియాల గురించి రంగనాథ్‌కి చెప్పడం మొదలుపెట్టలేదు. మొదలుపెట్టి ఉంటే సగం సంభాషణలో వినోద్, మరియాలు వచ్చేవారు. తను అభాసుపాలయేది అనుకుంటూ "హౌ ఈజ్ యువర్ డే" అనడిగింది వినోద్‌ని.

"ఫైన్" అన్నాడు వినోద్.

"నాకు భలే ఆకలిగా ఉంది" అంటూ మరియా చేతులు కడుక్కోవడానికి వెళ్లింది.

★ ★ ★

రాత్రి పది గంటలయింది. యథాప్రకారం మరియా, వినోద్‌లు మేడమీదకి తమ గదులలోనికి వెళ్లి అరగంటయింది. సునంద హాల్‌లో కూర్చుని టెలివిజన్‌లో వస్తున్న సీరియల్ చూస్తుంటే టెలిఫోన్ మోగింది.

"హలో" అంది సునంద ఫోన్ ఎత్తి.

"నేను అమృతను మాట్లాడుతున్నాను"

"నాలుగుసార్లు మీ ఆన్సరింగ్ మెషిన్ మీద మెసేజ్ వదిలేను. మీ దగ్గరనుంచి ఫోన్ రాలేదు. ఎలా ఉన్నారు? " అంటూ బిగ్గరగా తెచ్చి పెట్టుకున్న నవ్వు నవ్వింది సునంద.

"నేను ఆన్సరింగ్ మెషిన్ చూడనే లేదు.

మీరు ఇండియా వెళ్ళేరని నాకు తెలుసు. నాకింకెవరూ ఫోన్ చేసేవాళ్లు లేరు. సారీ, అందుకే దాని గురించి పట్టించుకోలేదు"

"మీ ఇంటికి దగ్గరగా ఉన్న 'టార్గెట్' స్టోర్‌కి రావలసిన పని ఉంది. మీరు రేపు ఇంట్లోనే ఉంటారా? " అంటూ ఎప్పటిలాగే కృత్రిమమైన నవ్వు నవ్వింది సునంద.

"రేపు ఉదయం వీలవదు. పని ఉంది. మధ్యాహ్నం మూడు గంటల తరువాత రాగలరా? "

"అయితే ఎల్లుండి వస్తాను"

"మీరు టార్గెట్ స్టోర్ పని పూర్తి చేసుకురండి. లేదా ఉదయం పదకొండు గంటలకి ఇక్కడకి వస్తే లంచ్ తిన్నాక అప్పుడు టార్గెట్ స్టోర్‌కి వెళదాం"

"నేను ఎప్పుడు వస్తానో రేపు రాత్రి ఫోన్ చేసి చెబుతాను" అంది సునంద.

'రేపు మీకున్న పని ఏమిటి? ' అని సునంద అడగనందుకు ఆనందపడింది అమృత. సునంద వేసే ప్రశ్నలకి అంతు ఉండదు. గొలుసుకట్టులా ఒకదాని తరువాత ఇంకో ప్రశ్న వేస్తూనే ఉంటుంది. అబద్ధాలు చెప్పడానికి ఇష్టపడని తను రేపు వెంకట్‌ని కలవబోతున్నానని ఎలా చెప్పగలదు? ఎవరీ వెంకట్? అనడుగుతుంది సునంద. ఒంటరితనం పారద్రోలడానికి తనకి కంపెనీ ఎవరైనా ఇస్తారా? అని వ్యక్తుల కోసం వెతుకుతోందని, వెంకట్ ఆ పట్టికలో మూడవవాడని చెబితే 'హవ్వ! ఈ వయస్సులో ఈ విపరీతమైన ఆలోచన మీకు ఎలా వచ్చింది? మేము లేమా కంపెనీ ఇవ్వడానికి? ' అనొచ్చు. 'ఏ పనీ లేకపోతే ఫోన్ చేయని మీరు కంపెనీ ఇస్తానంటే నేను నమ్మగలనా? ' అని తను అడగగలదా? మీరు ఇంతవరకు ఎందర్ని కలిసేరు? వాళ్లు ఎలాంటివాళ్ళు? అంటూ ప్రశ్నలు వేసి, వ్యాఖ్యలు చేసి సునంద విసిగిస్తుంది. అది ఆమె తత్వం. ఎక్కువ వాగ్వాదంలోనికి దిగితే కోపగించుకుంటుంది. బలహీనంగా ఉన్న పురిలేని దారంలాంటి పలుచని స్నేహం పుటుక్కున తెగుతుంది. చూద్దాం! రేపు ఏమవుతుందో అనుకుంటూ పట్టికలో మూడవ వ్యక్తి వెంకట్ గురించి ఆలోచించసాగింది.

పెళ్లయి విడాకులు తీసుకున్న వెంకట్ వయస్సు కేవలం ఏభై రెండేళ్లు. అతను విడాకులు కోరేడా? లేక అతని భార్య విడాకులడిగిందా? ఏమిటో తను ఎంపిక చేసిన నలుగురిలో ముగ్గురు విడాకులు తీసుకున్నవాళ్ళే. ఛ! తను ఇండియాలో ఉంటే ఇలా ప్రవర్తించేదా? ఎవరిని కలిసినా 'అయ్యో! మీ ఆయన పోయేడా? కష్టాలన్నీ మంచి వాళ్ళకే వస్తాయి. దేముని మీద భారాన్ని ఉంచుకో. ఆయన నీకు శాంతిని ప్రసాదిస్తాడు' లాంటి సలహాలు కోకొల్లలు వస్తాయి. 'ఉచిత సలహా ఇచ్చి మనిషిలో ఉన్న కాస్త ఉత్తేజాన్ని చంపేస్తారు. తామేదో ఉత్కృష్టమైన సలహా ఇచ్చేమనుకుంటారు' అనుకుంటూ పెదవి విరిచింది అమృత.

ఆలోచన తిరిగి వెంకట్ మీదికి మళ్ళింది.

తనకంటే ఆరేడేళ్లు పెద్దదైన స్త్రీతో వెంకట్ ఎందుకు స్నేహం కలపాలనుకుంటున్నాడో? ఇది తనకు తెలిసినంతమట్టుకు కాస్త అసహజంగానే అనిపిస్తోంది. ఎందుకో తనకి వెంకట్‌తో మీటింగ్ బాగా జరుగుతుందన్న నమ్మకం కలగటంలేదు.

వెంకట్‌తో మీటింగ్ బాగా జరగకపోతే ఇహ మిగిలింది ఒకే ఒక వ్యక్తి? అదీ విఫలమైతే? తను ఏం చేస్తుంది?

తను ఎన్నుకున్న మార్గం సరి అయినదేనా? అనుకుంటూ కళ్లు మూసుకుంది అమృత.

★ ★ ★

అమృతని కలుద్దామని కారులో

ప్రయాణం చేస్తున్న సునందకి దారిలో 'స్టార్ బక్స్ కాఫీ' దుకాణం కనిపించినా 'అనవసరంగా రెండు డాలర్ల ఖర్చు ఎందుకు? అమృత మంచి ఫిల్టర్ కాఫీ ఇస్తుంది' అనుకుంటూ కారుని ఆపకుండా అమృత ఇంటివేపు మళ్ళించింది. 'నిన్న కలుద్దామంటే -పని ఉంది- అంది అమృత. ఆమెకి ఏం పనులుంటాయి? షాపుల నుంచి సామాన్లు తెచ్చుకోవడం, తినడం తప్ప ఇంకేముంటుంది? కామేశం పెన్షన్ వస్తుంది. ఇంటి మీద అప్పు ఏనాడో తీర్చేసారు. దీనికి తోడు కామే శంకి సంబంధించిన ఇన్సూరెన్స్ డబ్బు వచ్చి ఉంటుంది. ఏం పనులుంటాయి అమృతకి? ఈ మధ్య వినోద్‌కి రెండు సార్లు అపరిచిత వ్యక్తులతో కనిపించింది. అమృత ఏవేవో నీతులు వల్లించేది. నిజా నికి ఆమె ముసుగు వేసుకుని బాగా నటి స్తుందని తను అనుమానపడేది ఎప్పుడూ. అమృతని డిఫెన్సివ్‌గా ఉంచడానికి ఇన్నా ళ్ళకి తనకి ఒక అంశం దొరికింది. చూడాలి, ఏం వివరణ ఇస్తుందో' అను కుంటూ అమృత ఇంటి కాలింగ్ బెల్ నొక్కింది. ఒక నిమిషం గడిచేక, మళ్లీ బెల్ నొక్కబోతుంటే తలుపు తెరచిన అమృతని చూసి ఆశ్చర్యంతో ఒక అడుగు వెనక్కి వేసింది. చింపిరి జుత్తు, సరిగ్గా ధరించని దుస్తులు, తోటకూరకాడలా వేలాడుతున్న చేతులు, కాంతి ఇగిరించుకు పోయిన కళ్ళు, జిడ్డు మొహం చూసి "ఏమిటి ఇలా ఉన్నారు?" అంటూ లోప లికి ప్రవేశించింది సునంద.

"రాత్రంతా నిద్ర సరిగ్గా పట్టలేదు. నిద్ర మాత్ర వేసుకున్నా నిలకడగా నిద్రపోలేదు. నన్ను చూసి చాలా కాలమైంది కదూ? కాలం, పరిస్థితులు మనిషిలో మార్పు తెస్తాయి"

"మీరు చాలా దిగాలుగా కనిపిస్తు న్నారు. నాకు ఈ సంగతి తెలిసి ఉంటే నేను వచ్చేదాన్ని కాను"

అమృత జుత్తుని సరిచేసుకుంటూ పేల వంగా నవ్వి "ఎదుటి మనిషి పరిస్థితిని గ్రహించి సందర్భోచితంగా మసిలే వ్యక్తే నిజమైన స్నేహితుడు- అన్నాడు వెనకటికె వరో. నేనున్న పరిస్థితిలోంచి బైటపడడా నికి నువ్వేమీ చేయలేవు. ఫిల్టర్ వేస్తే కాఫీ

## కామన్ సెన్స్!

దాసరి చిత్రంలో విధిగా కె.వి.చలం వుండే వాడు. శివరంజని చిత్రంలో పిల్లిపాత్ర రోజురో జుకీ పెరిగిపోతోంది. తమిళ తెలుగు డైలాగు కె.వి.చలం చెబుతుంటే సెట్‌లో అందరూ నవ్వాపుకోలేక పోయేవారు. ఇది గమనించిన



దాసరి పాత్ర నిడివి పెంచారు. సెట్‌లో వర్క్ జరుగుతోంది.

కె.వి.చలం డైలాగు చెబుతున్నాడు. ఎంతకూ టేక్ ఓకే కావడం లేదు. జయసుధ మరి కొంతమంది కాంబినేషన్‌లో వర్క్ అది. దాసరి సీరియస్సయ్యారు.

"చలం! నీకెన్నిసార్లు చెప్పాలయ్యా! సెట్‌లో ఉన్నప్పుడు కెమెరా సెన్స్, మైకు సెన్సు ముఖ్య మని!" అన్నారు

"యస్సార్... అన్నారండీ!"

"మరెందుకు ఫాలో అవ్వడంలేదు?"

"కెమెరాసెన్సూ మైకుసెన్సూ వుండాలంటే వాటికి ముందు కామన్‌సెన్సు వుండాలి కద్సార్! అది నాకు లేదని మీరే అంటుంటారు సార్! అందుకని సార్!" అన్నాడు సిన్సియర్‌గా చేతులు కట్టుకొంటూ. అంత సీరియస్‌గా వున్న దాసరి ఫక్కున నవ్వేశారు.

తయారవడానికి అరగంటైనా పడుతుంది. మామూలు కాఫీ ఇచ్చేదా? " అంది.

అమృత మాటలు చెంపపెట్టులా సునందకి తగిలేయి.

"ఇండియాలో ఉన్నాను కదా, ఇక్కడ పరిస్థితుల గురించి వాకబు చేసే ఆస్కారం తక్కువయింది. ఇన్‌స్టంట్ కాఫీ కలిపి ఇవ్వండి. ఫరవాలేదు" అంది సునంద.

"ఫరవాలేదు, ఫరవాలేదు- అన్న పదాలని మీరు తరచూ ఉపయోగిస్తారు అన్నాడు జేమ్స్ నాతో" అమృత నోటి నుంచి అసంకల్పితంగా ఈ మాటలు వెలువడ్డాయి.

"ఎవరీ జేమ్స్? మీరు ఎవరితోనో కాఫీ హౌస్‌లో కనిపించేరని నాతో వినోద్ చెప్పేడు"

"కాదు, అతను తనేజా, కాదు కాదు అతను జేమ్స్"

"జేమ్స్, తనేజా... బ్లైండ్ డేట్ చేస్తున్నారా? " అనడిగింది సునంద.

అమృత వెంటనే సమాధానమీయలేదు. కిచెన్‌లోనికి వెళ్ళి రెండు కప్పుల కాఫీతో తిరిగి వచ్చి, ఒకటి సునందకి అందిచ్చి రెండవ దానితో సోఫాలో కూర్చుంది. అమృత దృష్టి సునంద వేపు ఉన్నా, ఆలోచనలు ఇంకెక్కడో పరిభ్రమిస్తున్నాయి. జరిగినదంతా చెబుదామా? వద్దా? అన్న మీమాంసలో రెండు నిమిషాలుండి కాఫీ తాగడం ముగించి అన్నీ చెబుదామన్న నిర్ణయానికి వచ్చింది.

"వినోద్‌తో ఒక చక్కని అమ్మాయి కనిపించింది. ఆ పిల్ల వినోద్‌తో చాలా క్లోజ్‌గా ప్రవర్తించింది. చాలా అన్యోన్యంగా కనిపించేరు" అంది అమృత నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ.

"అబ్బే, అలాంటిదేమీ లేదు. ఆ అమ్మాయి, వినోద్ క్లాస్‌మేట్స్. ఇక్కడ ప్రాజెక్ట్ వర్క్‌కోసం వచ్చేరు. ఇది అమెరికా కదా? " అంది సునంద.

వినోద్, మరియాల గురించి ఇలాంటి ప్రస్తావన రావడంతో సునందలో కోపం రాజుకుంటోంది.

"ఇప్పుడు దాదాపు పదకొండు గంటలవుతోంది. లంచ్ ఇంటిలో చేద్దామా? బైటికి వెళ్దామా? "

"ఇక్కడే తిందాం. లైట్‌గా చేసుకుందాం. జేమ్స్, తనేజాల గురించి వివరాలు చెప్పండి" అంది సునంద.

"రెండు నిమిషాల్లో స్నానం చేసి వస్తాను. టెలివిజన్ చూస్తూ ఉండండి" అంటూ స్నానం గదిలోనికి వెళ్లింది అమృత.

పది నిమిషాల తర్వాత జుత్తుని సవరించుకుని పిన్నులు పెట్టుకుంటూ "అర్ధాంతరంగా ఒంటరిదాన్ని అవడంతో, మా అమ్మాయి సుగుణ రమ్మంటే టెక్సాస్ వెళ్లేను. సుగుణ చదువుకి మార్కెట్‌లో గిరాకీ లేకపోవడంతో ఆదాయం సరిగ్గా లేదని దానికి కారణం నేనూ కామేశమే అని మా అల్లుడు రెండు మూడుసార్లు వాపోయాడు. దాంతో నాకు అక్కడ ఉండ మనస్కరించక తిరిగి వచ్చేసేను. అక్కడ కూతురు, అల్లుడు, మనవరాలు ఇంట్లో మసలుతుంటే ఏదోవిధంగా రోజు గడిచేది. మానసికంగా అక్కడ నేను ఒంటరితనం అనుభవించినా మనవాళ్ళ దగ్గర ఉన్నానని సరిపెట్టుకున్నాను. అయితే ఆ ఇంట్లో నేను ఒక ప్రేక్షకురాలినే. రెండు నెలలు గడిచే సరికి ఆ దినచర్య నాకు నచ్చక, కేలిఫోర్నియా తిరిగి రావాల్సి వచ్చింది. ఒక వారం రోజులు ఆ పనీ, ఈ పని కల్పించుకున్నా అవి ముగియగానే ఒంటరితనం దెయ్యంలా ప్రతీక్షణమూ నన్ను వేధిస్తుంటే ఏం చేయాలో తోచలేదు. రోజులో చాలా భాగం స్నేహితులు

వచ్చి గడపలేరు. అయినా నాకు ఇక్కడ స్నేహితులు ఎవరున్నారు? ఇది ఒక రోజు, ఒక నెల వ్యవహారం కాదుగా. ఇంటర్నెట్‌లో స్నేహం చేయడానికి సుముఖంగా ఉన్నానని ప్రకటించగానే చాలా స్పందన వచ్చింది. వారిలో నలుగురిని కలుద్దామనిపించింది. వాళ్ళలో జేమ్స్, తనేజాలు ఉన్నారు. మొదట తనేజాని కలిసేను. తనేజా వ్యవహారం నాకు నచ్చలేదు. ఆర్థికంగా చాలా పతన స్థితిలో ఉన్నాడు. వద్దనుకున్నాను. రెండవ వ్యక్తి, జేమ్స్. "అతడిలో నాకు నచ్చిన గుణాలు ఉన్నాయి కాని..."

"అతనిలో నచ్చనివి ఏమిటో!"

"అతని తొందరపాటు" అంటూ తన అనుమానాలని వ్యక్తపరచింది అమృత.

సునంద ఏమీ మాటలాడలేదు.

"నే కలిసిన మూడవవ్యక్తి వెంకట్. అతను నన్ను కలిసిన దగ్గరనుంచీ 'మీకు పెన్షన్ ఎంతవస్తుంది? మీ ఇంటి మీద బేంక్ అప్పు ఇంకా ఎంత ఉంది? మీ వయస్సు ఎంత? మీ ఇతర ఆర్థిక వ్యవహారాలేమిటి?' అంటూ ముఖ్యంగా నా డబ్బు గురించి ప్రశ్నలు వేస్తూనే ఉన్నాడు. విజయవాడ దగ్గర ఏదో 'గుంట'. ఆ ఊరునుంచి అమెరికా వచ్చేడు. అక్కడే పెళ్ళి జరిగింది. ఆమె అమెరికా వచ్చేక విడాకులు తీసుకున్నారు. బొత్తిగా జనరల్ నాలెడ్జ్ లేదు. 'ఒట్టి డబ్బు మనిషి' అని గ్రహించడానికి పది నిమిషాలు మాత్రమే పట్టింది. నేను జాగ్రత్తపడ్డాను. ఆ లిస్ట్‌లో ఇంకోవ్యక్తి మాత్రమే మిగిలి ఉన్నాడు. అతనిని త్వరలోనే కలుస్తాను. వయసుమళ్ళినవాళ్ళు, ఇండియాలో ఇంట్లో సహాయం కోసం ఎవరినైనా నియమించుకుంటే శారీరక హాని చేసి డబ్బు పట్టుకుపారిపోతారని విన్నాం. ఇక్కడ స్నేహం నటించి, నమ్మకం సంపాదించేక మీ ఎక్కౌంట్‌లో ఉన్న డబ్బు మాయం చేసి పారిపోయిన ఉదంతాలు పేపర్‌లో చదివేను" అంటూ ఆగింది అమృత.

"స్నేహం కోసం వెతుకుతున్నాను అన్నారు. స్త్రీలెవరూ స్పందించలేదా? ఎలాంటి స్నేహంకోసం చూస్తున్నారు? పెళ్లివైపు దారితీసే స్నేహమా? లేక..." అనడిగింది సునంద.

"స్టాపిట్. నేను అంతదూరం ఆలోచించలేదు. ఒంటరితనం దూరం చేయాలి అంతే. నీకు అనవసరంగా ఈ వివరాలు చెప్పేను. నా ఈ వెతుకులాటకి తృప్తికరమైన ముగింపు దొరుకుతుందా? అన్నది కాలమే చెబుతుంది"

మధ్యాహ్నం లంచ్ ముగించి రెండు

> **కొత్తగాలి...**
>
> **మద్యం మత్తు**
> **ఆపై బిర్యానీ పొత్తు**
> **ఇంకేముంది?!**
> **ఓటు చిత్తు!!**
>
> – ఎ. జనార్దనం,
> విశాఖపట్నం

గంటలకి సునంద లేచి నిలబడి "నే వెళతాను. నాల్గవ వ్యక్తితో సంభాషణ ఎలా గడిచిందో నాకు ఫోన్ చెయ్యండి. అన్వేషణ మాట ఎలాగున్నా ఎదుటి వ్యక్తిలో లోపాలు వెతకడం మొదలుపెడితే ఎవ్వరూ ఆ శల్యపరీక్షకి నిలబడలేరు. అసలింతకీ మానసికంగా ఒక అపరిచిత వ్యక్తిని జీవితంలోనికి ఆహ్వానించడానికి మీరు తయారుగా ఉన్నారా?" అంది సునంద.

అమృత ఏమీ సమాధానమీయలేదు.

★ ★ ★

అమృతని వదలి 'టార్గెట్' స్టోర్‌కి ప్రయాణం చేస్తున్న సునందలో ఉత్సాహం పుంజుకుంది. "అమృత! ఓహోహో ఎంతో ముక్తసరిగా మాట్లాడుతూ తనేదో గొప్ప దానినన్నట్లుగా ప్రవర్తించేది. 'మరియా వినోద్ గర్ల్‌ఫ్రెండా?' అని అడగకనే అడిగింది. వాళ్ళిద్దరూ మంచి యవ్వనంలో ఉన్నారు. ఏదైనా తిరుగుళ్ళు తిరుగుతారు. కాని దాదాపు అరవైఏళ్ళు దగ్గరకి వస్తున్న ఆమె ఫ్రెండో, బాయ్‌ఫ్రెండో కావాలంటు వెంపరలాడిపోతోందే. అది సాధ్యపడక నిరాశకు లోనవుతూ రుసరుస లాడుతోంది" అనుకుంటూ గరాజ్‌లో కారు ఆపి ఇంటిలోనికి ప్రవేశించింది సునంద.

'హాయ్ మమ్మీ, హాయ్ ఆంటీ' అని వినోద్, మరియాలు పలకరించేసరికి ఉలిక్కిపడింది. గరాజ్‌లో వినోద్ తీసుకెళ్ళిన కారు ఉండడం సునంద గమనించలేదు.

"మరియా ప్రోజెక్ట్ వర్క్ త్వరలో పూర్తవబోతోంది. డిన్నర్ త్వరగా ముగించి థియేటర్‌లో సినిమా చూడడానికి వెళ్దామనుకున్నాం" అన్నాడు వినోద్.

తనని కూడా సినిమాకి రమ్మంటాడేమోనని ఆశించిన సునంద అలాంటి ప్రతిపాదన ఏమీ రాకపోవడంతో రవ్వంత నిరుత్సాహపడింది.

"ఎన్ని గంటలకి మీ సినిమా?"

"సాయంత్రం ఆరుగంటలకి. అయినా అయిదుగంటలకల్లా బయల్దేరుతాం"

"అమృత ఆంటీని చూసి వస్తున్నాను. నువ్వు ఆమెని రెండుసార్లు ఎవరితోనో చూసేనన్నది నిజమే"

"అమృత ఆంటీ ఎలా ఉంది?"

"తనతో ఎవరైనా స్నేహం చేస్తారా? అని ఇంటర్‌నెట్‌లో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, నలుగురిని ఎంపికచేసి వాళ్ళని ఇంటర్వ్యూ చేస్తోంది. ఇండియన్ల పరువు పోయేలా ప్రవర్తిస్తోంది. నువ్వు చూసిన వాళ్ళు ఆమె డేట్స్" అంది సునంద వ్యంగ్యంగా.

"దాంట్లో తప్పేముంది? ఆమె వయస్సు అరవైకి తక్కువే అని మీరు చెప్పినట్టు జ్ఞాపకం. ఒక్కర్తీ నిరాసక్తంగా జీవితం గడిపేకంటే ఒకతోడు కావాలనుకుంది. కొంతమందిని డేట్ చేసేక అభిరుచులు కలిసే వ్యక్తికోసం వెతుకుతోంది. మా అమ్మ విడాకులు తీసుకున్నాక కొంతమందిని డేట్ చేసేకే ఒకరిని ఎన్నుకుంది. వాళ్ళిద్దరూ ఇప్పుడు చాలా హేపీగా ఉన్నారు" అంది మరియా.

వినోద్ మరియాని సరాసరి ఇంటికి తీసుకురావడం, గత పదిహేను రోజులుగా మరియా కయ్యానికి కాలుదువ్వడానికి తయారవడం చూసినా వినోద్‌ని కట్టడిచేయలేక పెల్లుబికే కోపాన్ని అదిమి పెట్టుకుంది. అమృత వ్యవహారంలో ఆమె ప్రవర్తనని సమర్థించేసరికి సునంద లోపల దాచుకుని ఉన్న కోపం పగ్గాలు తెంచుకుంది.

"అమెరికన్ కల్చర్ మాటేమోకాని ఇండియన్ కల్చర్‌లో ఇవి ఆమోదయోగ్యం కావు. కొన్ని రివాజులు ఉన్నాయి. ఎక్కడో తప్ప జీవితంలో ఒకేసారి పెళ్ళి చేసుకుంటారు స్త్రీలు. విశృంఖలంగా తిరగరు" అంది సునంద రోషంతో.

"కల్చర్, కల్చర్ అంటున్నారు ఇష్టంలేని వ్యక్తితో జీవితమంతా కాపురం చాలా హీనాతిహీనం. భార్యాభర్తలు ఇద్దరూ సర్దుకోవాలి. కాదనను. కాని అది వీలవనపుడు జీవితం నరకమే. కాలంతోపాటు అన్నిదేశాల రివాజులలో మార్పువచ్చింది. మనకి ఆలోచించే శక్తి ఉంది. మనం సరి అయిన మార్గంలో పయనిస్తున్నామో లేదో ఆలోచిస్తే తెలుస్తుంది. ఇంకో పదిహేనేళ్ళ జీవితం ఆమెకి ఉంది. బిక్కుబిక్కుమంటూ ఇతరుల ఇష్టాయిష్టాలతో ఆమె

జీవితం ఎందుకు వెళ్ళదీయాలి? "

"భారతీయ సంస్కృతి అయిదువేల ఏళ్ళ నాటిది. ఇండియాలో ఇలాంటి పరిస్థితి ఉద్భవిస్తే సమాజం సహాయం చేస్తుంది. ఈవిడ చేసే పనుల వలన ఇతర భారతీయుల్ని చులకనగా చూస్తారు" అంది సునంద.

"ఏ ఆధారం లేకుండా అలా ప్రవర్తించే వాళ్ళు కుసంస్కారులు. మీ ఆంక్షలవలన ఆమె జీవితం తారుమారు అవడంలేదా? ఆమె ఉంటున్నది ఇండియాలోకాదు, అమెరికాలో. ఇక్కడి వాస్తవికత గురించి చెప్పండి"

"మా సహాయం కావాలంటే ఆవిడ మా సంస్కృతి నిర్దేశించిన కొన్ని సంప్రదాయల్ని పాటించాల్సిందే."

"మీరు ఆమెకి ఏ సహాయం అందిచ్చేరు? ఏమిటి అందివ్వగలరు? ఎన్నాళ్ళు అందివ్వగలరు? ఆమె వంట వండుతుంటే పక్కన నిలబడి కబుర్లు చెప్పేవ్యక్తి కావాలి. టెలివిజన్ చూస్తూ దాని గురించి చర్చించే మనిషి కావాలి. బైట పిడుగులు పడుతుంటే ధైర్యంగా ఉండమని ఆసరా ఇచ్చే ఒక భుజం కావాలి. ఇలాంటివి ఎన్నో! ఇవన్నీ మీరు ప్రతీరోజూ చేయగలరా? ఈ దేశంలో ఇతరుల గురించి తమ కాలాన్ని పణం పెట్టడానికి మనుష్యులు లేరు. మీరు అందివ్వలేని సహాయాన్ని అందిచ్చే వ్యక్తి కోసం ఆమె వెతుకుతోంది, గ్రేట్. ఇండియాలో లభించే సహాయం అన్న కొలబద్దని ఇక్కడ వాడడంవల్ల ఆమెకి న్యాయం జరగదు. వినోద్! నేను స్నానం చేసి వస్తాను" అంటూ మేడమెట్లు ఎక్కింది మరియా. కాలికి మెడకి లంకెపెడుతూ మొండివాదనతో ఎవరినైనా గెలవగలనన్న ధీమా మరియా ముందు పటాపంచలవడంతో ఏం చేయాలో తెలియక "నాకు తలనొప్పిగా ఉంది" అంటూ బెడ్రూంలోనికి వెళ్ళి తలుపేసుకుంది సునంద.

రాబోయే నాలుగురోజులూ ఎలా గడుస్తాయో! అన్న భయం ముప్పిరికొనగా 'మరియా తొందరగావస్తే, బైటకి వెళ్ళిపోవచ్చ'ని ఆమె రాకకోసం ఎదురు చూడసాగేడు వినోద్.




రెండుసార్లు ఇ- మెయిల్‌లో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేక లిస్ట్‌లో ఉన్న నాల్గవ, ఆఖరి వ్యక్తి బిపిన్‌చంద్రని కలవనవసరం లేదనిపించింది అమృతకి. బిపిన్‌చంద్ర వయస్సు అరవైనాలుగని తెలిసినా దానికి ప్రాముఖ్యత ఇవ్వలేదు. బిపిన్‌చంద్ర ప్రకటించిన వివరాలు బట్టి, అతనికి ఆర్థిక ఇబ్బందులు ఏమీలేవని విదితమైంది. బిపిన్ చంద్రతో వచ్చిన చిక్కల్లా అతని హాబీలు. చెస్, క్రాస్‌వర్డ్ పజిల్స్ చేయడంతో కాలం గడుపుతాడని, అవంటే తనకి చాలా ఇష్టమని, ప్రయాణాలు చేయడానికి ఇష్టపడడని తెలియవచ్చింది. బిపిన్ చంద్ర ఉద్దేశ్యంలో 'తోడు'కి, తన ఊహలో ఉన్న స్నేహానికి మధ్య చాలా వ్యత్యాసముందని, అతనిని కొన్నిరోజుల తరువాత ముఖాముఖీ కలవడానికి ప్రయత్నిస్తానని అతనికి తెలియపరిచింది అమృత.

పాత తికమక ప్రశ్న మళ్ళీ మొదటికి వచ్చింది. ఇప్పుడేం చేయడం? ఈ

ప్రయత్నం విఫలమైందని వదిలేయడమా? లేక పునఃప్రారంభించడమా? తనేజా, జేమ్స్, వెంకట్‌లని జ్ఞాపకానికి తెచ్చుకుంది. తనేజా, వెంకట్‌ల గురించి ఆలోచన అనవసరం. జేమ్స్ 'అతి చొరవ' అన్నది వెనక్కి పెడితే అతనిలో ప్రస్ఫుటంగా కనిపించే లోపాలేమీలేవు. జేమ్స్ పదిరోజుల న్యూయార్క్ ట్రిప్ నుంచి తిరిగి వచ్చి ఉంటాడా? మరోసారి జేమ్స్‌ని కలిస్తే ఎలా ఉంటుంది? 'కలుద్దామా?' అని మెయిల్ పంపడానికి అమృతకి అహం అడ్డు వచ్చింది. ఆ ప్రతిపాదన జేమ్స్ దగ్గర నుంచే రావాలి, కాని అది ఎలా సాధ్యం? అని తీవ్రంగా కాస్సేపు ఆలోచించి "ఇక్కడ లైబ్రరీలో సోమర్‌సెట్ మామ్ కథల పుస్తకాలున్నాయి, వాటిలో ఏ రెండు కథలు బాగుంటాయి?" అని మెయిల్ పంపింది జేమ్స్‌కి.

రెండుగంటల తరువాత ఉత్కంఠతో కంప్యూటర్ తెరిచి చూసేసరికి

"ఏ కేషువల్ ఎఫైర్, అన్‌కాంకర్డ్- విశిష్టమైనవి" అంటూ వచ్చిన జేమ్స్ జవాబు చూడగానే కారుతాళాలు అందుకుంది. 'ఇక్కడ మామ్ కథల పుస్తకాలు ఉన్నాయి' అని, అవి ఉన్నాయో లేవో చూడకుండా మెయిల్ పంపింది. మామ్ కథల పుస్తకాలు లేకపోతే? అనుకుంటూ లైబ్రరీలో ఆ పుస్తకాలు కనిపించగానే ఊపిరి పీల్చుకుని వాటితో తిరిగి వచ్చింది. కథల పుస్తకాన్ని తెరవబోతూ "జేమ్స్ జవాబు చాలా ముక్తసరిగా ఉందే. స్నేహం అంటే ఉత్సాహం చూపించేవాళ్ళు ఇంత ముక్తసరిగా జవాబు రాయరే" అని పెదవి కొరుక్కుంది. టూకీగా తను పంపిన మెయిల్‌కి అంతకన్నా పెద్ద జవాబు ఎలా ఆశించగలం? అని సరిపెట్టుకుంది అమృత. 'ఏ కేషువల్ ఎఫైర్' కథ మొదలుపెట్టింది.



ఇద్దరు పిల్లలున్న వివాహిత, ఒక ఆఫీస్ క్లర్క్ ప్రేమలో పడుతుంది. అది తెలుసుకున్న భర్త పరువుపోతుందని విడాకులకి సమ్మతించడు. క్లర్క్‌ని కలవ వద్దంటాడు ప్రేమికుడు. ఇద్దరూ విడిపోతారు. దూర ప్రాంతాలలో ఉద్యోగం చేస్తూ కొన్నాళ్ళ తరువాత వచ్చి ఆమెని చూస్తాడు. ఆ వ్యవధిలో ఆమె పరపతి, సంఘంలో ఆమె భర్త హోదా పెరుగుతాయి. ఇతనిని పట్టించుకోదు. ఖిన్నుడై, అతని ఉత్సాహం, గాలి తీసిన బెలూన్‌లా చప్పపడి, మాదక ద్రవ్యాలకి బానిసై మరణిస్తాడు.

జేమ్స్ ఇదేదో చాలామంచి కథ అన్నాడు. ఏమిటీ దీనిలో ప్రత్యేకత? అదే ప్రశ్నవేస్తూ జేమ్స్‌కి మెయిల్ పంపింది. 'మనం ఎప్పుడైనా కలిస్తే దానిలో ఉన్న ప్రత్యేకత వివరిస్తాను' అన్న జవాబు చూసి 'హమ్మయ్య' అనుకుని నిద్రపోబోతూ 'కొంత బెట్టు ప్రదర్శించకపోతే చులకన అయిపోతాను. రేపో, ఎల్లుండో జేమ్స్‌కి మెయిల్ పంపుదాం' అనుకుంది అమృత.

'ఆ కథ గురించి మీ వివరణ వినాలని ఉంది' అంటూ మూడవరోజు మెయిల్ పంపింది.

'మధ్యాహ్నం పన్నెండు గంటలకి మీ ఇంటికి వస్తాను. ఈవేళ థాయ్‌లేండ్ భోజనం తిందాం. ఏదైనా అభ్యంతరం ఉంటే తెలియపరచండి' అన్న జేమ్స్ మెయిల్ చూడగానే ఉత్సాహం పుంజుకువచ్చి 'ఇప్పుడు పదిగంటలయింది. ఇంకా రెండు గంటల వ్యవధి ఉంది' అనుకుంటూ స్నానం గదిలోనికి ప్రవేశించింది అమృత.

ఒక అరగంటపాటు ఏ దుస్తులు ధరిస్తే బాగుంటుందో అన్నది నిర్ణయించి, లీలగా మేకప్ చేసుకుని తయారయి 'గడియారం మెల్లిగా నడుస్తోందే' అనుకుంది. జేమ్స్ ఆగమనానికి ఎదురు చూసి చూసి కాలింగ్‌బెల్ శబ్దం వినగానే తలుపు తెరచి

"హలో జేమ్స్!" అంది అమృత.

"వావ్, గుడ్‌నూన్" అంటూ అమృత కోసం కారు తలుపు తెరిచేడు. అమృత సీట్‌బెల్ట్‌రాక బెల్ట్‌ని గుంజుతుంటే అమృత శరీరానికి దగ్గరగా కదులుతూ సీట్‌బెల్ట్ లాగి అమృతకి అందిచ్చి "మంచి పరిమళాన్ని వాడేరు, ఇటీజ్ గుడ్" అంటూ కారుని రోడ్డుమీదకి మళ్ళించేడు జేమ్స్. కారు నడుపుతూ తన న్యూయార్క్ ట్రిప్ గురించి ఏదో చెబుతున్నా అవి అమృత మెదడులోనికి ఎక్కడంలేదు.

"మీరు ఏదో దీర్ఘాలోచనలో ఉన్నారు. కెన్ ఐ హెల్ప్ యు? " అనడిగేడు జేమ్స్ రెస్టారెంట్‌లో ఆసీనులయేక.

"సారీ, మన ఆలోచనలు అందరితోను పంచుకోలేం. అలా అడిగినందుకు థేంక్స్"

"నిజమే, త్వరలో మీకు నామీద అలాంటి నమ్మకం కుదురుతుందని ఆశి స్తాను" అంటూ దగ్గరగా నిలబడ్డ వెయిట ర్‌కి కావలసిన పదార్థాలకి ఆర్డరిచ్చేడు జేమ్స్.

"బాగా ఆలోచించేకే నేను ఏ పనైనా చేస్తాను. చప్పున నాకేమీ ఇష్టమవవు. జీవితమంతా ఒక ధోరణిలో, పద్ధతిలో పెరిగిన మనిషిని. మార్పుని నా మనస్సు అంత త్వరగా అంగీకరించదు" అంది అమృత ఆచితూచి పదాలని వదులుతూ.

"మీకూ నాకూ చాలా తేడా ఉంది. నేను ఆలోచించనని కాదు. కాని కేవలం ఆలోచ నల్లోనే ఉండిపోయేతత్వం కాదు. మనిద్దరి ధోరణుల మధ్య ఉన్న వ్యత్యాసం ఎక్కువే. అయినప్పటికీ ఒకరి ధోరణి ఇంకొకరికి ఇబ్బందికరంగా మారనప్పుడు, ఎదుటి వ్యక్తికి విలువ ఇవ్వ ప్రయత్నిస్తే ఏ సమస్యా ఉండదేమో" అన్నాడు జేమ్స్. చిరునవ్వు నవ్వి, పర్స్‌లోంచి రుమాలు తీసి మొహానికి పట్టబోతున్న చిరుచెమ టని సుతారంగా తుడుచుకుంది అమృత. జేమ్స్ తననే పరీక్షగా గమనిస్తున్నాడని గ్రహించి రవ్వంత తడబడుతూ రుమా లుని పర్స్‌లో కుక్కి "ది కేషువల్ ఎఫైర్ కథలో ప్రత్యేకత ఏమిటి? ఇద్దరూ ప్రేమలో పడతారు. ఇంట్లో తెలిసి గొడవ యింది. వాళ్ళిద్దరూ విడిపోయేరు. అది భరించలేక అతను వ్యసనాలకి బానిసై చనిపోతాడు" అంది అమృత.

"ఐయామ్ సారీ... మామ్ ఆ కథకి పెట్టిన పేరులోనే దానిలో ప్రత్యేకత ఉందని సూచిస్తుంది. మంచి అందం, యవ్వనంలో ఉన్న జేక్, అంతే అందంగా ఉన్న శ్రీమతి కె ప్రేమలో పడతారు. ఇంట్లో తెలుస్తుంది. 'జరిగినదేదో జరి

## కొత్తగాలి...

**వ్యవసాయం**
**ఓ మాయాజూదం**
**అడుగడునా**
**శకుని మామలే!**

– మేరెడ్డి యాదగిరిరెడ్డి,
నల్లగొండ

గింది, అతనిని కలవకు' అంటాడు సంఘంలో పరపతి ఉన్న ఆమె భర్త. అదే అమె జేక్‌కి చెబుతుంది. 'నే ఉన్న పరిస్థితి చూడు' అంటుంది దిగాలుపడుతూ. 'సరే, నేను దూరంగా వెళ్ళిపోతాను' అని అతని చేతే అనిపిస్తుంది. 'నేను నీ గురించి నిరీ క్షిస్తుంటాను, మనం మళ్ళీ ఒకటవుదాం' అన్న భావన అతనిలో కలిగిస్తుంది. 'ఆమెతో జీవితం ముమ్ముందు ఉందని, ఆమె శ్రేయస్సుకోసం, ఆమె ప్రేమకోసం త్యాగం చేసే'నని జేక్ ఉత్సాహంగా వెలిగి పోతూ కొన్నాళ్ళు గడిపి తిరిగివస్తాడు. ఆ మధ్యకాలంలో ఆమె భర్తకి హోదా, పర

పతి బాగా పెరుగుతాయి. తిరిగి వచ్చిన జేక్‌కి ఆమె ధోరణిలో మార్పు స్పష్టంగా కనిపిస్తుంది. నిర్లిప్తంగా ఆమె ప్రవర్తిం చడం బాధ కలిగిస్తుంది.

"ఈమె నన్ను ఎప్పుడూ ప్రేమించలేదు. కేవలం తాత్కాలిక వ్యామోహమే. ఈమె చాలా గొప్పదని, లేనిపోని గుణాలున్నా యని, వజ్రమని నమ్మేను. కాని అది కేవలం గాజుముక్కే. ప్రేమ ఉన్నట్లు నటించి నాచేత నే దూరంగా వెళ్ళిపోతాను అనిపించి నన్ను ఉపయోగించుకుంది అనుకుని జీవితం మీద పూర్తి విరక్తి కలిగి మరణాన్ని కౌగిలించుకుంటాడు" అంటూ జేమ్స్ లంచ్ పదార్థాలు రావడంతో ఆగేడు.

ప్లేట్‌లో కొంచెం కొంచెం పదార్థాలని వడ్డించి ప్లేట్‌ని అమృత చేతికందిస్తూ "మీకు ఏది నచ్చుతుందో నాకు తెలియక కొంచెమే వడ్డించేను. కారం సరిపోకపోతే అదిగో ఎదురుగా ఉంది వేసుకోవచ్చు" అన్నాడు జేమ్స్.

"ఆ కథ చాలా మట్టుకు ఫ్లేష్‌బేక్‌లో నడుస్తుంది. అదీకాక కొన్ని క్లిష్టమైన ఇంగ్లీషు పదాలు కొరుకుడుపడలేదు. అయినా ఇలాంటి విషాద కథలు సామా న్యమేనేమో" అంది అమృత.

"కొంత సామాన్యమే. కేవలం కేజువల్ ఎఫైర్స్ నాకు నచ్చవు. అది చెప్పడానికి ఈ కథ బాగా ఉపయోగపడుతుంది" అంటూ ఫోర్క్‌తో తిండి పదార్థాన్ని నోటిలో ఉంచు కున్నాడు జేమ్స్.

ఆ కథ వెనక ఉన్న జేమ్స్ అంతరంగం అమృతకి అర్థమయింది.

"ఇహ రెండవకథ..." అంటూ మొదలు పెట్టబోతున్న జేమ్స్‌ని వారించి "ముందు నన్ను ఆ కథ చదవనీయండి. దాని గురించి తరువాత విశ్లేషిద్దాం" అంటూ తి నడం మీద దృష్టి మరల్చింది అమృత.

"ఎనీ డిసర్ట్?" అనడిగేడు వెయిటర్.

"నో" అంది అమృత.

"నాకు మామిడిపండు అన్నం కావాలి" అన్నాడు జేమ్స్.

వెయిటర్ డిసర్ట్ తీసుకురావడానికి వెళ్ళాక "ఇందాకట నుంచి చెబుదామని అనుకుంటున్నాను. ఉత్సాహంతో మీ మొహం ఈ వేళ విప్పారింది. యు లుక్ లవ్లీ" అన్నాడు జేమ్స్ మందస్వరంతో...

"థాంక్యూ, ఇప్పుడే వస్తాను" అని జేమ్స్ చూపులని తప్పించుకోవడానికి రెస్ట్ రూమ్‌కి వెళ్ళి అయిదు నిమిషాల తరు వాత స్థిమితపడి తిరిగివచ్చి కూర్చుంది అమృత.

"ఒక్కసారి అరచెమ్మా రుచి చూసేరంటే దీనిని వదలరు" అంటూ అరచెమ్మా డిస ర్టని అమృత నోటిలో ఉంచేడు జేమ్స్.

డిసర్ట్ చప్పరించి అడ్డంగా తల ఊపుతూ "ఇండియాలో, మా రాష్ట్రంలో పండినన్ని మామిడి పళ్ళు ఇంకెక్కడా పండవు. బాగానే ఉంది. కాని అంత గొప్పగా ఏమీలేదు" అంది అమృత జేమ్స్ అభిరుచిని మెచ్చుకోవడానికి ఇష్టపడక.

"బలవంతంగా మీచేత తినిపించేనని ఆ నిరసన. దాని గురించి నేను పట్టించు కోను. మామిడిపళ్ళు తినడానికి మీ రాష్ట్రా నికి ఎప్పుడు వెళదాం?" అంటూ మంద హాసం చేసేడు జేమ్స్.

అమృత ఏమీ సమాధానమీయలేదు. అమృత తనే బిల్ ఇస్తానన్నా, బిల్‌ని సగం సగం పంచుకుందామన్నా జేమ్స్ ఒప్పుకోలేదు. వెయిటర్‌కి టిప్ ఇచ్చేక "కమోటి హిల్‌కి వెళదామా? అయితే చిన్న జల్లు అక్కడ కురవవచ్చని న్యూస్‌లో చెప్పారు" అంటూ కారు వేపు నడిచేడు జేమ్స్.

"ఈ వేళ ఆహ్లాదంగా గడిచింది, థాంక్స్" అంది అమృత, జేమ్స్ ఇంటిదగ్గర

వదిలినపుడు. స్నేహపూర్వకంగా తన బుగ్గను అమృత బుగ్గకి ఆనించినపుడు జేమ్స్‌ని వారించకుండా మెల్లిగా లోపలికి నడిచింది అమృత.




మరియాని ఎయిర్‌పోర్ట్ దగ్గర వదిలి గరాజ్‌లో కారు పార్క్ చేసి లోపలికి వచ్చి సునందకి ఎదురుగా ఆసీనుడయేడు వినోద్.

"మమ్మీ, రేపు సాయంకాలం నా ఫ్లైట్, ప్రాజెక్ట్ పుణ్యమా అని ఏకబిగిన నీ చేతి వంట ఇరవై రోజులు తిన్నాను. మరియా నీకు ప్రత్యేకంగా కృతజ్ఞతలు చెప్పమంది. ఒకసారి ఫోన్ చేసి నీకు కృతజ్ఞతలు చెపుతానంది. ఈ వేళ ఉదయం నీకు ముఖస్థంగా చెప్పేదేకాని ఆ సమయానికి ఇంట్లో లేవు. ఒక తెలియని వ్యక్తిని, అందులో ఒక ఆడపిల్లని వెంట పెట్టుకురావడం నీకు ఇష్టం ఉండదని తెలుసు. కాని మరియా నాకు మంచి స్నేహితురాలు. ఒకే ఇంటిలో ఉంటున్నాం. ఆమె ఇక్కడకి ప్రాజెక్ట్ వర్క్‌కి వస్తుంటే మేడమీద రెండు గదులు ఖాళీగా ఉన్నాయని తెలిసి కూడా ఆమెని ఎక్కడికో వెళ్ళి ఉండమనడం ఏమిటి? అని ఆహ్వానించి ఇక్కడకి తీసుకువచ్చేను. మరియా నా పక్కని ఉంటే నాలో ఎక్కడలేని ఉత్సాహం వస్తుంది. ఆమె నన్ను స్వీకరించాలని, అప్పుడిగా అంగీకరించాలని వాంఛిస్తాను. ఐ లైక్ హెర్ వెరీమచ్" అన్నాడు వినోద్.

వినోద్ తనతో ఇలాంటి సంభాషణ చేస్తాడని ఊహించని సునంద ఆశ్చర్యంతో "మరియా కూడా నువ్వంటే ఆవిధంగా ఇష్టపడుతోందా? ఆ విషయం నీకేమైనా తెలుసునా? మీ ఇద్దరి మధ్యా అలాంటి పరిచయాన్ని ఆమె కుటుంబీకులు అంగీకరిస్తారా? " అనడిగింది సునంద.

"ఇప్పటి వరకు అలాగే కనిపిస్తోంది. మా కేంపస్‌లో ఇరవై వేల మంది స్టూడెంట్స్ చదువుకుంటున్నారు. కేంపస్‌లో ఉన్న వ్యక్తుల మధ్య పరిచయాలు సులభంగా పెరిగే అవకాశం ఉంది. క్లాసులలో కలిసినపుడు, కాఫీ హౌస్‌లో కాఫీ తాగేటప్పుడో, బాస్కెట్‌బాల్, బేస్‌బాల్ మేచ్‌లు చూడడానికి వెళ్ళినప్పుడో అయిన పరిచయాలు త్వరితంగా పెరుగుతాయి. ఒకరి గురించి ఇంకొకరు తెలుసుకునే మార్గం ఉంది. ఏ ఇద్దరి వ్యక్తుల అభిరుచులు, ఇష్టాయిష్టాలు నూటికి నూరుపాళ్ళూ కలవవు. ఇప్పుడు నాతో సఖ్యంగా, జోడుగా ఉన్న మరియాకి, నాకన్నా ఇంకా ఎక్కువ మంచి అభిరుచులు కలిగిన వ్యక్తి తారసపడవచ్చు. మా ఇద్దరి కాలేజీ చదువు పూర్తవబోతోంది. ఇద్దరికీ ఎక్కడ ఎలాంటి ఉద్యోగాలు దొరుకుతాయో! ఎవ్వరూ ఎప్పుడు ఊహించలేం. నాకు న్యూయార్క్‌లో ఉద్యోగం వచ్చి మరియాకి కేలిఫోర్నియా రాష్ట్రంలో ఉద్యోగం వస్తే ఏమౌతుంది? అన్ని వేల మైళ్ళ దూరాన్ని అధిగమించే బంధం మా ఇద్దరి మధ్యా ఉందా? అలాంటి సమస్యలు ఉత్పన్నమయే ఆస్కారం ఉందని తెలిసికూడా స్నేహాన్ని ఇంకో దశకి తీసుకెళ్ళడం మా ఇద్దరికీ మంచి చేయదు. అది నాకు తెలుసు. బహుశా మరియాకి కూడ తెలిసే ఉంటుంది. రాబోయే మూడు నాలుగు

నెలలలో ఈ ప్రశ్నలకి కొన్ని సమాధానాలు లభిస్తాయి. ఇద్దరికీ ఒకేచోట ఉద్యోగం వస్తే బాగుండును" అన్నాడు వినోద్.

సునందకి ఏం మాట్లాడాలో తెలియడం లేదు. ఈ ఆడ-మగ అదుపూ ఆజ్ఞలేని స్నేహం సునందని కలవరపరుస్తోంది. వినోద్, మరియాల మధ్య స్నేహాన్ని తను కట్టడి చేయలేదు. వినోద్ మాటలు వింటుంటే ఆ బంధం ఇంకా పటిష్టమయేలా ఉంది.

"మీ డేడీ నాలుగు రోజులలో వస్తున్నారు. నీ ప్రయాణాన్ని వాయిదా వేసుకోకూడదూ? ప్రతి వేసవి సెలవులకి చిత్ర ఇంటికి వచ్చేది. ఈ సంవత్సరం స్నేహితురాళ్ళతో యూరప్ చూడడానికి వెళ్తోంది. నీ ధోరణి ఇలా ఉంది. దాని పరిస్థితి ఏమిటో! ఇదొక దిక్కుమాలిన దేశం. 'ఫ్రీడమ్! ఫ్రీడమ్' అంటూ తెగ అరుస్తారు. తగలపడిపోవడానికి తప్ప ఎందుకీ విశృంఖలమైన ఫ్రీడమ్? ఆ ఫ్రీడమ్ పేరిట తమనితామే ఆహుతి చేసుకుంటున్నారు" అంటూ సునంద తలపట్టుకుంది.

"మమ్మీ నీకు తెలిసే ఉంటుంది. చిత్ర, చిత్ర స్నేహితురాలు, ఇంకో ఇద్దరు విద్యార్థులు కలిసి నాలుగు గదులున్న ఇంటిని అద్దెకి తీసుకుని, ఖర్చు తగ్గించుకుంటూ ఉంటున్నారు. చిత్ర, ఆ ఇంటిలో ఉన్న ఇంకో కుర్రాడు యూరప్ చూడడానికి వెళ్తున్నారు. ఈ దేశంలో అన్నిటికన్నా ముఖ్యంగా వాంఛించేది 'ఫ్రీడమ్'. అది లేకపోతే ఇంకేమీలేదు. అయితే ఈ 'ఫ్రీడమ్స్' సరిగ్గా ఉపయోగించుకోవడంలోనే ఉంది విజ్ఞత. 'నా ఇష్టం వచ్చినట్లు నే చేస్తాను, లేకపోతే అది నాఫ్రీడమ్ మీద ఆంక్ష' అని నిప్పులో చెయ్యి పెడితే కాలక మానదు. దానిని దుర్వినియోగం చేసుకోకుండా సదుపయోగం చేసుకోవడం మన చేతుల్లోనే ఉంది. డేడీ ఇండియా నుంచి వచ్చేంత వరకు నేను ఇక్కడ ఉండడం వీలవదు. విమాన ప్రయాణానికి నే కొను

## వెధవ్వేషాలు వేస్తే?

ప్రసాద్ లాబ్‌లో 'డాక్టరుబాబు' చిత్రం డబ్బింగు జరుగుతోంది. గ్యాప్ సమయంలో రికార్డింగ్ థియేటరు బయట కూర్చొని పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ ఉండేవారు. జయలలిత ఎప్పుడూ సీరియస్‌గా ఏదో ఒక ఇంగ్లీష్



నవల చదువుతూ వుండేది. మరోవైపు శోభన్ బాబు కె.వి.చలం మాటల్ని ఎంజాయ్ చేస్తున్నారు.

"జయా! చలాన్ని గమనిస్తున్నావా? ఈ మధ్య హీరో వేషాల కోసం ఉబలాటపడుతున్నాడు" అన్నారు శోభన్ చిరునవ్వుతో.

జయలలిత ఒకసారి చలాన్ని చూసి "వెయ్యనివ్వండి. ఆయనకేం?" అంది మళ్లీ నవల్లోకి చూపు మరలుస్తూ.

"చూశావా! జయ కూడా చెప్పింది. నువ్వు ట్రై చేయొచ్చు" అన్నాడు శోభన్.

"బాబూ! మీకు కోపం వస్తే ఒంటిమీద ఎక్కడైనా కొట్టండి. ఇక్కడ తప్ప..." అంటూ పొట్టని చూపించాడు.

"అదేంటీ.. నువ్వు హీరోగా బాగానే వుంటావు కదా!" అన్నాడు శోభన్.

"బాబూ! ఆ మాట మీరనటమే పెద్దజోకు! హీరో వేషాల మాట దేవుడెరుగు! వెధవ్వేషాలు వెయ్యకుండా వుంటే చాలు!" అన్నాడు కె.వి.చలం సిన్సియర్‌గా.

క్కున్న టిక్కెట్, ప్రయాణం తేదీ మార్పుకి అనుమతించదు. ఒక చిన్నపని ఉంది. ఇప్పుడే వస్తాను" అంటూ వినోద్ కారు తాళాలు అందుకున్నాడు.

ఒక గంట గడిచినా వినోద్ జాడలేదు. 'ఇప్పుడే వస్తా'నని వెళ్ళిన వినోద్ ఇంకా రాలేదేం? వాడికి ఏమీ అవలేదు కదా? అనుకుంటూ ఆలోచనలో పడింది సునంద.

ఇరవై నాలుగేళ్ళ వినోద్, ఇరవై రెండేళ్ళ చిత్ర అమెరికాలో పుట్టి, పెరిగి అమెరికన్ పద్ధతులని ఆకళింపు చేసుకున్నవాళ్ళే. వాళ్ళు పుట్టాక, గత ఇరవై నాలుగేళ్ళ కాలంలో కేవలం నాలుగైదు సార్లు మాత్రం ఇండియా చుట్టపుచూపు కింద వెళ్ళి తిరిగి రావడంతో ఇండియాలో పాటించే పద్ధతులు, ప్రాముఖ్యత ఇచ్చే విలువల గురించి వాళ్ళకి చెప్పే అవకాశం రాలేదు. "తెలుగు మాటలాడడం తప్ప, మాకు రాయడం రాదు. తెలుగు ఫంక్షన్స్‌కి వెళ్తే మేము తెల్లమొహం వేసి ఉక్కిరిబిక్కిరి అవుతాము" అంటూ తెలుగు ఫంక్షన్స్‌కి వెళదామంటే విముఖత చూపించేవారు వినోద్, చిత్రలు. ఎప్పుడైనా ఇండియాలో ఉన్న బంధువుల గురించి, అక్కడ అలవాట్ల గురించి చెప్పబోతే "మమ్మీ, మేం ఇక్కడ పుట్టి పెరిగేం. ఇక్కడే ఉండిపోయేవాళ్ళం. మాకు అక్కడ వేళ్ళు లేవు. నువ్వు అక్కడ నెలకొని ఉన్న పద్ధతుల గురించి చెబితే మాకు సరిగ్గా అర్థమవదు. అలాంటప్పుడు మేము వాటిని ఎలా పాటించగలం? నువ్వు అనవసరంగా హైరానపడి కాలాన్ని వృథా చేసుకుంటున్నావు" అనే పెరుగుతున్న వినోద్, చిత్రలని చూసి ఒక్కక్షణం 'తరచూ వీళ్ళని ఇండియా తీసుకెళ్ళాలి. అక్కడ ఉన్న మంచి చూపించాలి' అనిపించినా, 'నలుగురూ ఒకసారి ఇండియా వెళ్ళి రావడానికి కనీసం పది వేల డాలర్లు కావాలి, ఏదీ ఆ డబ్బు?' అనుకుని అది అమలుపరచలేకపోయేరు తను, రంగనాథ్. 'మొక్కై వంగనిది మ్రానై ఒంగుతుందా?' అన్న నానుడిలా వినోద్, చిత్రలు స్థానిక వాస్తవికత విలువల వేపు వంగేరు. వినోద్ గడుపుతున్న కాలేజీ జీవితం లాగే చిత్ర జీవితం పరిగెడుతోందా? ఆమెకి ఒక బాయ్‌ఫ్రెండ్ ఉన్నాడా? రేపోమాపో 'ఇతను నా బాయ్‌ఫ్రెండ్' అంటూ చిత్ర ఎవరినో తీసుకు వచ్చి పరిచయం చేస్తుందా? అది జరిగితే తను సహించగలదా? సహించక తనేం చేయగలదు? చిత్ర కాళ్ళు చేతులు కట్టి ఇంటిలో బంధించలేదు కదా? 'నీ చదువుకి ఆర్థిక సహాయం చేయం' అంటూ బ్లేక్‌మెయిల్ చేయలేరు. దానికి కారణం చిత్ర తన చదువుకి లోన్లు తీసుకుంటూ అదే ఖర్చు పెట్టుకుంటోంది. లాభం లేదు, చిత్రని కూడా కట్టడిచేసే ఆయుధం తన దగ్గర లేదు. ఒంటరిగా ఉన్న తనని ఈ ఆలోచనలు తెగ వేధిస్తున్నాయి. ఎదురుగా రంగనాథ్ ఉంటే ఈ విషయాలు పట్టించుకోవడం లేదని అతనిని దుయ్యపట్టేది. కాని ఏడీ రంగనాథ్? అనుకుంటుంటే టెలిఫోన్ మోగింది.

ఆతృతగా టెలిఫోన్ రిసీవర్‌ని అందుకుంది సునంద.

"అమృతని మాటలాడుతున్నాను. అనుకోకుండా మళ్ళీ జేమ్స్‌తో పరిచయం పెరిగింది. నిన్న అతనితో బైటకి వెళ్లేను. రోజంతా బాగా గడిచింది. అతను చేయి చాపి స్నేహాన్ని పెంపొందించడానికి సిద్ధంగా ఉన్నాడు. నాకూ అతని కంపెనీ ఆసక్తికరంగా ఉంది. జేమ్స్ రేపు శాండియాగో నగరానికి కారులో వెళుతున్నాడు. నన్ను 'నాతో వస్తారా?' అనడిగేడు. వెళ్ళడానికి నిశ్చయించుకున్నాను. శాండియాగోలో నా క్లాస్‌మేట్ సరిత ఉంది. ఆమెని

కలుస్తాను. నేను తిరిగి రావడం, ముఖ్యంగా జేమ్స్ ప్రోగ్రాం మీద ఆధార పడి ఉంటుంది" అంటూ అమృత ఏదో ఇంకా చెబుతుంటే వినిపించుకోకుండా విసుగ్గా ఫోన్‌ని కింద ఉంచింది సునంద.

'ఇప్పుడే వస్తా'నని రెండు గంటల క్రితం బైటకి వెళ్ళిన వినోద్ ఇంకా రాలేదే- అను కుంటూ రోడ్డు వేపు దృష్టి సారించింది సునంద.

వినోద్‌ని తను చాలా గారాబంగా పెంచింది. ఎంత ఇబ్బందికరమైనా అన్నీ వాడికి నచ్చేలా చేసింది. ఎవరైనా ఏమైనా వినోద్ గురించి వ్యాఖ్యానించినా, చెత్తవా గినా తను విరుచుకుపడేది. అలా తను పెంచిన వినోద్ నాలుగు రోజుల క్రితం తనకి మరియాకి మధ్య వాగ్వాదం రగిలితే ఏమీ మాటలాడకుండా ఉండిపోయేడు. తనని ఏ మాత్రం సమర్థించలేదు. సరి కదా మరియాని ఎయిర్‌పోర్ట్‌లో వదిలి వచ్చేక ఆమె కనుసన్నలలో ఉండడానికి తనెంత వాంఛిస్తున్నాడో స్పష్టంగా, బాహా టంగా వ్యక్తపరిచేడు. అనుమానం లేదు, వినోద్ ఆమె పక్షమే. వినోద్ మీద కొండంత ఆశలు పెట్టుకున్న తనకి అది శరాఘాతమే. ఇహ చిత్ర! అదెప్పుడూ తను ఎడ్డెం అంటే తెడ్డెం అనేది. తన మాటే ఖాతరు చేసేదికాదు. మొండిమ నిషి. ఏమిటో ఈ పిల్లలు? తన ఊహల ప్రపంచం ఛిన్నాభిన్నమయేటట్లుంది. తను ఒంటరిదాన్ని అయేటట్టున్నాను, అనుకుం టుంటే ఆలోచనలోనికి అమృత వచ్చింది. 'అమృత ధైర్యవంతురాలే! రెండు మూడు సార్లు పరిచయమయిన జేమ్స్‌తో ట్రిప్‌కి వెళ్తోంది' అని ఒక్క క్షణం అనిపించినా 'ఆ! నా బొంద ధైర్యం! ముందూ, వెనకా ఆలోచించకుండా అలా విచ్చలవిడిగా బరి తెగించి వెళ్ళడమేమిటీ?' అనుకుంది. అం తలో "సారీ మమ్మీ! ఆలస్యమయింది. మరియా ప్రాజెక్ట్‌కి సంబంధించిన ఒక డాక్యుమెంట్ తీసుకురావడానికి వెళ్ళడంతో ఆలస్యమయింది" అంటూ వినోద్ సోఫాలో సునందకి ఎదురుగా చతికిలప డ్డాడు. కొడుకుని చూసిన సునందలో అల జడి తగ్గినా మరియా గురించి పరిగెత్తేడని చెబుతుంటే మనస్సు కుదుటపడడానికి చాలా సమయం తీసుకుంది.

★ ★ ★

వినోద్‌ని ఎయిర్ పోర్ట్‌లో వదిలి వచ్చి, స్నానం చేసి టెలివిజన్ ముందర కూర్చుంది సునంద. వారంలో రికార్డయిన పాతప్రోగ్రాంలు చూస్తూంటే అమెరికాలో నెలకొన్న నిజజీవితానికి ఈ ప్రోగ్రాంలలో చూపించే సన్నివేశాలకీ ఎంత తేడా! అని

## కొత్తగాలి...



ఎమ్మెస్ - వరవీణా మృదుపాణి
చిట్టిబాబు - వైణిక శిఖామణి
పినాక - కర్ణాటక సంగీతవాణి
ద్వారం - వాయులీన విద్వన్మణి

- ఎం.కె. మూర్తి,
సూర్యాపేట

వాటిని గమనిస్తుంటే 'అంత డబ్బు ఉంటే బాగుండును' అని సదా అనుకునే సునందకి ఈ వేళ ఎందుకో టీవీలో ఆ పె రాలను చూస్తుంటే చిరాకువేసింది.

"ఛ! వీళ్ళూ, వీళ్ల రహస్య ప్రేమ కలా పాలూ, థూ! అన్నీ కల్పితాలే" అని చీత్క రిస్తూ టెలివిజన్ కట్టేసింది సునంద. మరు నిమిషంలో 'ఇప్పుడేం చేయడం?' అన్న ప్రశ్న ముందరనిలిచి, ఆషాఢ మాసంలో మామిడి పళ్ళమీద వాలి ఎంత విదిలించినా పారిపోని ఈగలా, అదే ప్రశ్న తిరిగి తిరిగి మీద పడుతోంది.

సాధారణంగా అందరూ ఆలోచించేలాగే 'ఇంటిని శుభ్రపరుద్దామా?', 'లాన్‌కి నీళ్ళు పెడదామా?' లాంటి పనులు చాలా మదిలో మెదిలినా 'అబ్బా! అవన్నీ ఎవడు చేస్తాడు?' అనుకుని సోఫాలో కాళ్ళు చాపు కుంది సునంద. శారీరక చురుకుతనం తగ్గడంతో సునంద మెదడు విజృంభిం చింది.

రంగనాథ్ ఇండియా నుంచి తిరిగి రావ డానికి ఇంకా నాలుగు రోజుల వ్యవధి ఉంది. ఈ నాలుగు రోజులు ఎలా గడు స్తాయి? గత ఇరవై రోజులు వినోద్ మరి యాలు ఉండడం వలన కలివిడిగా రోజులు చురుకుగా వెళ్ళేయి. రోజులో వాళ్ళని మహా అయితే మూడు నాలుగు గంటలు చూసేదేమో. అయితేనేం, సాయంకాలమయేసరికి వాళ్ళతో డిన్నర్‌కి సిద్ధపడేది. పగలు వాళ్ళకోసం వంటలు, చిరుతిండ్లు తయారు చేయడంలో కొంత సమయం గడిచేది. వినోద్, మరియాల అన్యోన్య పరాచికాలు తనకి ఇబ్బందికరంగా ఉన్నా, విచిత్రంగా కనిపిం చేది. తనూ, రంగనాథ్ ఎప్పుడూ, ఒంట రిగా ఉన్నప్పుడు కూడా అలా చిలిపిగా ఒక్కసారీ ప్రవర్తించలేదు. రంగనాథ్ మంచి తండ్రి, కాని రొమేంటిక్ మనిషి కాదు. వినోద్, మరియాల సంఘీభావం గమనిస్తే, తను జీవితంలో ఆస్వాదించత గిన చాలా మధురక్షణాలు కోల్పోయేననిపి స్తోంది. ఇరవై ఐదేళ్ళ వైవాహిక జీవ నంలో తను వెనక్కి తిరిగి చూస్తే ఆన ందించదగ్గ సన్నివేశాలు ఏమీ గుర్తుకురా వడం లేదు. ఇంటికి కావలసిన డాలర్లు సమకూర్చడం సరే. అయితే మానసికంగా స్పందించకుండా రాత్రయేసరికి ఇద్దరూ కేవలం వేడి చల్లార్చుకోవడమేనా సహజీవ నమంటే?

ఏమిటో ఈ మగాళ్ళు! రంగనాథ్ బేంక్‌లో పనిచేస్తాడు. ఖాతాదారులతో మృదుమధురంగా మాటలాడుతాడు. ఆఖ రికి రోజ్‌తో కూడా. మరి తనతో అలా ఉండడేం? ఇంటిలో పడివుండే భార్య అంటే చులకనా? రోజ్ ఎప్పుడూ రంగనా థ్‌ని తెగ పొగిడేది. ఏముంది రంగనా థ్‌లో అంత పొగడడానికి? తనకి బాగా జ్ఞాపకం, తమ ఐదవ పెళ్ళి వార్షికోత్సవం నాడు పూలు కూడా పట్టుకురాలేదు. రంగ నాథ్‌తో తను జీవితంలో ఏం పంచు కుంది? నా బొంద! ఛ! గుర్తించకుండా తను జీవితం అంతా ఒంటరిగా నెట్టుకు వచ్చింది. ఒక జంతువుని పెంచినా ఇంటిలో నిశ్శబ్దం మాయమవుతుంది. ఇంటిలో ఇంకో మనిషి మసిలినంత మాత్రాన ఒంటరితనం పటాపంచలవదు. రంగనాథ్ ఇండియా నుంచి తిరిగిరావడా నికి ఇంకా నాలుగు రోజులుంది. నాలుగు రోజులు ఒంటరిగా సతమతమౌతూ గడ పాలి.

సునంద ఆలోచనలు మళ్ళీ జేమ్స్, అమృతల మీదకి మళ్ళేయి. 'అమృత దగ్గర నుంచి ఫోన్ రాలేదే' అనుకుం టుంటే టెలిఫోన్ మ్రోగింది.

"నేను శాండియాగోలో నా క్లాస్‌మేట్ సరిత ఇంటినుంచి మాట్లాడుతున్నాను. జేమ్స్ నన్ను ఇప్పుడే ఇక్కడ దిగవిడిచి వెళ్ళేడు. రెండు రోజులు చాలా ఆహ్లా దంగా గడిచేయి. రేపు ఇక్కడ గడిపేక ఇంటికి రావడమో, ఇంకెక్కడికైనా వెళ్ళ డమో జేమ్స్‌తో చర్చించేకే తెలుస్తుంది. ఇద్దరమూ కలిసి ఒక నిర్ణయానికి వస్తాం. నువ్వు ఎప్పుడైనా మొలకెత్తుతున్న చింత పిక్కని చూసేవా? గాఢమైన బ్రౌన్ రంగుని వదిలేస్తూ, మెల్లగా, ఉద్భవిస్తున్న అందమైన మొలకలా కొత్త తళతళలతో ఈ రెండు రోజులు గడిచేయి. జేమ్స్‌తో స్నేహం, అతని కంపెనీ నేవళంగా వికసి

స్తోంది. ఇదొక కొత్తరకమైన అనుభూతి. అదిగో! సరిత పిలుస్తోంది. నేను నీకు మన ఊరు వచ్చేక ఫోన్ చేస్తాను" అంటూ సునంద వేసే ప్రశ్నలకి తావివ్వ కుండా సంభాషణని ముగించింది అమృత.

సాయంకాలం ఎనిమిది గంటలయింది. ఇల్లంతా నిశ్శబ్దం! చూడడానికి ఇష్టపడక టెలివిజన్ కట్టేసింది. యూరప్‌లో ఉన్న చిత్రతో మాట్లాడదామన్నా వీలవదు. వినోద్ తన ఊరు చేరగానే మరియా కోసం పరిగెత్తి ఉంటాడు. వాడి వ్యామోహం వాడిది. రంగనాథ్‌కి ఫోన్ చేసి ఇల్లు అమ్మకంలో పురోగమన విషయం అడగవచ్చు. కాని ఇప్పుడు రంగ నాథ్ ఆఫీసుకి వెళ్ళే హడావుడిలో ఉంటాడు. అదీ కాక ఈ మధ్య ఇంటి విష యంలో అతనిని అదిలించబోతే దురు సుగా మాటాలాడేడు. మరోసారి హెచ్చరిం చడం వలన అతనిని అనవసరంగా పొడి చినట్లే అవుతుంది. కానీ ఇంకేమీ ఫలితం ఉండకపోవచ్చు. ఇప్పుడేం చేయడం? ఏదైనా పుస్తకం తీసి చదువుదామా? అను కుంటుంటే ఇప్పుడు ఉపయోగిస్తున్న చత్వా రపు కళ్ళజోడుకి పవర్ తగ్గడంతో అక్ష రాలు అన్నీ అలికినట్లు కనిపిస్తాయి అన్నది జ్ఞాపకానికి వచ్చింది. దానికితోడు రెండు పేజీలు చదివేసరికి వాటిలో ఉన్న కొరుకుడు పడని ఇంగ్లీష పదాలు తనకి విసుగుని కలిగిస్తాయి. లాభంలేదు. పుస్తకం చదవడం, అవుటాఫ్ క్వశ్చన్! వినోద్ ఇల్లు చేరేడోలేదో ఒక్క నిమిషం ఫోన్‌లో వాకబు చేద్దాం అనుకుని ఫోన్ అందుకుని వినోద్ నెంబర్ డయల్ చేసింది. నెంబర్ బిజీ! నెంబర్ బిజీ! అంటూ నాలుగు సార్లు వచ్చేసరికి హతా శురాలై రిసీవర్‌ని విసురుగా క్రెడిల్ మీద ఉంచింది సునంద.

అతలాకుతలమైన మనస్సుని సంబాళిం

## వింత క్షమాపణలు




తప్పు చేస్తే అపాలజీ చెప్పడం మర్యాద. కొంతమంది క్షమాపణ చెప్పడంలో విచిత్ర పోకడలకి పోతుంటారు. దాంతో అసలుకే మోసం వస్తుంటుంది కూడా. పెన్సిల్వేనియాలో షిల్డన్ అనే ఊరికి చెందిన




జార్జి రెనాల్డ్స్, ఓవెన్ మీద పెద్దక్షరాలలో తన భార్యకి అపాలజీని ఇలా పెయింట్ చేసి ఇంటి బయట నిలిపాడు- 'లిండా! ఐయాం సారీ! మన పక్కింటి మార్గరెట్‌తో నాకు అక్రమ సంబంధం ఉన్నమాట వాస్తవమే. నేను ఫూల్‌ని, స్టుపిడ్‌ని, ఇడియట్‌ని. ఇంకెప్పుడూ ఇలాంటి తప్పు చేయను. నన్ను క్షమించు'

అమెరికన్ కమెడియన్, నటుడు జెఫ్ రేక్సిడేల్ తన గర్ల్‌ఫ్రెండ్ మీగన్‌కి తన మెళ్లో పెద్దబోర్డు వేలాడేసుకుని అపాలజీని రాసి న్యూయార్క్‌లోని మెడిసన్ స్క్వేర్ పార్క్ దగ్గర నిలబడి తెలియజేశాడు. ఏప్రిల్ 23, 2010న ఆ బోర్డ్ మీద ఇలా రాశాడు- 'నీకిచ్చిన వాగ్దానాన్ని నిలుపుకోలేక తప్పు చేశాను. ఐయాం సారీ మీగన్'.

ఓ దినపత్రికలో ఒక డ్రైవర్, తోటి డ్రైవర్‌కి అపాలజీని ప్రకటించాడు- '13, బెల్‌మాంట్ వద్ద, గురువారం 20వ తేదీ, ఫోర్‌వే స్టాప్ దగ్గర హారన్ కొట్టి తప్పు చేసిన డ్రైవర్‌ని నేను. మీరు రైట్, సారీ'

ఓ భర్త తన భార్యతో పోట్లాడితే ఆమె అతన్ని ఐదు రోజులు దగ్గరకి రానివ్వలేదు. అతను కేకుపై 'మనిద్దరం పోట్లాడుకోవడం పిచ్చితనం. ఐయాం వెరీ సారీ. ఈ రాత్రి నుంచి సెక్స్‌ను అనుమతించు' అని రాయించి పంపాడు.

# చతుర ప్రవేశిక

## డిసెంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. కామేశం భార్య ఎవరు?
జ.
2. అమృతకు బాగా నచ్చిందెవరు?
జ.
3. వినోద్ గాల్‌ఫ్రెండ్?
జ.
4. రంగనాథ్ భార్య?
జ.
5. విశ్వనాథానికి తోడుగా నిలిచింది?
జ.
6. ఆనందభూతి తండ్రి?
జ.
7. పాపారాయుడి కూతురు?
జ.
8. 'ది మాన్ ఆఫ్ ప్రాపర్టీ' రచయిత?
జ.
9. 2007లో జ్ఞానపీఠం ఎవరిని వరించింది?
జ.
10. కృష్ణంరాజును పరిచయం చేసిన సినిమా?

---

పంపినవారి పేరు: ----------------

-------------------వయసు ( )

చిరునామా: --------------------

--------------------------

--------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

చుకోలేక, గొంతు కోసేక అడ్డదిడ్డంగా పరిగెత్తిన కోడిలా అటూ ఇటూ పచార్లు చేసి అలసిపోయి, రెండు నిద్రమాత్రలు వేసుకుని తొమ్మిది గంటలకే పరుపు మీదకి చేరి దుప్పటి కప్పుకుంది సునంద.

★ ★ ★

సునందతో మాటలాడేక ఫోన్ క్రింద ఉంచుతుంటే అమృత ఎదురుగా సరిత నిలుచుంది.

"నువ్వు ఆలస్యంగా లేచేటప్పటికి నేను లేబ్‌లో పనిచేయడానికి వెళ్ళిపోతున్నాను. నువ్వు రెండురోజులూ రాత్రిళ్లు ఆలస్యంగా తిరిగి వచ్చేవు. రెండు రోజులు నువ్వు ఇక్కడ ఉన్నా నీతో మాటలాడడం వీలవ లేదు. ఎలా ఉన్నావు? ఏమిటి ఈ ట్రిప్‌కి కారణం? " అనడిగింది సరిత.

అమృత వెంటనే ఏమీ సమాధానమీయ లేదు.

"నిన్న ఎవరో అపరిచిత వ్యక్తి వదిలివెళ్ళడం నా కంటపడింది. నేను వినకూడదనుకున్నా నీ ఫోన్ సంభాషణలో కొన్ని వాక్యాలు నా చెవిన పడ్డాయి. నాతో సమవయస్కురాలివయిన నిన్ను చూస్తుంటే పిసరంత ఆశ్చర్యమూ, కొండంత భయమూ కలుగుతున్నాయి. ఇది అమెరికా. నీ బ్రతుకు నీది. నిన్ను ఎప్పుడూ పలకరించి ఏమీ అడగలేదు. అర్థమవని పరుగులు పెడుతూ ఎదురుగా కనిపిస్తున్న నిన్ను ఏమీ అడగకుండా ఎలా ఉండగలను? " అంది సరిత.

మాటల కోసం తడుముకుంటూ, గత ఐదారు వారాలలో తనలో రేకెత్తిన అలజడి, దానిని తను ఏ విధంగా పరిష్కారం చేయడానికి సన్నద్ధురాలైందో వివరించింది అమృత.

"నీ పరిస్థితి నాకు కొంతమట్టుకే అర్థమయింది. తలనొప్పి తమకి వస్తేగాని ఇతరులకి ఎంత వివరించినా అర్థమవదు. నువ్వు ఎన్నుకున్న మార్గం సరి అయి

నదా? కాదా? అన్న ప్రశ్న నిరర్థకం, అప్రస్తుతం" అంటూ, "నువ్వు ఇండియాలో ఉండి ఉంటే ఎలా ఉండేదో? అన్నది ఆలోచిస్తున్నాను. ఇక్కడిలాగే అక్కడ ఉన్న ప్రజలకి కూడా ఇతరుల గురించి పట్టించుకునే తీరుబడిలేదు. కాని అక్కడ ఉన్న జీవన విధానంలో పండుగలు, పెళ్ళిళ్లు, పేరంటాలు లాంటి వేడుకలు, ఇతర సంబరాలు ఎక్కువ. స్నేహితుల ఇళ్ళలో సత్యనారాయణ వ్రతం అనో, భోగిపళ్ళు పోయడమో అంటూ ఆర్భాటం చేసి ఆహ్వానించి, ఆ కార్యక్రమాల్లో పాల్గొనమని పిలుస్తారు. వాటిమీద మనకి ప్రత్యేకమైన ఆసక్తి ఉన్నా లేకపోయినా అలాంటి వాటికి పిలుపులు వస్తాయి. చాలా సందర్భాలలో అవన్నీ డాంబిక ప్రదర్శనలే కావచ్చు, అవి ప్రదర్శిస్తే చూసేందుకు మనుష్యులు కావాలేమో. కారణమేమైనా నువ్వు ముకుళించుకుపోయి 'నన్ను ముట్టుకోకే నామాలకాకి' అంటూ సమాజాన్ని వదిలేయకపోతే, సమాజం నిన్ను ఆ ముగ్గులోనికి లాగ ప్రయత్నిస్తుంది. అయితే నువ్వు అక్కడ బంధుమిత్రుల సమాజంలో ఉంటేనే ఇది సాధ్యం. నీలాంటి వాళ్లు చటుక్కున అక్కడకి చేరితే వాళ్ళు నిన్ను అక్కున చేర్చుకోరు, అది పరమసత్యం" అంది సరిత.

"ఆ దేశంలో నాకు తెలిసిన బంధువులు, మిత్రులు ఎక్కడ ఉన్నారో కూడా నాకు తెలియదు" అంది అమృత.

"రేపు ఉదయం నువ్వు బయలుదేరి వెళ్ళిపోతానని చెప్పేవు. మళ్ళీ నీతో మాటలాడతానో లేదో తెలియదు. నువ్వు జేమ్స్‌తో పరిచయాన్ని ఆచితూచి పెంచుతావనే అనుకుంటున్నాను. నిన్ను నువ్వు రక్షించుకోవడానికి తగిన జాగ్రత్తలు తీసుకుంటున్నావా ఆ పరిచయం ఎక్కడికి దారి తీస్తుంది? అన్నది నీకే తెలియదు. సహజీవనమూ? వివాహమా? కాలమే చెబుతుంది కాబోలు, దానికి సమాధానాన్ని" అంది సరిత.

"చూడాలి, ఇది ఎలాంటి మలుపు తిరుగుతుందో" అంది అమృత

"బెస్ట్ ఆఫ్ లక్! గుడ్‌నైట్" అంటూ తన గదిలోకి వెళ్ళింది సరిత.

సరిత చేసిన హెచ్చరిక అమృతని ఆలోచనలోనికి త్రోసింది.

జేమ్స్‌తో గడిపిన రోజులు ముఖ్యంగా మొదటి రెండు రోజులని నెమరు వేసుకుంది.

ఉదయం తొమ్మిది గంటలకి కాలింగ్ బెల్ శబ్దం వినగానే హుటాహుటిన చేతి సంచీతో ఇంటిలోనుంచి బయటపడి జేమ్స్ కారులో కూర్చుని సర్దుకోబోతుంటే "వన్‌మినిట్. మనకి దాదాపు మూడు గంటలపైనే ప్రయాణం ఉంది. అంతసేపు నడుముకి సపోర్ట్ లేకుండా కూర్చోవడం ఇబ్బంది. అందుకే ఈ చిన్న తలగడా తెచ్చేను, దీనిని నడుము వెనకాతల ఉంచుకుంటే ప్రయాణం హాయిగా ఉంటుంది" అంటూ ఒక చిన్న తలగడని జేమ్స్ అందిచ్చేడు. "నాకు ఈ సీట్‌బెల్ట్‌లో ఉన్న ట్రిక్ అర్థమయింది" అంటూ హుషారుగా సీట్ బెల్ట్ లాగి సరిచేసుకుంది తను.

"గుడ్, ఐనో! మీరు సాధిస్తారు" అంటూ కారుని రోడ్డుమీదకి మళ్ళించేడు జేమ్స్. లాఘవంగా కార్లని అధిగమిస్తూ, హైవే మీద పరిగెడుతున్న ఇతర కార్ల వేగానికి తగినట్లు లేన్స్ మారుస్తుంటే నడుము దగ్గర పెటుకున్న చిన్న తలగడని సరిచేసుకుని "నిజంగా ఈ తలగడ వలన నా నడుముకి హాయిగా ఉంది జేమ్స్, థేంక్స్" అంది తను.

"మై ప్లెషర్. ఇలాంటి చిన్న చిన్న చిట్కాల వలన ప్రయాణంలో బడలిక తెలియదు" అన్నాడు జేమ్స్ నవ్వుతూ.

జేమ్స్ తన గురించి ఆలోచించి శ్రద్ధ తీసుకుని ఆ తలగడ తెచ్చినందుకు తనకి ఆనందం కలిగింది. సొంతం ప్రక్కకి తిరగకుండా జేమ్స్ వేపు దృష్టి సారించింది. చిరుగడ్డం, తెల్లపడుతున్న చెంపల వెంట్రుకలు, సూది ముక్కు చూస్తుంటే "ఏమిటి అలా పరీక్షగా చూస్తున్నారు? " అనడిగేడు జేమ్స్.

గతుక్కుమంది తను. ఏమీ మాటలాడకుండా చిరునవ్వు నవ్వింది.

ఒక గంట ప్రయాణం చేసేక "నేను బ్రేక్‌ఫాస్ట్ చేసే బయలుదేరాను. ఉదయం మీరేమైనా తిన్నారా? " అనడిగేడు జేమ్స్.

అడ్డంగా తల ఊపుతూ "అంత ఉదయమే నేను ఏమీ తినలేను" అంది తను.

"ఇంకో ఐదు నిమిషాలలో ఒక రెస్ట్ ప్రదేశం రాబోతోంది. అక్కడ ఆగి ఏమైనా తినడానికి దొరుకుతుందేమో చూద్దాం" అన్నాడు జేమ్స్.

"నిర్మానుష్యంగా ఉన్న ఈ ప్రదేశంలో ఏమీ దొరకవు" అంటూ తను నీరసపడుతుంటే కారుని పార్క్‌చేసి వెనక సీట్లో ఉన్న చేతిసంచీ అందుకుని "ఇదిగో దీనిలో రెండు క్రోసాంట్లు, రెండు సేండ్‌విచ్‌లు ఉన్నాయి. ఈ ఫ్లాస్క్‌లో కాఫీ ఉంది" అంటూ సంచి అందిచ్చి, తనని మరోసారి ఆశ్చర్యపరిచేడు జేమ్స్. సంతోషంగా క్రోసాంట్, సేండ్‌విచ్‌లని తిని కాఫీ తాగడం ముగిస్తుంటే "మరొక తొంభై నిమిషాలలో శాన్‌డియాగో చేరుతాం" అన్నాడు చెత్తని చెత్తబుట్టలోనికి గిరవాటేస్తూ.

ఆకలి నుంచి తేరుకున్న తను కారులో కూర్చుంటూ "నా క్లాస్‌మేట్ ఒకామె శాన్‌డియాగోలో ఉంది. ఆమెకి నేను శాన్‌డియాగో వస్తున్నానని ఫోన్‌చేసి చెప్పేను. నన్ను తన ఇంటిలో ఉండమంది. పగలంతా మనం కలిసి ఎక్కడ తిరిగినా రాత్రి బస ఆమె ఇంట్లోనే. మీకేమీ అభ్యంతరం లేదుకదా? " అనడిగింది తను.

"మీకు ఏది బాగుంటుందో అదే చేయండి. ఎన్ని గంటలకి మీరు మీ స్నేహితురాలి ఇంటికి చేరుదామనుకుంటున్నారో చెప్పండి. వాళ్ళ ఎడ్రస్ ఇస్తే, కారులో ఉన్న జిపిఎస్‌లోకి ఎక్కిస్తే మనం అక్కడికి సులభంగా చేరుతాం" అన్నాడు జేమ్స్.

ఏమీ వ్యాఖ్యానం చేయకుండా తన ప్రతిపాదనకి విలువ ఇచ్చినందుకు మనస్సులోనే జేమ్స్‌కి కృతజ్ఞతలు చెప్పుకుంది. శాన్‌డియాగోలో సీవర్ల్డ్‌లో డాల్ఫిన్స్ విన్యాసాలని చూసేటప్పుడు, డాల్ఫిన్ దబ్బున నీటిలో పడితే చిప్పిల్లిన నీళ్ళు తన మీద పడబోతుంటే అసంకల్పితంగా తను జేమ్స్‌ని ఆనుకుని అతనిని నీళ్ళ చిందుడికి అడ్డుగా ఉంచుకుంది. చిరునవ్వు నవ్విన జేమ్స్‌ని చూస్తే తనకి సిగ్గువేసింది.

"ఇహ వెళ్దాం" అంది తను, రెండు గంటలు గడిచేక.

"ఇంకా చాలా మంచి విన్యాసాలు ఉన్నాయి" అని తనవేపు పరీక్షగా చూసి, "అలాగే" అంటూ లేచేడు జేమ్స్. పది నిమిషాలు గడిచేక "నడుం నొప్పి తీవ్రంగా ఉందా? " అనడిగేడు.

"కొంచెం ఇబ్బంది, అంతే" అంది సగం నిజం చెబుతూ.

రెండవ రోజు శాన్‌డియాగో జూ చూసేరు. "చాలా బాగుంది, ముఖ్యంగా ఆ చైనీస్ పాండా" అంది తను రెండు గంటలు పాటు తిరిగేక. అన్నిచోట్లా చొరవ తీసుకుని ముందరకి ఉరుకుతున్న జేమ్స్‌తో "మీ వయస్సు ఎంత? మీకేమీ శారీక ఇబ్బందులు లేవా? " అనడిగింది తను ఉండబట్టలేక.

"నేను చాలాకాలం స్క్వాష్ ఆడేను. దానిలో చాలా వ్యాయామం ఉంది.

అందువలన నా శరీరం ఇంకా నే చెప్పి నట్లే వింటోంది. నాకు ఈ మధ్యనే ముణుకుల దగ్గర నొప్పి రావడం మొదలయింది. ఆర్థోపెడిక్ డాక్టర్‌ని సంప్రతించేను. అతిగా పరుగులు పెట్టే ఆటలు మానివేయమన్నాడు. మేడమెట్లు ఎక్కడం, దిగడం తగ్గించమన్నాడు. స్క్వాష్ అడడం మానేసి అప్పుడప్పుడు జిమ్‌కి వెళ్తుంటాను. నా వయస్సు అరవైరెండు. శారీరకంగా నే బాగానే ఉన్నా అప్పుడప్పుడు 'మైగ్రేన్' తల నొప్పి బాధిస్తుంది. అది ఎందుకు వస్తుందో డాక్టర్లు చెప్పలేక పోయేరు" అన్నాడు జేమ్స్.

జేమ్స్ తన గురించి చెప్పినా మౌనంగా తను విందే కాని వ్యాఖ్యలు ఏమీ చేయలేదు.

"మీ గురించి ఏమీ చెప్పలేదు. ఏది చెప్పినా చెప్పకపోయినా మీ వయస్సు చెప్పనవసరం లేదు" అన్నాడు జేమ్స్ నవ్వుతూ తనలో ఉన్న సందిగ్ధత పసికట్టి. "గతంలో- కొత్తగా పరిచయం అయింది, కొత్తగా పరిచయం అయింది.. అందుచేత మీతో నా ఆలోచనలు పంచుకోలేను- అన్నారు. అది అప్పుడు. ఇప్పుడు మన పరిచయం వృద్ధి అయింది. నేనేమీ మిమ్మల్ని బలవంతపెట్టను. ఎప్పుడో ఒకప్పుడు మీలో ఉన్న సంకోచం పోవాలి" అన్నాడు జేమ్స్.

"మీరన్నది నిజమే. కాని నా నోటంబట మాటలు త్వరగా బైటపడవు. నన్ను ఎవరైనా బలవంత పెడితే నేను ఇంకా బిగుసుకుపోతాను. నాకు కాస్త వ్యవధి కావాలి. బిలీవ్ మి" అంది తను.

"నేను మిమ్మల్ని పూర్తిగా నమ్ముతాను" అన్నాడు జేమ్స్.

"ఏం చెప్పమంటారు? నాకు ఒంటరిగా బ్రతకడం అంటే చెప్పలేనంత భయం. ఒంటరితనం హడలెత్తించినంత నన్ను ఇంకేమీ భయపెట్టదు. అదేమి ఖర్మోకాని ఒంటరిగా ఉన్నప్పుడు ఈ నడుం నొప్పి కూడా ఎక్కువవుతుంది" అంటూ అతని వేపు చూసింది.

"ఇది ఒక మంచి ఆరంభం. నాతో ఇది పంచుకున్నందుకు థేంక్స్" అన్నాడు జేమ్స్.

తను తల ఊపింది.

"రేపొక కొత్త ప్రదేశానికి వెళ్దాం. మళ్ళీ శాన్‌డియాగోకి తిరిగి రాం. మీకు ఓపిక ఉంటే, ఇష్టపడితే, అక్కడ నుంచి తిరిగి ఇంటికి వచ్చే ముందర మరో చోటుకి.."

"నాకు సమ్మతమే. ఈ తిరగడంలో ఖర్చు అంతా మీరు భరించడం నన్ను చాలా ఇబ్బంది పెడుతోంది. ఖర్చు చెరి సగం అంటేనే వస్తాను. కాదు అంటే తిరిగి వెళ్లిపోదాం" అంది అమృత ఖండితంగా.

"సరే" అన్నాడు జేమ్స్

జేమ్స్‌తో వెళ్ళడానికి నిశ్చయించుకుంది తను. ఐనప్పటికీ సరిత మాటలు తనని కాస్త ఆలోచింపచేస్తున్నాయి.

"ఆచితూచి అడుగులు వేయి సుమా, అతనితో ఈ సాన్నిహిత్యం ఎలాంటిది? వివాహానికి దారితీస్తుందా?" అనడిగింది సరిత. ఆమె అలా అడగడంలో ఆశ్చర్యం ఏమీలేదు. తనని తప్పుపట్టలేదు, హెచ్చ

## కొత్తగాలి...

**బొగ్గు మసి**
**ప్రధాని పరువు**
**మసి.. మసి..!**

– వెల్మల రాంరెడ్డి,
పూడూరు

రించింది అంతే. జేమ్స్‌తో తనకి పరిచయం తక్కువే. ఐనప్పటికీ అతనంటే ఇంతవరకు మంచి భావనే కలిగింది. కేవలం స్నేహం అన్న దశలో ఉన్నది. చిలవలు పలవలు చేసి ఇంకో రకమైన ఎత్తుకి వెళుతుందా? వివాహానికి దారితీస్తుందా? వీటి గురించి తను తర్కించి ఏమౌతుందా? ఏం చేయాలి? అంటూ, ఆహ్లాదకరంగా గడుస్తున్న రోజుల్ని తను పాడు చేసుకోలేదు. రాబోయే రెండు, మూడు రోజుల్లో జేమ్స్‌తో హోటల్లో ఒకే గది పంచుకోవాల్సి వస్తుంది. జేమ్స్ తనంటే గౌరవం ప్రదర్శించేడు, ప్రదర్శిస్తున్నాడు, ప్రదర్శిస్తాడు. అందువలన తనేమీ భయపడనవసరంలేదు. 'నమ్మకం లేని స్నేహం విలువ పెన్నీ కన్నా తక్కువ' అన్నారు వెనకటికెవరో. మొదట్లో జేమ్స్ తనకి దగ్గరగా వచ్చి మాట్లాడినపుడు ముకుళించుకుపోయేది. ఇప్పుడు ఆ బెరుకుతనం తగ్గింది. తను ఆచి తూచి అడుగువేస్తుంది. కాని అడుగు వేయడానికి తనేమీ భయపడదు. ఇద్దరి మధ్యా సాన్నిహిత్యం పెరుగుతుందనే నమ్ముతోంది తను. 'రాబోయే రోజులు ఎలా పరిణామం చెందుతాయో చూద్దాం' అనుకుంటూ బట్టలు మార్చుకుని నిద్రకి ఉపక్రమించింది అమృత.

★ ★ ★

"మనం వెళ్ళిన కేసినో పేరేమిటి? " అనడిగింది అమృత

"పంచంగా కేసినో" అని సమాధానమిచ్చేడు జేమ్స్

"మీరు జూదంలో ఎంత పోగొట్టుకున్నారు?

"నూట ఏభై డాలర్లు"

"నాకు వంద డాలర్లు లాభం వచ్చింది"

"ఇంకా కాస్సేపు ఆడితే మరికొంత గెలుచుకునేవారేమో"

"కావచ్చు. వచ్చినది కాస్తా పోవచ్చు కూడా. కేసినోలో సిగరెట్ వాసన భరించలేనంతగా ఉంది. అందుకే ఉండలేకపోయేను. మీకు ఇంకా కేసినోలో ఉండాలి అనిపించిందేమో? "

"సరదాకి మనం కేసినోకి వెళ్ళేం. కాస్సేపు గడిపేం. నాకు తలనొప్పి ప్రారంభమవకుండా బయటపడ్డాం" అన్నాడు జేమ్స్.

అంగీకారంగా అమృత తల ఊపింది.

"మరొక గంటలో మనం ఆ ప్రదేశానికి చేరుతాం. హోటల్లో సామాన్లు పడేసి కాస్సేపు రిలాక్స్ అయేక బైటికి వెళ్దాం" అంటూ కారువేగం పెంచేడు జేమ్స్.

"నాకూ కారు డ్రైవింగ్ వచ్చు. నేను కాస్సేపు డ్రైవ్ చేసేదా? "

"వద్దు, వద్దు"

"ఏం? నా డ్రైవింగ్ మీద మీకు నమ్మకం లేదా? "

"అదేమీ కాదు. నేను డ్రైవ్ చేయకుండా పేసెంజర్ సీట్లో కూర్చుంటే పదిహేను నిమిషాలలో నాకు తలనొప్పి ఆరంభమవుతుంది"

"సరే" అంటూ కళ్ళు మూసుకుంది అమృత. గతంలో తన డ్రైవింగ్ విషయంలో కామేశంతో జరిగిన సంభాషణ గుర్తుకు వచ్చింది.

"హైవేమీద నువ్వు డ్రైవ్ చేస్తుంటే నీ వెనకాతల రోడ్డుమీదున్న కార్ల డ్రైవర్లకి మతిపోతుంది. అంత నెమ్మదిగా నువ్వు కారుని ఎందుకు నడుపుతున్నావో తెలియక జుత్తు పీకేసుకుంటారు. నేచెప్పినది నిజమోకాదో కావాలంటే వెనక్కి చూడు, ఎన్నికార్లు బారులు కట్టి ఉండిపోయేయో! ఇటు చూడు, నిన్ను కార్లు ఎడమ పక్క నుంచి, కుడిపక్క నుంచి ఎలా దాటుకు వెళ్తున్నాయో" అంటూ సరదాగా కామేశం ఎద్దేవా చేసేడు.

దాదాపు జేమ్స్ నడుపుతున్నట్లే కామేశం కారుని బాగా నడిపేవాడు. జేమ్స్-కామేశం కదలికలు, హావభావాలలో చాలా తేడా ఉంది. కామేశం... అను కుంటూ ఆగింది అమృత. కామేశంని, జేమ్స్‌ని ఎందుకు పోల్చి చూస్తోంది తను? కామేశం ఇప్పుడు లేడు. అతని గొప్పతనంకాని, చేతకానితనం గురించి కాని తను మధనపడవచ్చు. అయినా పొర పాటున కూడా అవి జేమ్స్‌తో ముచ్చటించ దగినవికావు. జేమ్స్‌కి తనని కామేశంతో తూకం వేయడం నచ్చకపోవచ్చు. అనవస రమైన చీకాకులని కావాలని సృష్టించుకున్న ట్లవుతుంది. ముందరి రోజు కేసినో నుంచి బైటపడ్డాక హోటల్లో జేమ్స్ గది అద్దెకి తీసుకుంటుంటే అరక్షణం తన గుండె ఎక్కువ వేగంగా కొట్టుకుంది. గదిలో వేర్వేరుగా రెండు పరుపులు కనపడగానే ఎందుకో ఆ అదురు తగ్గింది. జేమ్స్ తన మనఃస్థితిని ఊహించి అలాంటి గదిని కావాలని అడిగేడా? ఏమో! ఈవేళ గది ఎలా ఉంటుందో? అనుకుంటుంటే....

"వచ్చేసేం" అంటూ కారుని హోటల్ ముందర ఆపేడు జేమ్స్.

కారు దిగి, సామాన్లతో జేమ్స్ వెనకాతల గదిలోనికి ప్రవేశిస్తుంటే, ఒకే ఒక పెద్ద మంచం కనపడగానే ఉలిక్కిపడింది అమృత. 'వేర్వేరు మంచాలు లేవే?' అను కుంటుంటే "గది ఎలా ఉంది? నచ్చకపోతే మరోచోటికి వెళ్దాం" అన్నాడు జేమ్స్.

"బాగానే ఉంది" అంది అమృత.

"బీచ్ ఇక్కడికి దగ్గరే. మీరెప్పుడైనా సముద్రంలో స్నానం చేసేరా? ఐ లవ్ ఇట్" అన్నాడు జేమ్స్.

అడ్డంగా తల ఊపింది అమృత.

"మీరు ఒడ్డున కూర్చుని సముద్రంలో కెరటాలని చూస్తుంటే నేను ఒక మునక వేసి వస్తాను" అన్నాడు జేమ్స్.

ఇద్దరూ బీచ్ వేపు నడిచేరు.

సాయంకాలం దాదాపు ఆరు గంటలు కావస్తోంది. పశ్చిమం వేపు సూర్యుడు తొందర పడుతూ, అలసిపోతూ పరుగులు పెడుతున్నాడు. నీటిలోంచి బైటికి వచ్చి తదేకంగా ఆకాశంవేపు చూస్తున్న అమృతని చూస్తూ తువ్వాలుతో తుడుచు కున్నాడు జేమ్స్.

"మా ఊరిలో చాలా చిన్నప్పుడు చింత పిక్కలు ఆడేవాళ్లం. దాచిన చింతపిక్కల్ని డబ్బాలోంచి వంచితే చింతపిక్కలు చెల్లాచె దురయ్యేవి. ఆకాశంమీద ఆ చిన్న చిన్న మేఘం ముద్దలమీద పరోక్షంగా సూర్యకిర ణాలు పడుతుంటే అవి ఆ చింతపిక్కలలా ఉన్నాయనిపిస్తోంది" అంది అమృత.

ఆశ్చర్యంగా అమృత వేపు చూసిన జేమ్స్ మొహంలో ఉద్భవించిన చిరునవ్వు పూర్తిగా విస్తరించింది.

"నాకు చింతపిక్కల గురించి తెలియదు. మై గుడ్‌నెస్! మీలో మంచి భావుకత ఉందని మీకు తెలుసా? గ్రేట్" అంటూ ఆప్యాయంగా, ఆరాధనా పూర్వకంగా అమృత చేయి నొక్కాడు జేమ్స్.

"థాంక్యూ" అంటూ అదిమిన అతని చేయిని తట్టింది అమృత.

"చూడండి, సూర్యుడు ఎలా సముద్రం లోనికి మునిగిపోతున్నాడో! ఈ ప్రదేశాన్ని 'హాఫ్ మూన్ బే' అంటారు. అర్ధచంద్రాకా రంలో ఉంటుంది ఈ బీచ్. ఇక్కడ సూర్యాస్తమయం, బాగా ఎత్తుకు ఎగిసే అలలు చూడటానికి చాలా బాగుంటా యని అంటారు. మిమ్మల్ని ఇక్కడికి తీసు కువచ్చినందుకు నాకు చాలా ఆనందంగా ఉంది" అన్నాడు జేమ్స్.

"ఇక్కడికి వచ్చినందుకు నాకూ అంతే ఆనందంగా ఉంది" అంటూ విప్పారిన మొహాన్ని జేమ్స్‌వేపు తిప్పింది అమృత.

చీకటి పడ్డాక జేమ్స్ పక్కన నడుస్తూ

హోటల్ వేపు తిరుగుముఖం పట్టిన అమృత ఉదయం లేచేక సునందకి ఫోన్ చేసి 'నాతో జీవితంలో ప్రయాణం చేయ డానికి ఒక వ్యక్తి లభించేడు' అని చెప్పాల నుకుంది.




**రం**గనాథ్ హైద్రాబాద్ వచ్చి రెండు వారాలు దాటేయి.

వంటమనిషిని మాన్పించి తనే వండుతూ ఇంటిని విశాలాక్షి సమర్థంగా నడుపుతోందని రంగనాథ్‌కి విశదమైంది. తరచూ తండ్రి, విశాలాక్షి కబుర్లు చెప్పుకో వడం చూసినపుడు రంగనాథ్‌కి రవ్వంత ఈర్ష్య, అనుమానం కలిగేయి.

తను అమెరికా వెళ్లేలోగా తీరికగా తండ్రితో మాటలాడటం వీలవుతుందా? అనుకుంటున్న రంగనాథ్‌కి తండ్రి ఒక రోజు సాయంకాలం ఒంటరిగా కనిపిం చేడు. విశాలాక్షి జాడ లేదు. తండ్రిని సమీ పిస్తున్న రంగనాథ్‌ని చూసి "విశాలాక్షి బైటికి వెళ్లింది. ఫ్రిజ్ లో డికాక్షన్ ఉంది. కాఫీ తాగుదామా?" అనడిగేడు విశ్వ నాథం.

"నేను కాఫీ కలుపుతాను నాన్నా"

"నువ్వలా కూర్చో కాఫీ చిటికెలో కలు పుతాను" అంటూ లేచి, మరుగుతున్న పాలలో డికాక్షన్ ఒంచి, వెంటనే కాఫీని కప్పులలో నింపి ఒకటి రంగనాథ్‌కి అంది చ్చేడు విశ్వనాథం.

కాఫీ తాగుతూ తండ్రివేపు పరిశీలనగా చూసేడు రంగనాథ్.

"ఉద్యోగం చేస్తున్నపుడు ఆఫీస్‌లో నాకు కాలం తొందరగా గడిస్తే, మీ అమ్మ నా గురించి నిరీక్షిస్తూ, నాకు కావలసినవి అమర్చ ప్రయత్నిస్తూ పగలంతా గడిపేది. సాయంకాలం ఇంటికి వచ్చేక ఏవో కొన్ని ముక్తసరి మాటలు, పొడిపొడి సంభాషణ లతో భోజనం కానిచ్చి, కాస్సేపు టెలివిజన్ చూసేవాళ్ళం. రంగనాథ్, సునందలు ఎలా ఉన్నారో? శాన్‌ఫ్రాన్సిస్కో దగ్గర భూకంపం వచ్చిందనో, కేలిఫోర్నియాలో మంటలు.. ఇళ్లు తగలడిపోతున్నాయి.. ఇందాక టెలివిజన్‌లో చూపించేరు.. మన వాళ్ళు ఎలా ఉన్నారో! అనో మీ అమ్మ ఆరాటపడినపుడు, నాకూ అంతే ఆరాటం ఉన్నా మేకపోతు గాంభీర్యం ప్రదర్శించి భూకంపం వచ్చిన ప్రదేశం వాళ్ళ ఊరికి చాలా దూరం అనో, ఇంకోటో చెప్పి ఆమెని శాంతపరిచేవాడిని. నీ గురించి ఆవిడ ఎంత భయపడేదో తనేమీ చేయలే నని ఎంత బాధపడేదో! నేను రిటైర్ అయేను.

వాళ్ళందరినీ ఈమారు నెలరోజులు సెలవుపెట్టి రమ్మనండి. మీ అరవయ్యోవ పుట్టినరోజు వస్తోంది. వాడికిష్టమైనవన్నీ చేస్తాను. వాడి కూతురికి పగడాలతో సెట్ చేయిస్తాను... అని మీ అమ్మ అంటుంటే "అనసూయా! ఇలా 'అది చేస్తానని', 'ఇది చేస్తానని' ప్లేన్లు వేయకు. మనలో చాలా మంది 'రేపు గురించి', 'ఎల్లుండి గురించి', 'వచ్చే సంవత్సరం గురించి' 'ఆ వచ్చే సంవ త్సరం గురించి' అతిగా ఆలోచిస్తారు. బేంక్‌లలో డిపాజిట్లకాలం మారుస్తారు. డిపాజిట్లు మెచ్యూర్ అయితే వాటిని ఏం చేయాలో అని ఆలోచిస్తారు. ఇళ్ళున్న వాళ్ళు కొందరు 'మేడమీద రెండు గదులు



వేయిస్తున్నాను. అధునాతనంగా తయారు చేసి ఉంచుతాను. మా పిల్లలు ఇక్కడికి వచ్చినపుడు ఇబ్బంది కలగకుండా వాళ్ళు దానిని ఉపయోగిస్తారు' అనడం నాకు తెలుసు. ఇలాంటివి ఎన్నో! నేను రేపటి గురించి ఆలోచించదలచుకోలేదు. 'రేపు' వచ్చినపుడు 'రేపు'లో ఉంటాను" అన్నాను.

"మీదంతా వితండవాదన. మెట్ట వేదాంతం. రేపు గురించి ఆలోచించకపోతే ఎలా? " అంటూ మీ అమ్మ పగలబడి న వ్వేది. కానిక్రమేణా ఆమె దృక్పథంలో కూడా కాస్త మార్పు వచ్చిందనిపించింది నాకు. నువ్వు ఇండియా వచ్చి మాతో గడు పుతావని మేము ఊహించలేదు. నువ్వు వచ్చేవని ఆమె ఎంత సంబరపడిందో! నువ్వు అమెరికా తిరిగివెళ్ళక ముందరే ఆమె చనిపోవడం ఒక విధంగా మంచి దైంది. లేకపోతే 'మనకి ఉన్నది వాడొక్క డేగా' అని తపనపడే మీ అమ్మ బాగా బెంగపెట్టుకుని, డీలా పడేది. 'రేపు' గురించి ఆలోచన అనవసరం అన్న ఆలోచనలో ఉన్న నేను, నువ్వు ఇండియా రావడాన్ని, నువ్వు తిరిగి వెళ్ళడాన్ని సమ ంగా తీసుకున్నాను.



"తెలియని రేపు గురించి ఎందుకు అతిగా హైరానాపడిపోవడం? " అంటూ ఆగేడు విశ్వనాథం.

"నువ్వు చాలా కొత్తగా ఉన్నావు నాన్నా. మీలో ఇంత మార్పా? "

"అవును. ఈ మధ్య నా ఈ ఆలోచనలు పటిష్టమయేయి. మెట్లు దిగుతూ తూలి కింద పడబోతుంటే- నాకు ఆసరా ఇచ్చి నేను పడకుండా ఆపేరు, ఆ రోజు ప్రత్యేక మైన రోజు- అంది విశాలాక్షి. నాకూ అలాగే అనిపించింది. ఆ రోజునుంచీ నా అలవాట్లలో కొన్ని మార్పులు వచ్చేయి. ఉదయంపూట నడకకి ఇష్టపడని విశాలాక్షి, నా గురించి మార్నింగ్‌వాక్‌కి వస్తుంది. నాకు సంగీత కచేరీలంటే ఆసక్తి లేదు. అవంటే ఇష్టం చేసుకునే విశాలాక్షితో కచే రీలకి వెళతాను. విశాలాక్షి ఇద్దరికీ నచ్చే కూరలు చేస్తుంది. లేదా ఇద్దరికీ నచ్చే చెరొక కూర చేస్తుంది. ఇలాంటివి ఎన్ని! ఒకరి ఇష్టాలు ఇంకొకరికి తెలియడంతో ఎదుటి వ్యక్తి ధోరణికే ఎక్కువ విలువ ఇవ్వడం మాకు అతి తక్కువ రోజుల్లోనే అలవాటయింది.

ఇవన్నీ చర్చించుకుని, ప్లేన్లువేసి, ఒక

నిర్ణయానికి వచ్చినవికావు. ఆటోమేటిక్‌గా వచ్చేయి. పేపర్లలో క్రాస్‌వర్డ్ పజిల్స్ చూసే ఉంటావు. నిలువుగడిలో వాడిన పదాల అక్షరాలు, అడ్డంగా ఉన్నగడిలో వాడిన అక్షరాలు సరిగ్గా కుదిరినపుడే పజిల్ సవ్యంగా పూర్తవుతుంది. జీవితం కూడా ఒక పజిలే రంగనాథ్" అన్నాడు విశ్వనాథం.

కాలింగ్ బెల్ మోత రంగనాథ్, విశ్వనాథం మధ్య నడుస్తున్న సంభాషణని ఆపింది.

రంగనాథ్ లేచి తలుపు వేపు వెళ్ళబోతుంటే "నాకు తెలుసు ఎవరు తలుపు కొట్టారో. కాంట్రాక్టర్ మనిషి వస్తాడు, కవర్‌లో పెట్టిన డబ్బు ఇచ్చేయండి" అంటూ విశాలాక్షి కవర్ ఇచ్చింది.

"అతనే అయి ఉంటాడు" అంటూ తలుపు తెరచి చూసి అతనికి కవర్ అందిచ్చేడు విశ్వనాథం.

"కాఫీ బాగా కుదిరింది నాన్నా" కడిగిన ఖాళీ కప్పుని టేబిల్ మీద ఉంచుతూ అన్నాడు రంగనాథ్.

"ఇంటికి మరమ్మతులు చేయిస్తున్నావు. చాలా ఖర్చు పెడుతున్నావు నాన్నా. ఎందుకు నాన్నా, ఈ అనవసరపు ఖర్చు? ఈ ఇల్లు అమ్మేయడమో, లేక ఉన్నది ఉన్నట్లు అద్దెకి ఇచ్చేయడమో చేద్దాం. నెలకి నలభై వేల రూపాయలు అద్దె వస్తుంది. ఈ ఇంటికోసం చాలామంది ఎగపడతారు. నువ్వు నాతో వచ్చేద్దువు గాని" అన్నాడు రంగనాథ్.

"ఇంటి మరమ్మతులకి దాదాపు రెండు లక్షల రూపాయలు ఖర్చు అయింది. ఇది ఎక్కువ ఖర్చే అని నాకూ అనిపించింది. కాని నా చేతిలోంచి కేవలం ఇరవైఐదు వేలు మాత్రమే పడ్డాయి. మిగతా ఖర్చంతా విశాలాక్షిదే.

'నాకు తోటంటే చాలా ఇష్టం. కాని మన వయస్సులో తోటలో ఎక్కువ సమయం పనిచేయడం సాధ్యం కాదు. అందుకే ఆటోమేటిక్ స్ప్రింక్లర్స్ పెట్టించేను. మనకి తరచూ విద్యుత్ సరఫరాకి అంతరాయం కలుగుతోంది. ఆ సమస్యకి పరిష్కారంగా డాబామీద సోలార్‌పేనెల్స్, ఇన్వర్టర్ పెట్టించేను. అన్ని కిటికీల తలుపులకి మెష్‌లు పెట్టించేను. నా దగ్గర డబ్బు ఉంది. ఉన్న పాత ఎయిర్ కండీషనర్ సరిగ్గా పనిచేయకపోవడంతో కొత్తది అమర్చేను. ఈ మార్పుల వలన నాకు కూడా ఈవేళ రోజులు ఇబ్బందులు లేకుండా గడుస్తాయి. స్వంత అవసరాలకి, సౌఖ్యాలకి ఉపయోగపడని డబ్బు రేపు ఎంత ఉంటే మాత్రం ఎందుకు? చనిపోయేటప్పుడు మనతో ఏమీ తీసుకెళ్ళలేం కదా?' అంటూ దీని విషయమై చర్చకు వచ్చినపుడు వాదించిందోయ్. ఆలోచిస్తే, ఆ వాదనలో ఉన్న బలం తెలియవచ్చింది. 'సరే' అన్నాను. విశాలాక్షి ఎంత సంబరపడిందో! డబ్బు మదుపు పెట్టడం, కాంట్రాక్టర్ చేత సరిగ్గా పనిచేయించడం అంతా విశాలాక్షి చేస్తోంది. ఇక నాకు అభ్యంతరం ఎందుకుంటుంది? ఏమంటావ్?" అనడిగేడు విశ్వనాథం.

రంగనాథ్ గొంతుకలో పచ్చి వెలక్కాయ పడినట్లయింది. విశాలాక్షి ఆలోచనల్లో వెలితి ఏమీ కనిపించడం లేదు. అయినా ఆశ చావక "అదిసరే అనుకుందాం నాన్నా. కాని ఎన్నాళ్ళు ఇలా? చివరికి ఏమౌతుంది?" అని గొణిగేడు రంగనాథ్.

"నీ సందేహం, దాని వెనుక దాగున్న భయం అర్థమయిందోయ్. రేపటి గురించి ప్లేన్లు అనవసరం అనుకుంటున్నా... నన్ను బలవంత పెట్టిందోయ్. ఆమె మాటకి విలువ ఇచ్చి ఆమె సలహామేరకు ఈమధ్యనే వీలునామా రాసేను. నువ్వు సునంద కంగారు పడనవసరంలేదు. నా

తరువాత ఈ ఇల్లు, బేంక్‌లో ఉన్న డిపాజిట్లు, ఎక్కౌంట్‌లో ఉన్న డబ్బు అన్నీ నీకే చెందుతాయి. ఆ వీలునామా నకలు నీకిద్దామనే తీసి ఉంచేను. విశాలాక్షికి దాదాపు నాకు వచ్చినంతే పెన్షన్ వస్తుంది. విజయానగర్ కాలనీలో ఆమెకి ఉన్న ఇంటి నుంచి అద్దె వస్తుంది. అమెరికాలో ఉన్న ఆమె కూతురికి తల్లి ఆస్తి ఏమీ అక్కరలేదట. విశాలాక్షికి చెప్పుకోతగ్గ ఖర్చులేమీ లేవు" అన్నాడు విశ్వనాథం.

"నాన్నా, అన్ని ప్రశ్నలకి నీ దగ్గర సమాధానాలు ఉంటాయి. అయితే నీ పద్ధతి ఈ దేశంలోని రివాజులకి వ్యతిరేకంగా లేదూ? " అన్నాడు రంగనాథ్.

"తెలుగులో -ఎద్దు పుండు కాకికి నొప్పా? - అన్న ఒక సామెత ఉంది. మన పాత రివాజులలో నాలాంటి వాళ్ళు కొడుకులు, మనవళ్ళ మధ్య గౌరవంగా జీవితాలని వెళ్ళదీసేవారు. ఇప్పుడు అలా నడుస్తోందా? అన్ని కుటుంబాలలో కాకపోవచ్చు, కాని చాలా కుటుంబాల్ని చూస్తే 'మా పిల్లలు అమెరికాలో, ఇంగ్లండ్‌లో మంచి హోదాలో ఉన్నారు, గొప్ప పదవులు అలంకరించేరు' అని బైటకి గర్వంగా చెప్పుకుని లోలోపల బాధతో కుళ్ళుకుపోతూ, ఒంటరితనంతో ఏడ్చేవాళ్ళే. పిల్లల్ని పెద్ద చేయడం మానవ ధర్మం. పెద్దయేక పెద్దల గురించి పట్టించుకోకుండా పిల్లలు తమదారిన తాము వెళ్ళడం జంతు ధర్మం. నీ భవిష్యత్తు కోసం నువ్వు దూరం వెళ్ళేవు. చాచిన మా చేతుల్ని మెల్లిగా ముడుచుకున్నాం. నీ భవిష్యత్తు కోసం నువ్వు చూసుకోవడంలో తప్పేమీ లేదు. అది నీ ఇష్టం అని సరిపెట్టుకున్నాం. ఇప్పుడు నువ్వు వచ్చి 'ఇలా బ్రతకండి, ఇది నా కోరిక' అని నువ్వు అనడం సబబేనా? అలా చేయడం నాకిష్టమయితే ఏ సమస్యా లేదు. అలా లేనపుడే వస్తుంది చిక్కు. ఒక ప్రశ్నకి సమాధానం

## నవంబరు - 2012
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **కలశపూడి శ్రీనివాస్**
   -విక్రంపురి కాలనీ, సికింద్రాబాద్
2. **ఆర్. శివకుమార్**
   - ప్రసాదంపాడు, విజయవాడ
3. **జి. విజయశ్రీ**
   - అరసవిల్లి, శ్రీకాకుళం జిల్లా
4. **సుందర్ రామ్‌రెడ్డి**
   - అసద్‌నగర్, నల్గొండ
5. **కొక్కెరగడ్డ శ్రీదేవి**
   - మానేపల్లి, తూ. గో. జిల్లా

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. ఆరావళి | 6. 2006 |
| 2. మధు | 7. బాటసారి |
| 3. తిలక్ | 8. జో |
| 4. సూర్య | 9. మహవీర్ |
| 5. బ్రెస్ట్ కేన్సర్ | 10. బ్రిజ్ మోహన్ |

చెప్పు రంగనాథ్. జీవితమంతా నీయిష్ట ప్రకారమే నడిస్తే మాకు ఇష్టమయినట్లు ఎప్పుడు చేస్తాం? 'ఏం చేయడం? ', 'మన పిల్లలు, మన మనవలు' అని తమని తాము సమర్థించుకుంటూ లేదా మభ్యపెట్టుకుంటూ ఉన్న కాస్త జీవితాన్ని కొందరు అసంతృప్తితో నెట్టేస్తారు. నాకున్న ఈ కాసిన్ని రోజులు, నాకోసం, నాకిష్టమయినట్లు గడుపుతాను. పాలుకాచి టేబిల్ మీద ఉంచితే సాయంకాలమయేసరికి అవి విరి

గిపోతాయి. కాని పాలు కాచేక ఉదయం కాస్త తోడు వాటికి వేస్తే సాయంకాలమ యేసరికి కమ్మని పెరుగవుతుంది. నీకు సుమతీ శతకం పద్యాలు జ్ఞాపకం ఉన్నాయా?

వరిపంట లేని యూరును

దొరయుండని యూరు, తోడు దొరకని తెరవున్

ధరను పతిలేని గృహమున్

నరయంగా రుద్రభూమి యనదగు సుమతీ!"

అంటూ బొంగురుపోయిన గొంతుకతో సుమతీ శతకంలో పద్యం చదివేడు విశ్వనాథం.

రంగనాథ్ ఏమీ మాటలాడలేదు. విశ్వనాథం తిరిగి మొదలుపెట్టేడు.

"విశాలాక్షీ ఒంటరిదే. మా రెండు బ్రతుకు గీతలూ ఒక దానికి అడ్డంగా ఇంకొకటి కేవలం యాదృచ్ఛికంగా పడగానే మా ఇద్దరి ఒంటరితనం పటాపంచలయింది. విశాలాక్షి తోడు నా ఒంటరి జీవితంలో ఒక కొత్త మార్పుని తెచ్చింది. మరొకటి చెప్పు రంగనాథ్. నా ఈ పెద్ద ఇల్లు హైదరాబాద్ జూబ్లీహిల్స్‌లో కాకుండా ఏ శృంగవరపు కోటలోనో, లేదా పాయకరావుపేటలోనో ఉంటే నా గురించి, ఈ ఇంటి గురించి ఇంత తీవ్రంగా మీరు ఆలోచించేవారా? " అనడిగేడు విశ్వనాథం హీనస్వరంతో.

దాదాపు నలభై ఏళ్ళ క్రితం స్నానం చేయించడానికి తండ్రి తన బట్టలు ఊడతీసినపుడు తనలో ముప్పిరికొన్న సిగ్గులా ఈనాటి తండ్రి మాటలు తనని వివస్త్రుడిని చేసినట్లు అనిపించి సిగ్గుతో తలవంచుకుని పడక గదిలోనికి వెళ్ళి చీకటిని పట్టించుకోకుండా పరుపు మీదికి వాలేడు రంగనాథ్.

హాలులో నిశ్శబ్దం, గోడలలోంచి, నేల మీద నుంచి, మీద చూరు నుంచి తన్నుకు వస్తూ, గదిలో వాతావరణాన్ని, ఊపిరితీయలేనంత దట్టంగా, కర్కశంగా నలిపేస్తుంటే, బైట కుర్చీలో కూర్చుని దాదాపు ఒక గంటసేపు తండ్రీకొడుకుల మధ్య నడిచిన సంభాషణని విన్న విశాలాక్షి మెల్లిగా లేచింది. ఎంతోకాలంగా నిబిడీకృతమై లోపల పేరుకుపోయిన ఆవేదన బైటపడ్డాక విశ్వనాథం మనస్సు శాంతించినా, నిశ్శబ్దంగా ఉన్న గదిలో అతని బలమైన ఊపిరి శబ్దం చేస్తోంది. తలుపు తీసుకుని లోపలికి ప్రవేశించబోతూ ద్వారం దగ్గర నిలబడింది విశాలాక్షి. అలికిడి విని తలుపువేపు చూసేడు విశ్వనాథం.

ఎలక్ట్రిక్ బల్బ్ వెలుతురు విశ్వనాథం కళ్ళలో పడుతోంది. విశ్వనాథం కంటిలో తిరిగిన నీరు మెల్లిగా ఇంకిపోయినా ఇంకా కనుపాపలమీద పొర తచ్చాడుతుంటే లోపలికి వస్తున్న విశాలాక్షి విశ్వనాథంకి స్పష్టంగా కనిపించడం లేదు. విశాలాక్షి లోపలికి వచ్చిందని గ్రహించిన విశ్వనాథం మనసు, చల్లగాలి తగిలి వర్షించిన మేఘంలా రోదించి కంటిలోనికి నీరు తెప్పించింది. ఒక కన్నీటి చుక్క క్రిందకి జారుదామా? అని సంశయిస్తుంటే వెనక నుంచి విశ్వనాథం చుట్టూ తన రెండు చేతులని ఆప్యాయంగా పెనవేసి దగ్గరగా లాక్కుంది విశాలాక్షి.

★ ★ ★

విమానంలో కూర్చుని సీట్‌బెల్ట్ పెట్టుకుంటున్న రంగనాథ్ గుండె బరువుగా ఉంది. సీట్‌బెల్ట్ ఎలా పెట్టుకోవాలో, దానిని ఎలా ఊడతీయాలో, విమానంలో ఒత్తిడి తగ్గితే ఆక్సీజన్ మాస్క్‌లు వస్తాయని, ఇతర హెచ్చరికలిస్తున్న ఎయిర్ హోస్టెస్‌ని గమనించకుండా రంగనాథ్ కళ్ళు మూసుకున్నాడు.

'టేక్సీలో వెళతాను. ఎయిర్ పోర్ట్‌కి, మీకెందుకు శ్రమ? ' అని తను వారిస్తున్నా

వినకుండా తండ్రి, విశాలాక్షి ఎయిర్‌పోర్ట్‌కి వచ్చి తన సూట్‌కేస్‌ని చెక్ చేసేంత వరకు ఆగేరు. ఆ తంతు పూర్తయేసరికి రాత్రి పన్నెండు గంటలయింది. విజిటర్స్ ప్రాంగణంలో నిలుచున్న తండ్రిని, విశాలాక్షిని చూసి చేయి ఊపుతూ వాళ్ల దగ్గరికి వచ్చేడు తను. "ఇహ మీరు ఇంటికి వెళ్ళండి నాన్నా. ఇప్పటికే చాలా ఆలస్యమయింది. మీరు త్వరగా నడకకి లేస్తారు కదా? నిద్ర సరిపోదు" అన్నాడు తను.

"నువ్వు సెక్యూరిటీలోనికి వెళ్ళగానే మేం వెళ్ళిపోతాం" అన్నాడు తండ్రి.

"ఒక రకమైన గాడిలో పడి, నా బాధ్యత విస్మరించి నీ గురించి ఆలోచించనందుకు నన్ను క్షమించు నాన్నా" అంటూ సూటిగా తండ్రి కళ్ళలోనికి చూడకుండా వెనుతిరుగుతున్న కొడుకు చేతిని తండ్రి ఆప్యాయంగా నొక్కి వదిలేడు. తండ్రి కళ్ళలో నీళ్ళు చిట్లి ఉంటాయని తనకి తెలుసు. అది చూసే మనస్థయిర్యం లేక వడివడిగా అడుగులు వేసి సెక్యూరిటీ ద్వారం దగ్గర మలుపు తిరగబోతూ వెనక్కి తిరిగి చూసేడు రంగనాథ్.

తండ్రి, విశాలాక్షి చేయి ఊపుతుంటే తనూ చేయి ఊపి సెక్యూరిటీ ద్వారంలోనికి అడుగుపెట్టేడు. అది జరిగి గంటన్నర అయినా గొంతు ఇంకా పూర్తి స్వాధీనంలోకి రాలేదు. నోరంతా పొడిగా ఉంది. 'శక్తి, సామర్థ్యం తగ్గిపోతున్నా నిబ్బరంగా రోజుల వెళ్ళదీస్తున్న తండ్రి,

నిశ్చలంగా ఉన్న విశాలాక్షి ఒకరికొకరు ఆసరాగా నిలవడం ఎంత అదృష్టం! జన్మనిచ్చి, పెంచి, పెద్ద చేసి మధ్య వయస్సులో నేలమీద బోర్లా పడబోతుంటే చేయి అందిచ్చి ఆదుకున్న తండ్రికి తనేమీ చేయలేదు. ఇది ఎంతో దారుణం!' అని మధన పడుతున్న రంగనాథ్‌ని కుదిపి "స్పెషల్ మీట్ ఫర్ రంగనాథ్" అంటూ ట్రే అందివ్వబోయింది ఎయిర్ హోస్టెస్.

"థాంక్యూ మేడమ్, కాని నాకు ఆకలిగా లేదు" అంటూ రంగనాథ్ తన ఆలోచనల్లోంచి తెప్పరిల్లేడు.

★ ★ ★

శాన్‌ఫ్రాన్సిస్కో విమానాశ్రయం నుంచి రంగనాథ్ సునందలు ఇంటికి వచ్చి ఒక గంట గడిచింది. రంగనాథ్ కారు నడుపుతున్నపుడు, ఇల్లు చేరిన తరువాత హైదరాబాద్ విషయాలు చర్చించకుండా సూట్‌కేస్‌లు తెరచి ఆఫీస్ కాగితాలు బైటికి తీసి వాటిని సర్దేడు. రంగనాథ్ మొహంలో ఉదాసీనత, గాంభీర్యం కొట్టొచ్చినట్లుండడంతో సునందకి సంభాషణ ఎలా మొదలు పెట్టాలో తెలియడం లేదు.

"స్నానం చేసి వస్తాను" అంటూ రంగనాథ్ బాత్రూం వేపు కదలబోతుంటే, నిగ్రహించుకోలేక "అసలు విషయం ముందు చెప్పాక స్నానానికి వెళుదురుగాని ఇల్లు అమ్మకం ఏమైంది?" అనడిగింది సునంద.

"ఆ ఇల్లు మా నాన్నది. దానిని ఏం చేయాలో, తను ఎలా జీవించాలో ఆయనే నిశ్చయించుకుంటారు"

"ఆ ఇల్లు ఆయనది కాదని ఎవరంటున్నారు? కాని ఆయన కొడుకైన మీకు దాని మీద హక్కు ఉంది"

"అది ఆయన స్వంతార్జితం. దాని మీద న్యాయపరంగా నాకు ఏ విధమైన హక్కు లేదు"

"మీకు మతిగానీ చలించిందా? మనకి ఆ ఇంటిమీద హక్కులేక పోవడమేమిటీ? విమానంలో బాగా తాగి వచ్చేరా?"

"మన పెళ్ళయి దాదాపు ఇరవై ఐదేళ్ళయింది. కారణాలు ఏమైనా, పెళ్ళయిన దగ్గర నుంచి నువ్వు చేసినదాన్ని గుడ్డిగా సమర్థిస్తూ వచ్చేను. ఇది సరి అయినదా? కాదా? అని తర్కించుకోకుండా పొరపాట్లు చేసేను"

"మీ వాలకం చూస్తుంటే 'ఇల్లు అమ్మను' అన్న మీ నాన్న మాటకి గంగిరెద్దులా తల ఊపి వచ్చేరు. అంతేనా? మనకి వస్తుందనుకున్న డబ్బు రాదు. మనం ఈ బీద బ్రతుకులు బ్రతకవలసిందే"

"మనది కాని ఇంటిని అమ్ముకుని ఆ డబ్బుని కబ్జా చేసుకుందామనుకున్నావు. అది జరగదు. 'ఆ ఇల్లు అమ్మేద్దాం' అంటూ నసపెట్టి ఆశ పురుగుని నా మెదడులోనికి ప్రవేశ పెట్టేవు. జీవితమంతా తండ్రిని విస్మరించిన నాకు, నా తండ్రి కట్టించుకున్న ఇంటి మీద న్యాయపరంగా కాని, నైతికంగా కాని పిసరంత కూడా హక్కులేదు. మన బాధ్యత మనం నిర్వహించకుండా హక్కుల గురించి మాట్లాడతావెందుకు? ఆయనంటే నిర్లిప్తంగా, ఉదాసీనంగా ప్రవర్తించిన నిన్ను, నిన్ను సమర్థించిన నన్ను నా తండ్రి క్షమించగలడేమో కానీ, నన్ను నేను క్షమించుకోలేను. యాదృచ్ఛికంగా ఆయనకి ఒక మంచి తోడు దొరికింది. ఇక మీదట ఎపుడూ ఆయనంటే కపట ఆసక్తి ప్రదర్శించడం కాని, ఇంటి గురించి ప్రస్తావించడం కాని చేయకు" అంటూ విసురుగా స్నానాల గదిలోనికి వెళ్ళిపోయాడు రంగనాథ్.

కట్టుకున్న పేకముక్కల సౌధం కూలిపోగా, అక్కడికక్కడే సోఫాలో కూలబడింది సునంద. ©

# కాలాతీతం

జాన్ గాల్స్‌వర్తీ



1867-1933



# ది మాన్ ఆఫ్ ప్రాపర్టీ

**కో**ట్లకు పడగెత్తింది ఫోర్సైట్ కుటుంబం. 1886లో జూన్ నెల మధ్యాహ్నం లండన్‌లోని తమ ఇంట్లో సమావేశమైనారు కుటుంబ సభ్యులంతా. ఇంటిపెద్ద ఓల్డ్ జోలియన్ ఫోర్సైట్ మనవరాలు జూన్ (ఆమె పేరది) నిశ్చితార్థం. ఒక పేద ఆర్కిటెక్ట్ ఫిలిప్ బోసినీతో జరుగుతున్న సందర్భమది. ముసలివాళ్లెవరికీ ఈ సంబంధం ఇష్టం లేదు. పేదవాళ్లను నమ్మటానికి వీల్లేదు. వాళ్ల కళ్లెప్పుడూ సంపన్నుల డబ్బు మీదే ఉంటాయి.

అయితే, వాళ్లకీ అనుమానం రావటానికి కారణం లేకపోలేదు. తన పితామహుని ఆస్తికి ఏకైక వారసురాలు జూన్. జూన్ తండ్రి, తన భార్య (జూన్ తల్లి) మరణం తర్వాత, ఒక గవర్నెస్‌తో లేచిపోయి కుటుంబం పరువు తీశాడు. ఈ అవమానం చాలదన్నట్టుగా, అతడో ఆర్టిస్టుగా- అదీ పేరు ప్రఖ్యాతులు లేని అనామక ఆర్టిస్టుగా బతికాడు. కోటీశ్వరులు కళాపోషకులు కావాలి గాని స్వయంగా కళాకారులు కాకూడదు. కళాకారుడు కావడమంటే వంశానికి తలవంపులు తేవటమే. అదీ ఓల్డ్ జోలియన్ ఫోర్సైట్ అభిప్రాయం.

ఇప్పుడేమో జూన్‌కు పెళ్లి నిశ్చయమైంది. మనవరాలు కూడా వెళ్లిపోతే, రాజభవనం లాంటి విశాలమైన ఈ ఇంట్లో, తన కుటుంబానికి జరిగిన అవమానానికి కుమిలిపోతూ ఒంటరిగా, భారంగా చివరి రోజులు గడపక తప్పదని దిగులు పడుతున్నాడు ముసలాయన. అనేక సంవత్సరాలుగా కొడుకు మొహం కూడా చూడలేదు ఓల్డ్ జోలియన్. ఒకసారి, చివరిసారి కూడా కావచ్చు- అతణ్ణి చూడాలనిపించింది. ఎంగేజ్‌మెంట్ సెరెమనీ ముగించి, కొడుకు సభ్యుడిగా ఉన్న క్లబ్‌కి బయల్దేరాడు ఓల్డ్ జోలియన్.

స్వచ్ఛందంగా సంపదను వదులుకున్న

## కొన్రాడ్‌కు మార్గదర్శి గాల్స్‌వర్దీ

సంపన్న కుటుంబంలోనే పుట్టాడు జాన్ గాల్స్‌వర్దీ. తండ్రి ఒక ప్రముఖ లాయర్. ప్రతిష్టాత్మకమైన హారో పబ్లిక్ స్కూల్, న్యూ కాలేజ్‌లో చదువుకుని, ఆక్స్‌ఫర్డ్‌లో ఉన్నత విద్యనభ్యసించాడు. ఆ తర్వాత అటార్నీగా ప్రాక్టీస్ ప్రారంభించాడుగాని, 'లా' పట్ల పెద్దగా ఆసక్తి కనపర్చలేదు.

లోకాన్ని చూడాలని కొన్నేళ్లపాటు సముద్ర ప్రయాణాలు చేశాడు. అలాంటి ఒక ప్రయాణంలో ఆఫ్రికాను దర్శించినప్పుడు, అక్కడ యువకుడైన భవిష్యత్ రచయిత జోసెఫ్ కొన్రాడ్ ('హార్ట్ ఆఫ్ డార్క్‌నెస్' రచయిత)తో పరిచయమేర్పడింది. ఇద్దరూ ఇంచుమించు ఏక కాలంలో రచనలు ప్రారంభించారు. అప్పటికి కొన్రాడ్ షిప్పులో ఉద్యోగిగా పనిచేస్తున్నాడు. సరదాగా తన తొలి నవల 'ఆల్మేయర్స్ ఫాలీ' రాస్తున్నాడు. రాతప్రతిని చదివి, గాల్స్‌వర్దీ యువరచయితను ప్రోత్సహించాడు. "ఆనాడు గాల్స్‌వర్దీ పరిచయం కలగకపోయినట్లయితే, తాను ప్రొఫెషనల్ రచయితను కాలేకపోయే వాడిని" అన్నాడు కొన్రాడ్.

1897-1901ల మధ్య గాల్స్‌వర్దీ, 'జాన్‌సింజాన్' అనే కలం పేరుతో అనేక కథలూ, నవలలూ రాసినా వాటికి పెద్దగా గుర్తింపు రాలేదు. 1906లో వివాహం తర్వాత, తన మొదటి మాస్టర్‌పీస్ 'ది మాన్ ఆఫ్ ప్రాపర్టీ' (ఆస్తిపరుడు) ప్రచురించాడు గాల్స్‌వర్దీ. ఆ నవల అతనికి విశేష ఖ్యాతినార్జించి పెట్టింది.

---

కొడుకు చిరుద్యోగిగా లాయడ్స్ కంపెనీలో పనిచేస్తున్నాడు. తీరికవేళల్లో వాటర్ కలర్ బొమ్మలు వెయ్యటం అతడి హాబీ. రహస్యంగా ఆ బొమ్మలు సేకరించడం ఓల్డ్ జోలియన్ సరదా. పేదరికంలో బతుకుతున్నా కొడుక్కు తన మీద కోపం లేదని తెలిసింది. గవర్నెస్ వల్ల పుట్టిన పిల్లలు హోలీ, జోలీలను చూసి, కొడుకు మంచి పనే చేశాడనిపించింది. ఇంట్లో విలాస వస్తువులేమీ లేకపోయినా, లోటు లేకుండానే సంసారం గడుస్తున్నట్టుంది. కొడుకును సంపదకు దూరం చేసి తను తప్పు చేశాడేమోననే భావనతో ఉక్కిరిబిక్కిరవుతాడు ఓల్డ్ జోలియన్. కాని, ఇప్పుడు ఇన్నాళ్లకు జరిగినవన్నీ మరిచి, కలిసిపోవటం సాధ్యమా?

ఇక, మరోవైపు, జూన్‌తో సంబంధం ఖాయమైంది గనక, ఫోర్సైట్ కుటుంబ సభ్యులందర్నీ కలిసి, తననుతాను పరిచయం చేసుకోవలసిన బాధ్యత తనమీదుందని గుర్తించాడు ఫిలిప్ బోసినీ. ఫోర్సైట్‌లందరూ లాయర్లే. బాగా సంపాదించారు. విలాస జీవితానికలవాటుపడ్డారు.

తెలివైన పెట్టుబడుల ద్వారా వాళ్ల ఆస్తులు రోజురోజుకూ పెరుగుతూనే ఉన్నాయి. ఆర్టన్నా, ఆర్టిస్టులన్నా వాళ్లకెవరికీ గౌరవం లేదు. కళ గురించి మాట్లాడటమంటే వాళ్లకో పరువుతక్కువ పని. ఇటీవలే వాళ్లలో కొందరు 'ఆర్టు'లో పెట్టుబడులు కూడా లాభసాటి వ్యాపారమేనని మాత్రం గుర్తించారు.

బోసినీకి ఆర్కిటెక్చర్ అంటే ప్రాణం. దానికోసమే బతుకుతున్నాడతడు. డబ్బు సంపాదనే ధ్యేయంగా బతుకుతున్న ఫోర్సైట్‌లతో తను పంచుకోగలిగిన విషయాలే లేవు. ఓల్డ్ జోలియన్ మేనల్లుడు, సోమ్స్ తనను తాను కళాపోషకుణ్ణనీ, ఆర్ట్ కలెక్టర్‌ననీ మిడిసిపడుతుంటాడు. అతడి కలెక్షన్‌లోని అపురూప కళాఖండం అతడి భార్యే. పేరు ఇరీన్. ఆమె అందం బోసినీని ఆకర్షిస్తుంది. ఫోర్సైట్‌ల ఇంట్లో జరిగే డిన్నర్లు, టీపార్టీల వల్ల, ఆమెతో పరిచయం పెరుగుతుంది.

అప్పటికి ఈ నవలను పొడిగించే ఉద్దేశం లేద తనికి. ధన వ్యామోహం మంచివాళ్లను కూడా ఎలా దుష్టులుగా మారుస్తుందో చూపటానికి చేసిన చిన్న ప్రయత్నమది. ధనిక కుటుంబాల పతనాన్ని శాస్త్రీయ దృక్పథంతో చిత్రించిన రచన. భౌతిక సుఖలాలసతలో శలభాల్లాగా చిక్కుబ డిన ఫోర్సైట్ కుటుంబగాథ రచయితనూ, పాఠకులనూ ఎంతగా ప్రభావితం చేసిందంటే, దీని ఆధారంగా మూడేసి గొలుసు నవలల నవ లాత్రయం వెలువడింది. అదే Forsyte Saga. ఇవిగాక లండన్ రంగస్థలం మీద సంచలనం సృష్టించిన నాటకాలు 'ది సిల్వర్ బాల్స్' (1906), స్ట్రైఫ్ (1909), కార్మిక సంఘాల గురించి 'జస్టిస్' (1922), 'లాయల్టీస్' (1922) కూడా రచించాడు గాల్స్‌వర్తీ.

కోర్టులు అబద్ధాలకూ, బూటకాలకూ నిలయ మని రుజువు చేసిన 1910 నాటి నాటకం 'జస్టిస్' గాల్స్‌వర్తీ సాహిత్య జీవితానికి మకుటం లాంటిది. అనేక ఇతర నాటకాలకు, రచనలకు ఇది ప్రేరణ. సహజంగానే తెలుగులో కూడా దీని ప్రతిధ్వనులున్నాయన్న మాట నిజం. చట్టం నేర స్తులను రక్షిస్తుంది, అమాయకులనే శిక్షిస్తుంది అన్నది దీని ఇతివృత్తం.

రష్యన్ రచయితలు టాల్‌స్టాయ్, తుర్గెనేవ్, అమెరికన్ రచయిత డ్రీజర్‌లను ఆకళింపు చేసు కున్న గాల్స్‌వర్తీ రచనల్లో మేధోమథనం ఎక్కువ. ఇంచుమించు అన్ని కథలూ విషాదాంతాలే.

తొలి ప్రపంచ యుద్ధం తర్వాత తనను నైట్ (knight) చేస్తామన్న ప్రభుత్వ ప్రతిపాదనను గాల్స్‌వర్తీ తిరస్కరించాడు. అయితే 1932లో నోబెల్ బహుమతిని మాత్రం ఆ మహారచయిత అంగీకరించాడు. మరణం తర్వాత, అతడి కోరిక మేరకు చితాభస్మాన్ని గాలిలోకి వెదజల్లారు.

సోమ్స్, ఇరీన్‌లది అన్యోన్య దాంపత్య మేమీ కాదని ఇంట్లో అందరికీ తెలుసు. నిజానికి సోమ్స్‌కు భార్యపట్ల గౌరవమూ లేదు, ప్రేమా లేదు. ఆర్ట్ కలెక్టర్‌గా తాను భారీగా ఖర్చు చేస్తున్నట్టుగానే, ఆమె మీద కూడా కొంత ఇన్వెస్ట్ చేశాడు. అది లాభ సాటి ఇన్వెస్ట్‌మెంట్ అని గర్వి స్తాడు సోమ్స్. పెళ్లినాడే, తనకు పూర్తి స్వేచ్ఛ కావాలని షరతులు విధించింది ఇరీన్. అయితే, ఆ షరతు అమలు చేయవలసిన రోజు వస్తుం దని ఊహించలేదు సోమ్స్. తన భర్తలాంటి మాన్ ఆఫ్ ప్రాపర్టీ పట్ల క్రమంగా జుగుప్స పెంచుకుంది ఇరీన్. భార్యాభర్తలు వేర్వేరు గదుల్లో పడుకుంటున్నారన్నది కూడా బహిరంగ రహస్యమే.




సర్దుబాటు చర్యల్లో భాగంగా, భార్యను ఎలాగైనా సంతోషపెట్టాలని ఆమె కోసం ఓ పెద్ద బంగళా కట్టించాలనుకుంటాడు సోమ్స్. లండన్ పొలిమేరల్లోని రాబిన్‌హి ల్‌లో స్థలం కొని, ఫిలిప్ బోసినీ ఆర్కిటె క్టుగా భవన నిర్మాణం ప్రారంభిస్తాడు. తన ప్రతిభ నిరూపించుకోవటానికో అవ కాశం కల్పిస్తున్నాను అని తృప్తిపడతాడు సోమ్స్. కాబోయే భర్తకు మంచి పేరొస్తే జూన్ సంతోషిస్తుంది. తన భార్య జూన్‌కు ప్రాణ స్నేహితు రాలు. అంటే, బోసినీకి పనిక ల్పించటం ద్వారా ఇద్దర్నీ తృప్తి పరచవచ్చు అని భా విస్తాడు.

అయితే, సోమ్స్ సదుద్దే శంతో తీసుకున్న ఈ నిర్ణ యమే ఘర్షణకు దారితీసింది. ఆర్కిటెక్చర్ గురించి సోమ్స్‌కున్న సాంప్రదాయిక అభిప్రాయాలతో విభేదిస్తాడు బోసినీ.

ఖర్చుకు వెనకాడకుండా ఒక అద్భుత కళాఖండాన్ని నిర్మించటం అతడి

ఆశయం. కాని, డబ్బే పరమావధిగా బతికే సోమ్స్ ఫోర్సైట్, బడ్జెట్ మించకుండా నిర్మాణం ముగించాలంటాడు. కాని బోసినీ జగమొండి. అనేక వాదోపవాదాల తర్వాత, తన మాటే నెగ్గించుకుంటాడు. ప్లానింగ్‌లోనూ, నిర్మాణంలోనూ అతడికి ఇంచుమించు పూర్తి స్వేచ్ఛ ఇస్తాడు సోమ్స్.

ఒకనాడు, సోమ్స్ బంధువొకతను, నిర్మాణంలో ఉన్న ఇంటిని చూపించటానికి ఇరీన్‌ను ఆహ్వానిస్తాడు. అక్కడ, ఫిలిప్ బోసినీతో కబుర్లు చెబుతూ, తనకు తెలియకుండానే పీకల్లోతు ప్రేమలో పడిపోతుంది ఇరీన్. తప్పని తెలిసినా, అతడూ ఆమె లేకుండా బతకలేననుకుంటాడు. అందరి కళ్లూ గప్పి, ఇద్దరూ రహస్య ప్రదేశాల్లో కలుసుకుంటారు గానీ, త్వరలోనే జూన్‌తో సహా అందరికీ ఈ విషయం తెలిసిపోతుంది. అపర కుబేరుల ఇంట్లో ఇది దాచాలన్నా దాగని స్కాండల్. తన భార్య తననెందుకు ప్రేమించటంలేదో, మరొకర్ని ఎందుకు ప్రేమిస్తోందో గ్రహించలేని మూర్ఖుడు సోమ్స్. ఆ నిజం తెలుసుకుంటే అతడి అహం దెబ్బ తింటుంది మరి. కోట్లు ఖర్చుపెట్టి స్త్రీ ప్రేమను పొందలేని సోమ్స్ లాంటి వాళ్లెప్పుడూ అర్థం చేసుకోలేరు.

భవన నిర్మాణం పూర్తి కావచ్చింది. అప్పటికే అంచనాకు మించి ఖర్చయింది. ఆర్థిక కారణాలతో, బోసినీ, సోమ్స్ ఒకరి మీద ఒకరు నిందలు వేసుకుంటారు. కలహించుకుంటారు. బడ్జెట్ దాటొద్దంటాడు సోమ్స్. అందంగా తీర్చిదిద్దటానికి ఎంతైనా ఖర్చుపెట్టాల్సిందే అంటాడు బోసినీ.

ఇరీన్, బోసినీల 'రంకు' గురించి తెలిసిన ఓల్డ్ జోలియన్, లోలోపలే కుమిలిపోతాడు. కాని తను నిస్సహాయుడు. తన సలహాలు, సూచనలను వినేవాళ్లెవరని! కొడుకూ, అతడి రెండో భార్యా (గవర్నెస్) మనవరాళ్ళని చూసి కనీసం వాళ్ళైనా సుఖంగా ఉన్నందుకు సంతోషిస్తాడు.

ఇంటి నిర్మాణం పూర్తవుతుంది. తెలుసుకోదలచుకోకపోయినా, ఇరీన్, బోసినీల వ్యవహారం అందరికీ తెలుస్తుంది. ఇప్పుడు వాళ్లు బహిరంగంగానే కలిసి తాగుతున్నారు. అవమానంతో, నిర్మాణ వ్యయం పెంచాడనే మిషతో బోసినీ మీద కేసు వేస్తాడు సోమ్స్. బోసినీ గనక వ్యాజ్యం ఓడిపోతే, సోమ్స్‌కు పరిహారం చెల్లించక తప్పదు. అసలే పేదవాడు, అంత డబ్బెక్కడి నుండి తెస్తాడు? అప్పు చేస్తే దివాళా తియ్యక తప్పదు. ఈ విషయం తెలిసి, ఇరీన్ కొత్త ఇంటికి మారటానికి నిరాకరిస్తుంది. తన గది తలుపు వేసుకుని ఎవర్నీ లోపలికి రానివ్వదు. అసూయతో రగిలిపోయిన సోమ్స్ బలవంతంగా తలుపు తెరిచి భార్యను లొంగదీసుకొంటాడు.

సోమ్స్ వేసిన కోర్టు కేసులో తనవైపు వాదనలు వినిపించాడు బోసినీ. విచారణ రోజున జూన్ కోర్టుకెడుతుంది గాని, అక్కడ తన కాబోయే భర్త కనిపించడు. అతడి అపార్ట్‌మెంట్‌కు పోతుంది. కాని అక్కడా అతడు లేకపోవటంతో ఆందోళన చెందుతుంది. అయితే, అప్పుడే అక్కడికి ఇరీన్ వస్తుంది. తను సోమ్స్‌తో తెగతెంపులు చేసుకున్నాని చెబుతుంది. ఇద్దరు స్నేహితురాళ్లూ తీవ్రంగా వాదులాడుకొంటారు.

మరునాడు పోలీసులు ఒక విషాద వార్త చేరవేస్తారు. లండన్ పొగమంచులో, ప్రమాదవశాత్తూ లారీకింద పడి మరణించాడు బోసినీ. అది ఆత్మహత్య అనడంలో సందేహం లేదు. అంతక్రితంరోజు అతడు రోడ్లమీద పిచ్చివాడిలా తిరుగుతూ కనిపించాడు. సోమ్స్, భార్యమీద 'అత్యాచారం' చేశాడని తెలిసి హతాశుడై ఈ అఘాయి

త్యానికి ఒడిగట్టాడు. ఆత్మహత్య గురించి తెలిసిన ఇరీన్, బాధను దిగమింగుకుని సోమ్స్ చెంతకు తిరిగి వస్తుంది. రాబిన్‌హిల్‌లో సోమ్స్ కట్టించిన ఇంటిని కొనుగోలు చెయ్యమని ఓల్డ్ జోలియన్‌ను అర్థిస్తుంది జూన్. బోసినీ కట్టిన ఆ ఇంట్లో సోమ్స్, ఇరీన్ ఎప్పుడూ కాపురం చెయ్యలేరని ఆమెకు తెలుసు.

నవల చివర "ఇండియన్ సమ్మర్ ఆఫ్ ఎ ఫోర్సైట్" అనబడే అధ్యాయంలో మరి కొన్ని విషయాలు స్పష్టం చేస్తాడు రచయిత. ఓల్డ్ జోలియన్‌కు ఇప్పుడు ఎనభై అయిదేళ్లు. రాబిన్‌హిల్‌లో తన శేష జీవితం గడుపుతుంటాడు. ఇంకా అవివాహితగానే ఉన్న జూన్ విహారయాత్రలు చేస్తుంటుంది. ఒకనాడు, రహస్యంగా రాబిన్‌హిల్‌కు వచ్చిన ఇరీన్, తను ఇక శాశ్వతంగా సోమ్స్‌ను వదిలేశానని ఓల్డ్ జోలియన్‌కు చెబుతుంది. పిల్లలకు సంగీతం నేర్పిస్తూ ఎంతో కొంత సంపాదించుకుంటున్నది. తీరిక సమయమంతా దాతృత్వ కార్యకలాపాలలో గడుపుతున్నది. క్రమంగా, ఆమె ఓల్డ్ జోలియన్ అభిమానం సంపాదిస్తుంటుంది. బోసినీని జూన్ నుండి దూరం చేసినందుకు, ఇరీన్ మీద కోపం పెంచుకున్న ఓల్డ్ జోలియన్ చివరికామెను క్షమిస్తాడు. తన వీలునామాలో ఆమెకు కూడా కొంత ఆస్తి రాసి, మనవరాళ్లు హోలీ, జోలీలకు సంగీతం నేర్పమంటాడు.

జీవిత సౌందర్యమూ, ఆనందం కూడా బాధలోనే దాగున్నాయని తెలిసిన ఓల్డ్ జోలియన్ ఒకనాడు నిద్రలోనే చివరిశ్వాస విడుస్తాడు.

తొమ్మిది నవలల 'ఫోర్సైట్ సాగా'లో మొదటి భాగమిది. రెండవ నవల 'ఇన్ ఛాన్సెరీ'లో సోమ్స్ ఇంకా ఇరీన్ కోసం ప్రయత్నిస్తూనే ఉంటాడు. ఎలాగైనా అతడో కొడుకును కనాలి. కాని, ఇరీన్, సోమ్స్‌కు విడాకులిచ్చి, జూన్ తండ్రిని పెళ్లి చేసుకుని కొడుకును (పేరు జాన్) కంటుంది. సోమ్స్, ఒక ఫ్రెంచి యువతి ఆనెట్‌ను పెళ్లాడి ఓ కూతురు 'ఫ్లూర్'ను కంటాడు.

ఒకతరం తర్వాత ప్రారంభమవుతుంది మూడో నవల 'టులెట్' ఇరీన్ కొడుకు జాన్ (Jon), సోమ్స్ కూతురు 'ఫ్లూర్' యాదృచ్ఛికంగా కలుస్తారు. పెద్దలు ఇష్టపడకపోయినా, రోమియో జూలియట్‌లలాగ ప్రేమలో పడతారు. సోమ్స్, కూతురికి ఓ అరిస్టోక్రాట్ మైకేల్ మాంట్‌తో పెళ్లి చెయ్యటానికి ప్రయత్నిస్తాడు. గత్యంతరంలేని పరిస్థితుల్లో ఫ్లూర్ వివాహానికి అంగీకరిస్తుంది. జాన్ అమెరికా వెళ్లిపోతాడు.

రెండవ నవలా త్రయం 'ఎ మాడర్న్ కామెడీ'లోని మూడు నవలలు- ది వైట్ మంకీ (1924), ది సిల్వర్ స్పూన్ (1926), స్వాన్‌సాంగ్ (1928)లతో ఫోర్సైట్ వంశానికి చెందిన తర్వాతి తరాల వ్యక్తులు దర్శనమిస్తారు.

చివరి నవలా త్రయం, ఎండ్ ఆఫ్ ది చాప్టర్‌లోని మూడు నవలలు! మెయిడ్ ఇన్ వెయిటింగ్ (1931) ఫ్లవరింగ్ వైల్డర్‌నెస్ (1932), ఓవర్ ది రివర్ (1933) రచయిత చివరి సంవత్సరాలలో వెలువడ్డాయి.

కల్పిత పాత్ర సోమ్స్ ఫోర్సైట్ మరణించినపుడు బ్రిటిష్ వార్తా పత్రికలు, ఎవరో ఒక ప్రముఖ వ్యక్తి నిజంగా మరణించినట్లుగా 'ఆబిచ్యుయరీ' ప్రచురించాయి. ఈ నవల పాపులారిటీకి అదే నిదర్శనం.

తొమ్మిది నవలలూ కలిపి ప్రచురించిన ఫోర్సైట్ సాగా సింగిల్ వాల్యూమ్ ఎడిషన్, బ్రిటిష్ ప్రచురణ చరిత్రలో ఒక ఆల్‌టైం బెస్ట్‌సెల్లర్.

– ఎం. వసంత

హాస్యకథ

# నాన్నోయ్! నాకు పెళ్లొద్దు!!



- సుంకర కోటేశ్వరరావు

సూక్తుల మరమరాలను బుజ్జగింపుల డబ్బాలో నింపుకుని నాలిక్కింద పెట్టుకుని వచ్చాడు వామనమూర్తి. ఇదతని మాసిక విజిట్... పీరియాడికల్ ట్రిప్! వచ్చి నేరుగా ఇంట్లోని మూడు గదులూ తిరిగాడు. ఎవరూ కన్పించలేదు. నీళ్ల శబ్దం వినిపించి వెనక కిచెన్‌లోకి అడుగు పెట్టాడు. కనిపించిన దృశ్యం చూచి అవాక్కయ్యాడు. గుండె తరుక్కుపోయింది.

"ఒరే... ఒరే... భూతీ! ఏమిట్రాయిది. అంట్లు తోముకుంటున్నావా? నీకిదేం ఖర్మరా? కట్టిన ఇల్లుంది, పెంచిన వొళ్లుంది, చదువుంది, సంపాదనుంది. నిక్షేపంలా పెళ్లి చేసుకుని ఒకింటివాడివై, పిల్లల్ని కని, వంశం నిలపరా నాయనా అంటే ఈ ఆడంగి వేషాలేవిటీ? ఈ నికృష్ట ప్పనులెందుకురా? " నాలిక్కింది డబ్బా మూత్తీసి మరమరాలు కుమ్మరించడం మొదలెట్టాడు.

ఆనందభూతి చులాగ్గా అంట్లపని ముగించి, సర్ది, చేతులు తుడుచుకుంటూ ముందు గదిలోకి దారి తీశాడు కామ్‌గా!

"మాట్లాడవేమిరా!" రెట్టించాడు వామనమూర్తి.

"నాన్నోయ్! నీకు దణ్ణంబెడతా! నాకు పెళ్లొద్దు... ఎన్నిసార్లు చెప్పాలి? నేను యాంటి ఫిమినైన్ని- ఆడవాసనంటే పడదు- నన్నిలా బతకనీ! నాది మన మాజీ ప్రధాని, మాజీ రాష్ట్రపతులైన మహానుభావులు అటల్ బిహారీ వాజపేయి, అబ్దుల్ కలాం సార్ల మార్గం! అయినా పనుల్లో ఆడా మగ పనులని విడివిడిగా ఉండవు- ఒక్కటి తప్ప..." అన్నాడు ఆనందభూతి వరండాలో కుర్చీలు వేస్తూ.

"ఏమిటో ఆ ఒక్కటి? " వ్యంగ్యంగా అడిగాడు వామనమూర్తి.

"పిల్లల్ని కనడం- అదొక్కటే మగాడు చేయలేనిది. మిగతా పనులకు ఆడా మగా తేడాలుండవు. మగాళ్లన్ని పనులూ చేయగలరు, చేయాలి. నాకేం కష్టం, నామోషీ లేదు" తేల్చి చెప్పాడు తేలిగ్గా ఆనందభూతి.

"నాయనా భూతీ! ఎందుకురా ఈ వయసులో మమ్మల్నిలా హింసిస్తావు? మీ అమ్మ కోడల్ని చూసీ, నేను మనవణ్ణెత్తుకు ముద్దాడి.. చచ్చిపోవాలనే ఆత్రుతతో ఉన్నాం. మన వంశమేమిటి? తరతరాలుగా అవసరమైతే ఎందరు ఆడంగుల్నయినా పెళ్లాడి వంశోద్ధారకుల్ని కని తృప్తిపడిన వంశం. మరి నువ్వు పెళ్లే వద్దంటే నేనెలా గురా భరించేది? మన వంశం నీతో ఆగిపోవలసిందేనా? అది మహాపాపం... పాతకంరా... మగాడిగా నీ జన్మ సాఫల్యం కాదు- నామాట విను"

"నాన్నా! అయిందా ఈ నెలకి నీ మాసిక సూక్తి ముక్తావళి? ఇలాంటి నీతు



లూ, సూక్తులూ వంటబట్టి మనవాళ్లు తూచా తప్పకుండా నెరవేర్చబట్టే మన కర్మభూమి జనాభా నేటికి 122 కోట్లు దాటి, కొద్దికాలంలోనే ప్రపంచంలో అగ్రస్థానంలో నిలవబోతోంది. పెరుగుతున్న జనాభాకి సరిపోయే బువ్వా చొక్కాలాగు లేవి? వనరులైతే దేశంలో కోకొల్లలుగా ఉన్నాయి. వాటిని జనాలకు చేర్చడం మాని పాలకులు లాగేసుకుని, దోచేసుకుని, దాచేసుకుంటున్నారు దేశ విదేశాల్లో. ఎవరూ ఏమీ చేయలేని పరిస్థితి. అందుకే నావంతు బాధ్యతగా పునరుత్పత్తి ప్రసక్తే ఎత్తుకోగూడదని... అదీ దేశ సేవేగదా? "

ఆనందభూతి అలా ఫినిషింగు టచ్చిస్తుండగానే వీధిలోంచి "భంభంభం... బసవేశ్వరా! సోహం సోహం సోహం దేవీ దాసోహం! అహమహం దేవతా ఆవాహం! దాహం దాహం దరిద్ర శని విరహం - చుట్టుకుంది నరకం!" అంటూ ఓ విచిత్రమైన అరుపు వినిపించింది. కేకతోపాటుగా పాతాళభైరవి సినిమాలోని నేపాళ మాంత్రికుని వేషంతో ఓ ఆజాను

బాహుడు పెద్ద వంకరటింకర కర్రను చేత తాటిస్తూ నేరుగా వాళ్లున్న దగ్గరికి వస్తు న్నాడు... బైటనుండి.

"వామ్మో! వీడెవడు నాన్నా! 'అరుంధతి' సినిమాలో సోనూసూద్‌లా భయంకరంగా ఉన్నాడు. ఆత్మాహుతిగాడిలా ఇటే వస్తు న్నాడు- నాకు భయమేస్తోంది. ఏమిటో కనుక్కో నాన్నా.. రూపాయో రెండో బియ్యమో అన్నమో...!" భూతి వామన మూర్తి చెవిలో అంటుండగానే బూచాళ్ళా ఉన్న సోనూసూద్ అందుకున్నాడు- "నేను అడుక్కుతినేవాణ్ణి కాదోయ్ ముబెంకా! పాస్ట్, ప్రజెంట్, ఫ్యూచర్, త్రీ ఏజెన్సీ విప్పి చెప్పగలవాణ్ణి అంబ పలుకుతో" అన్నాడు.

"అలాగా మరి ఇలా ఎందుకొచ్చారు సోనూసూద్ గారూ! మా పాస్ట్ ప్రజెంటె న్సులు బాగానే ఉన్నాయే" ఆనందభూతి భయం భయంగా అడిగాడు.

"అవి బాగానే ఉన్నాయి. కానీ నీ ఫ్యూచర్ అగోచరంగా, అయోమయంగా ఉంది ముబెంకా! వీధిలో నడుస్తూ నీఇంటి ముందుకు రాగానే సడెన్‌గా వాస్త్వంబ నన్నావహించి ఆహ్వానించింది- 'రా! రా! రారా!' అని"

"వాస్త్వంబా? ఆమెవరు? ఆ పేరున్న వాళ్లెవరూ ఈ వీధిలో ఉన్నట్లు లేదే!"

"మూర్ఖ ముబెంకా! వాస్త్వంబ అంటే మనిషి కాదురా మానవా! వాస్తు దేవత! 'ఈ ఇంట్లో దోషముందీ - ఈ ఇంటివాసి నాభక్తురాలి ఏకైక పుత్రుడు. అందుకని ఆ అమాయక అజ్ఞానిని రక్షించు- ఫో!' అని ఆజ్ఞాపించింది. అందుకే ఇలా వచ్చాను"

"అవును మాయావిడ... వీడితల్లి - బెజ వాడ కనకదుర్గ భక్తురాలే! స్వామీ! సోనూ సూద్ స్వామీ! మీకు నమస్కారం! ఆ దుర్గ పంపగా వచ్చారు. వీడు నా కొడుకు- గత సంవత్సరం యీ యిల్లు కట్టాడు..."

వామనమూర్తి చెప్తుండగా... "తాపీమేస్త్రీ అన్నమాట..." బూచాడన్నాడు మధ్యలో అందుకుని.

"అబ్బే అదికాదండీ! గవర్నమెంటుద్యోగే! అప్పుసప్పు చేసి నెలనెలా వాయిదాలు చెల్లిస్తూ ఈ యిల్లు కట్టుకున్నాడు. కానీ ఓ యింటివాడు కాలేకపోయాడు. పెళ్లీపెటా కులు లేవు- అయితే ఆరోగ్యపరంగా మరే తేడాలు లేవు స్వామి. మరోలా ఆలోచించ కండి. ఎప్పుడూ మనశ్శాంతి లేనట్లుంటా డు. ఈ వాస్తుదోషం వల్లనే కాబోలు! బాబ్బాబు, చచ్చి మీ కడుపున పుడతా- ఆ దోషం తొలగించి, వాణ్ణి రక్షించి పుణ్యం కట్టుకోండి సోనూసూద్ స్వామిగారూ!" అంటూ వామనమూర్తి భోరుమనబోయి, ఈ దెబ్బతో కొడుకు పెళ్లికి ఒప్పుకుంటాడు గదా అనే ఆనందం కలిగి, కళ్లనీళ్ల వరకే పరిమితం చేశాడు- ఉద్వేగాన్ని.

"నాన్నా! ఏమిటిది! ఎంతసేపూ కడు పులూ కనడాలూ పుట్టడాలేనా? - నువ్వుండు! అయ్యా! సోనూసూద్‌గారూ!" ఆనందభూతి చెప్పబోయే విషయానికి బూచాడు అడ్డొచ్చాడు.

"సోనూసూదేమిట్రా మూర్ఖుడా! నాపేరు వాస్తు వరదానమూర్తిరా ముబెంకా!"

"ఇందాకట్నుండి ముబెంకా.. ముబెంకా అంటున్నారు.. అదేం పేరు, ఆఫ్రికాజాతి వాళ్లపేరులాగా? నాపేరు ఆనందభూతి.. అంటే ఆనందమే ఆస్తిగా కలిగినవాడు. బైదిబై, నాకే అశాంతీలేదు. ఈ యింట్లో ఆనందంగానే వుంటున్నా నిప్పటివరకూ! పైగా ఈ దేశ ప్రజలకున్న స్వేచ్ఛాస్వాతం త్ర్యాల్లా నాకూ మనశ్శాంతి చాలా ఎక్కు వగా ఉంది. విశ్రాంతే లేదు- అనేక పనులు- అంతే స్వామీ!"

"కానీ ముబెంకా..." వరదానమూర్తి ఏదో చెప్పబోయాడు.

"మళ్లీ 'ముబెంకా' అంటున్నారు స్వామీ!"

"నీకదే సూటబుల్ ముబెంకా! నేనలాగే

పిలుస్తా"

"అసలు 'ముబెంకా' అంటే ఏమిటండీ?"

"నీ బుర్రలో శాప వశాన పిట్టం కట్టుకుపోయిన మెదడు ముద్ద కరిగి అందు జ్ఞానం దీపం వెలిగించబడిన మరుక్షణం దానర్థం నీకే బోధపడుతుంది, దుష్యంతుడికిలా. సరే, విషయానికి వద్దాం! ఈ యింట్లో వాస్తుదోషం వున్నమాట వాస్తవం. అంబ పలికింది గదా! ఈ రోజు అశాంతీ అలజడీ లేదు, అంతా ప్రశాంతంగా వుంది గదా అని నీకనిపించవచ్చు పునాదిలో చేరిన చెదపురుగుల్లా, ఒంట్లో అలక్ష్యం చేయబడిన చక్కెర జబ్బులా- మన నాయకమణులంటుంటారే చట్టం తన పని తాను చేసుకుపోతుంది అని... అలా కీడు అజ్ఞాతంగా తన కొరుకుడు తాను చేసుకుపోతూ వుంటుంది. తొడిమ పండి, ఎండగానే ఆకురాలి పోతుంది. అంతే, యిల్లోసారి చూడనీ" లేచాడు వరదానం. చొరవగా, చెకచెకా యిల్లంతా కలయ తిరిగాడు. యిష్టం లేకున్నా ఆనందభూతి అతన్ననుసరించాడు. తిరిగి వరండాలోకి చేరారు. వరదానం బొమలు ముడిపడ్డాయి. కుర్చీలో కూలబడ్డాడు- రెండుక్షణాలు కళ్లు మూసుకున్నాడు. పిడికిలి బిగించి నుదుటిపై కొట్టుకున్నాడు. ఒక్కసారిగా 'అంబా!' అంటూ అరిచాడు.

అబ్బాకొడుకులిద్దరూ ఉలిక్కిపడ్డారు.

చిన్నగా నిట్టూరుస్తూ కళ్లు తెరిచాడు వరదానం. "నీళ్లు పట్రా ముబెంకా" అన్నాడు.

పరుగున వెళ్ళి దబెరాతో తెచ్చిన నీళ్లను గటగటా తాగి "ఈ యిల్లు నీ పేరునే వుందా ముబెంకా?" అడిగాడు తాపీగా.

"అవును స్వామీ!" ఆనందభూతి ఆందోళనతో చెప్పాడు.

"తప్పదు- తప్పదు- పాపం- పాపం! ఆనందభూతి" కళ్లు మూసుకుని గొణుక్కుంటున్నట్లు అన్నాడు వరదానమూర్తి.

"ఏమిటి తప్పదు? వాస్తు వరదానమూర్తిగారూ! వివరంగా చెప్పండి" వామనమూర్తి దీనంగా అడిగాడు.

"మూడే మూడు మాసాలు- పూర్తయిా అవకముందే ఈ యింటి యజమాని...." అర్థోక్తిలో ఆగాడు వరదానం!

"ఆఁ... యజమాని....?"

"బకెట్టు తన్నేస్తాడు అంటోంది అంబ"

"ఆఁ అయ్యో అయ్యో! ఎంతమాట?" వామనమూర్తి లబలబలాడాడు. ఆనందభూతి గుండెలు గుబగుబలాడ్తూ గొంతుకలోకొచ్చి మాట వెలికి రాలేదు.

"అయ్యో! వరదానంగారూ! భయంతో.. చూడండి" వామనమూర్తి చెమటల్లో తడిచాడు, నోటమాట రావడంలేదు, వణుకు!

"భయంలేదు- ఎంతటి దోషానికైనా నా దగ్గర విరుగుడుంది. మరేంలేదు ముబెంకా! మరెంత మాత్రం ఆలస్యం చేయకుండా నట్టింట్లో ఎంచక్కా గాజుల గలగలలూ అందెల జణజణలూ అలా అలా మోగేలా చేయాలి- అంతే! ఆ దెబ్బతో దోషం పుంజాల్తెంచుకు పారిపోద్ది"

"ఓస్ యింతేనా! యింకేం చేయాల్నో అని హడలి చచ్చాను. ఈరోజు సాయంత్రానికే రెండు డజన్ల గాజులు తెచ్చి గుమ్మానికి వేలాడదీస్తా- గుప్పెడు మువ్వలందెలు కొని తెచ్చి నా మొలతాడుకట్టుకుంటా- ఫినిష్! శబ్దాలే శబ్దాలు" కార్తున్న చెమటలు ఆరిపోయి, మృత్యునాదాల నుండి బైటపడి రిలీఫ్ పొందిన ఉత్సాహంతో చెప్పాడు ఆనందభూతి.

"తాతకి నడ్డినెప్పి అంటుంటే, ఒంగోబెట్టి తన్ని 'తగ్గింది పో'- అన్నాట్ట వెనకటికి నీలాంటి మనవడు. అది సరికాదు ముబెంకా! అరమరికలు లేని చక్కని యిల్లాలు నిండుగా గాజులతో, మట్టెలతో యింట్లో హుందాగా, ఆనందంగా తిర

గాలి..అని అంబ అర్థం. అప్పుడే దోష నివారణ.. సంరేఖు!" వరదానం విసుగుతో విడమర్చాడు.

"ఓహో అలాగా? అలాగైతే మరో పని చేస్తా... ఈ పక్క పోర్షను మీరు చెప్పిన లక్షణాలున్న ఫేమిలీకి లక్షణంగా అద్దెకిచ్చేస్తా! స్వామికార్యం, స్వకార్యం రెండూ నేరవేర్తాయి... ఏమంటారు?" ఆనందభూతి ఆనందంగా చెప్పాడు.

"ఇందాక నేనన్నదానికి ఎవిడెన్సిది. నీ బుర్రలో మెదడు ఫ్రీజ్ అవడమేగాకుండా చెవికంటుకుపోయిన సెల్‌ఫోనులోని బేట

# కొత్తగాలి... 

**జీవితం**
**విషాదాన్ని పెళ్లాడింది**
**ఆనందం**
**విడాకులిచ్చి పోయింది**

– వల్లభాపురం జనార్దన,
మహబూబ్‌నగర్

రీలా చైతన్య రహితమౌతున్న సూచనలు కనిపిస్తున్నాయి ముబెంకా!"

"అదేమిటీ..అంతమాటన్నారు!"

"లేకపోతే ఏమిటోయ్! అద్దెకు దిగిన వాళ్లు యింటి యజమానులౌతారా? నీ పేరుపై తయారై కూర్చున్న దోషం తొల గుతుందా? అది పరాచిక చర్య అవు తుంది- కీడు మిక్కుటమై అడివంటుకున్న అగ్నికీలల్లా వేగంగా పాకి దహించేస్తుంది అంబపలుకు! ఏమనుకున్నావో ఖబడ్దార్!"

"అదికాదండీ...బ్రహ్మచర్య వ్రతం.."

"దోషేచవహ్ని...అందులో పడెయ్ వ్రతాన్ని. చూడు ఫైనల్‌గా చెప్తున్నా-ఈ ఇంటియజమాని తాళిగట్టిన ఇల్లాలు ఇం ట్లో తిరిగి ఆ శబ్దాలు చేస్తేనే దోషం ఐ స్క్రీంలా కరిగి, జలుబు ముక్కులా కారి పోయి శుభం కార్డు పడుతుంది. లేదంటే తొంభైతొమ్మిదో దినం యజమాని అంటే నువ్వు- మరీఇంట్లో విస్తరి పరుచుకునే పనేరాదు. వస్తా! జై అంబా! జ్యాయ్ శాంభవీ శాంభవీ, కుంభినీ, శాఖినీ, ఢాకినీ- శలవ్! ఏదీ ముబెంకా! అంబ ఆన! ఫీజు ఓ వెయ్యి నోటిలా కొట్టించెయ్..." సింపు ల్‌గా అడిగాడు వరదానం.

"ఆఁ అమ్మో! వెయ్యా? నేను పిలవకుం డానే వచ్చి చెంపలు వాయిస్తూ చెప్పిన శాపనార్థాలకు అర్థం వెయ్యా? అన్యాయం! మరో రేటు చెప్పండి!" ఆనందభూతి అల్ల ల్లాడ్తూ అన్నాడు.

"అంబ పలుక్కు బేరాలుండవు ముబెం కా! అంబ పిలిస్తే వచ్చాను, అంబ పలుకే చెప్పాను. ఆ రహస్యం చెప్పకపోతే ఇంకా కుదేలయ్యేవాడివి. అంబ మూణ్ణెల్ల రాయితీ ఇచ్చిందందుకే - నీ ఇష్టమైతేనే ఇవ్వు, లేదంటే.." వరదానమూర్తి కదిలా డు.. వామనమూర్తి వెంటనే వారించాడు.

"ఆగండి మహాప్రభో ఆగండి! - ఒరే త్రాష్టుడా! ఇవ్వరా వెయ్యి. అది కేవలం ఫీజు కాదురా, నీ ప్రాణం ఖరీదు. ఇచ్చెయ్ బతికుంటే బలుసాకు పండించుకు తినొ చ్చు. అంబక్కోపం వస్తే మూడు నెలల వాయిదా మూడు దినాలకు కుదించబడు తుందేమో! ఎందుకొచ్చిన పీడ, యిచ్చెయ్" అరుస్తూ చెప్పాడు వామనమూర్తి.

ఆనందభూతి అంతరాంతరాలలో దుఃఖి స్తూ వేయి తెచ్చిచ్చాడు. డబ్బు పుచ్చుకున్న వరదానమూర్తి బైటికి కదిలాడు, 'పాతాళ భైరవి'లో యస్వీఆర్‌లా నవ్వుకుంటూ!

"పొద్దున్నే ఎవరి ముఖం చూశానో- వె య్యి- నుయ్యి- పొద్దుటే నువ్వేకదా నాన్నా వచ్చావ్. నీ ముఖమే చూశాను..వా" దుఃఖం దిగమింగుకున్నాడు.

"నోర్ముయ్‌రా దేశవాళీ నేతిబీరకాయ

మెఖమూ? అందుకని కదరా! ఆ సోనూ సూద్‌గాడు నిన్ను 'ముబెంకా' అంది... కరెక్టు అంచనా..." అక్కసంతా వెళ్లగ క్కాడు వామనమూర్తి.

"అంటే- అంటే 'ముబెంకా' అర్థం తెలుసానాన్నా? ఏమిటి దానర్థం నాకు చెప్పవా నాన్నా! నాన్నా- నాన్నా! చెప్పవా? "

"బుర్రలో జ్ఞాన ఊట పెరిగినప్పుడు నీకే దానర్థం తెలుస్తుందన్నాడు గదా? "

"అనేకమైన విషయాలతో బుర్ర నిండి పోయి ఉంది. నో వేకెన్సీ- జ్ఞానం ఊట చోటుచేసుకోడానికి. అందుకని నువ్వే చెప్పు నాన్నా.. ఫ్లీజ్! 'ముబెంకా' అంటే"

"ముదురు బెండ కాయ"

"ఆఁ? " నోరు తెరిచాడు ఆనందభూతి.

★ ★ ★

కళ్లు మూసుకుని, కాళ్లు ముడుచుకుని, కుర్చీలో కూర్చుని, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తు న్నాడు ఆనందభూతి. ఆలోచనలు ఓ కొలిక్కి వచ్చినట్లున్నాయి. క్రమంగా ముఖం లోని మలినమేఘాలు విడిపోతున్నాయి.

వామనమూర్తి కుర్చీని లాక్కుని అతని ఎదురుగా కూర్చుంటూ "ఒరే భూతీ! మరీ అంతగా బిగుసుకు పోకు. మారకం గదా భయముంటుంది.. కాదనను. కానీ దోష నివారణ మార్గం ఆలోచించు" అన్నాడు.

"నాన్నా! నిజంగా అలా జరుగుతుందం టావా? " ఆనందభూతి కంఠం వణికింది.

"ఏమో గుర్రం ఎగరావచ్చు, నక్షత్రం రాలావచ్చు. అంబ పలుగ్గదా! మానవుడి మాటా? ఇంతకీ నీకేమనిపిస్తుంద్రా భూతీ"

"నాకూ 'ఏమో' అనిపిస్తుంది నాన్నా? "

"చూశావా? నీకూ కొంచెం కొంచెం జ్ఞానో దయమౌతున్నట్లుంది. కీడెంచి మేలెంచడ మంటే అదే. మరి ముహూర్తాలు పెట్టిం చనా? పదంటే పది దినాల్లో ఎంచక్కా ఇంటి ఇల్లాలు నట్టింట్లో చెవుల తుప్పు వదిలేలా అందెల శబ్దాలు చేసుకుంటూ తి రిగేస్తుంది, సతీసావిత్రిలా మృత్యుదోషాన్ని 'ఛీ! పో' అంటూ ఎడమకాలితో తన్నేస్తూ. నువ్వా సత్యవంతుళ్లా ఎంచక్కా బతికి బట్ట కడతావు, ఏమంటావ్? " హుషారు, ఆనందమెక్కువయ్యాయి వామనమూర్తికి.

"నాన్నోయ్! నీకు దణ్ణం బెడతా.. పెళ్ళి మాటెత్తకు. నేను పెళ్లాడను" వెంటనే అన్నాడు ఆనందభూతి.

చర్రుమంది వామనమూర్తికి. ఒక్కసా రిగా గొంతెత్తాడు "ఓరి దరిద్రప్పీనుగ! మరేం చేస్తావ్? అన్యాయంగా ప్రాణ త్యాగం చేస్తావా? " అని, సడెన్‌గా తగ్గి, బతిమిలాట ధోరణికొచ్చాడు.

"ఒరే! నాయనా ఆనందం! నువ్వు ఒక్క గానొక్క నలుసువురా మాకు. కాటికి కాళ్లు చాపుకున్న వయసు నాది. నా యీ కట్టెకు నీచేత సంస్కారాలు చేయించుకుని ఆ వైత రణిని రెక్కల గుర్రంలా ఒక్క గెంతులో దాటుదామని ఆశపడుతున్నవాణ్ణి. కానీ విధి రివర్సయేలా వుంది. ఈ వయసులో నేను కన్నబిడ్డ కట్టెకు నిప్పెట్టే దౌర్భాగ్య ప్పని చేయవలసి రావడం, ఎంతటి ఘోర మైన దోషమో ఒక్కసారి ఆలోచించరా!" భోరుమన్నాడు వామనమూర్తి.

ఆనందభూతికి భయంతో కూడిన చిరా కేసింది "ఆపు నాన్నా, ఆపు! నేనప్పుడే చచ్చి కట్టెనయినట్లే ఆలోచిస్తున్నావా? ఏమిటి నాన్నా ఇది? నువ్వసలు కన్న తం డ్రివేనా? "

చెమటలు పట్టాయతనికి.

"కన్నతండ్రిని కాబట్టేరా బాధ! మరణమే శరణ్యం. మరోమార్గం పెళ్లి తప్ప మరి ఇంకేం లేదంది గదా అంబ!"

"ఎందుకు లేదు, ఎంచక్కా వుంది మార్గం!"

"ఏమిటది? "

"యాజమాన్యాన్నే మార్చేస్తా! వెంటనే ఇంటిని మరో గన్నాయికి అమ్మేస్తా!

ఫినిష్..." ఆత్మ విశ్వాసంతో పలికిన ఆనందభూతి మాటలు విని హతాశుడయ్యాడు వామనమూర్తి.

"అమ్మనా పుత్రుడో! నెలలు నిండక ముందే అమ్మ కడుపులోంచి సిజేరియన్‌తో బైటపడ్డవాడివి కదూ? నువ్వు సామాన్యుడివి కాదురా!" అయిదడుగుల రెండంగుళాలున్న తాను మూడడుగులకు కుంచించుకుపోతున్నట్లూ, ఎదురుగా అయిదున్నరడుగులున్న సుపుత్రుడు ఆరున్నరడుగులకు పెరిగిపోతున్నట్లూ ఫీలవుతూ స్వగతం చెప్పుకున్నాడు వామనమూర్తి, నోట మాట రాక!

★ ★ ★

"ఏమిరా కుర్రకుంకా! కొద్ది వయసులోనే లంకంతింటిని కట్టుకున్నావూ! పెళ్లీపెటాకులూ కూడా లేనట్లుంది. మరి యింతర్జంటుగా ఈ లంక నెందుకమ్మకానికి పెట్టావూ? " గంభీరంగా అడిగాడు బుర్రమీసాల పాపారాయుడు, చేతిలోని తుపాకీని బల్లకాన్చి, తాను కుర్చీలో కూలబడుతూ, ఎదురుగ్గావున్న ఆనందభూతితో.

చెవులు మెలేస్తూ లోపలికి దూరిన రాయుడి భాషకు ఆనందభూతికి చాలా బాధ కలిగింది.

"అయ్యా! రాయుడుగారూ! కొద్దిగా ఆ మిలిటరీ భాష మార్చుకూడదూ! నన్ను చూడంగానే 'ఏం బాబూ' అని మర్యాదగా పలకరించారు. లోపలికొస్తూ 'ఏమయ్యా' అని, మరుక్షణంలోనే 'ఏమోయ్' అని, యిప్పుడేమో 'ఏమిరా' అనే కాకుండా 'కుర్రకుంకా' అంటూ బిరుదొకటి తగిలించారు. ఎంత తుపాకి చేతనున్న ఎక్స్‌మిలిటరీ బుర్రమీసాలవారైనా ఇండివిడ్యువాలిటీ అమోఘంగా పెంచుకొస్తున్న ఒక యువ ఉద్యోగినీ, ఇంటి ఓనర్నీ, అంత అవమానకరంగా సంబోధించడం భావ్యమా? అదిగో ఆ యువతి ఎవరో మీ వెంట వస్తూనే కప్పపిల్లలా చెంగుచెంగున గెంతుకుంటూ సరాసరి లోపలికెళ్లిపోయి, స్వంతయింట్లో తిరిగినట్లు తిరిగేస్తోంది" అసహనంగా ఆందోళన వ్యక్తపరిచాడు, ఓ కంట భయం భయంగా తుపాకి వంక చూస్తూ.

"ఏమిటోయ్ నీ బాధ? నా వయసులో సగంలేదు నీ వయసు. నేను మీసాలున్న మిలట్రీవాణ్ణి. నా అలవాటది. అమర్యాద కాదది- ఆప్యాయత. అలా పిలిస్తేనే గాని నాకు తృప్తి వుండదు. ఇక కప్పపిల్ల కాదు- సీతాకోక చిలుకలా ఎగురుతూ లోనికి వెళ్లిన ఆ అమ్మడు నా ఒక్కగానొక్క కూతురు. పేరు రాగిణి. విరాగుల్ని కూడా రాగరంజితం చేయగల రవ్వలనవ్వులు ఆమె పుట్టుకతోనే వరంగా తెచ్చుకుంది... తను నవ్వితే నవరత్నాలు రాల్తాయి- ఓయ్ అలనాటి కృష్ణకుమారి సినిమా కాదు... ఆ రత్నాలు ఏరుకుందామని ఆశగా తెల్లవార్తూనే ఎందరెందరో చుట్టుపక్కలవాళ్లు నా అద్దెకొంప గుమ్మంముందు క్యూకట్టి వుంటారు, సంచులు పట్టుకుని తెలుసా? " పాపారాయుడు మీసాలు దువ్వుకున్నాడు.

"చెత్తకాగితాలేరుకునే వాళ్లయ్యుంటా రండీ" వెంటనే ఆనందభూతి అన్నాడు.

"చఛ!- చెత్త ఆలోచన! చూడు చీకటింట్లో లైటక్కరలేదు నా బిడ్డ తిరుగుతుంటే. ఏమనుకున్నావో! యిక నా ఆస్తిపాస్తుల గురించి బయోడేటా యిస్తా, తర్వాత కావాలంటే. ప్రస్తుతం ఆమెకొక యిల్లు కొనిపెట్టి, పెళ్లిచేసి, ఎంచక్కా తాతనయ్యాననిపించుకుని నా భుజాన్నుండి ఈ తుపాకి బరువును కూడా దించేసి, కామ్‌గా కన్యాకుమారి వెళ్లిపోదామని నా ప్లాను! అందుకే యిల్లు బేరం చేద్దామని వచ్చా. అమ్మాయి యిల్లు చూసుకుందామని లోపలికి వెళ్ళింది, తప్పా? చెప్పు. నా భాష నీకు అభ్యంతరమైతే చెప్పు. వెళ్లిపోతాం.

నీకున్నది ఒకటే ఇల్లు. మేము వీధిలోకెళ్తే అరవైయారున్నాయి అమ్మకానికి. ఏమంటావ్, వెళ్లమంటావా? " అన్నాడు పాపారాయుడు తుపాకి బేరల్ నిమురుతూ.

"అయ్యయ్యో! ఇల్లు బేరానికొచ్చారనుకోలేదండీ. పొరపాటైంది. భాషదేముంది, అంతా మన తెలుగే గదా! పెద్దలు మీరెలాగైనా పిలవండి తేటతెలుగులో. నా కభ్యంతరం వుండదు. బేరం సెటిల్ చేసుకుందాం" సంతోషపడ్డాడు ఆనందభూతి.

"సరే, ఇల్లెందుకమ్మేస్తున్నావ్ అనేదానికి సమాధానం చెప్పలేదే? " రాయుడు.

నసిగాడు ఆనందమూర్తి.

"మ... మరేంలేదు.. నాకు అచ్చి రాలేదండి" చిన్నగా అన్నాడు.

"అచ్చా? అదెవరు... పనిపిల్లా? ... పనిపిల్ల రానంత మాత్రాన యిల్లమ్ముకుంటావా? అదేం పనోయ్? "

"అబ్బే.. 'అచ్చి' అంటే పనిపిల్లా కాదు సబ్బు బిళ్లాకాదండీ. 'అచ్చి' అంటే.. అంటే - అదెలా చెప్పాలో? ఆc.. అదే కలిసిరాలేదండి. క.. కలిసిరాలేదు నాకు"

"అలాగా? అంటే వాస్తుదోషమన్నమాట. మరి నేను కొంటే ఆ అచ్చో బుచ్చో నా కొస్తుందంటావా... మరి!"

"దోషం నా పేరుకేనటండీ. చూడండి రాయుడుగారూ! నేను వున్నదున్నట్లు నిక్కచ్చిగా పలికేవాణ్ణి. అరమరికలు లేనివాణ్ణి అందుకే యింట్లో అలమరాలు కూడా పెట్టించలేదు. నేను.. నేను యాంటీఫిమినైనండి. బ్రహ్మచారి వత్రం... యిల్లాలే కుండా యీ యింట్లో నేనొక్కణ్ణే ఉండడం దోషం.. ప్రాణహాని అని అన్నారండి వాస్తు పండితులు. ఆడంగులకు భయపడకపోయినా ప్రాణహానంటే భయమే గదండీ! అందుకని పెళ్లనే బందిఖానాలో చిక్కుకునేకంటే, ఇంటినే అమ్మేసుకుని, పీడ వదిలించుకుని, స్వేచ్ఛగా వీధులలో విహరించగలగడం ఎంతైనా ఆనందం గదండీ- అందుకని"

"అర్థమైందిలేరా వెంగయ్యా..."

"వెంగయ్య కాదండి, నా పేరు ఆనంద భూతి... ఆనందమే ఆస్తిగా కలవాడనీ.."

"అదేలేవోయ్ ఆషాఢభూతి!"

"అబ్బే! ఆషాఢభూతి కాదండి... ఆనంద భూతి! ఆ.. నం..ద..భూతి"

"సరేలే, ఏదొక విభూతి. ఇంతకీ నీది బ్రహ్మచర్య వ్రతమా? యాంటీ ఫిమెనైనా.. అంటే స్త్రీద్వేషం- అదేం జబ్బా? "

"ఛ జబ్బా కాదూ, వుబ్బుకామెర్లూ కాదండీ. ఆత్మరక్షణ- ఆత్మ విశ్వాసం- అచ్చమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యేచ్ఛ! తెలుగువాణ్ణి గదండీ! అంతేనండి! నా ఆరోగ్యం అన్ని

> ## కొత్తగాలి...
>
> **పత్తి**
> **తేనెపూసిన కత్తి**
> **పండిందా కళ్లు జిగేల్**
> **ఎండిందా గుండె గుభేల్**
>
> – కిలపర్తి దాలినాయుడు,
> సాలూరు, విజయనగరం జిల్లా

విధాలా క్వైట్ పెరఫెక్టండీ! ఎమ్మెస్ స్పెషలిస్టిచ్చిన సర్టిఫికేటు కూడా ఉందండి!"

"డాక్టరు సర్టిఫికేటా, లాకర్లో భద్రపరుచు. సరేపాపం, నీ ప్రాబ్లెం నీది. వదిలెయ్.. మన బిజినెసుకొద్దాం... రేటెంత చెప్పావ్? "

"ప.. పన్నెండు. అదే.. పదిహేను లక్షలండీ. డబల్ బెడ్రూమ్స్. దగ్గరుండి చెమటోడ్చి కట్టించానండి! ఆంజనేయుడి మీదొట్టు"

"ఆ వివరాలొద్దు. నాది కటీబిటీ ఒకటే బేరం. కరెక్టు మాడ్యులేషన్‌తో పలుకు

..పన్నెండా? పదిహేనా? చెప్పు"

"పన్నెండు కాదండి.. పదిహేనన్నానండీ.. లక్షలు. అద్దంకి ఇటుక, మాచర్ల సిమెంటు, బలార్షా టేకు, మద్రానా మార్బులు, ఒరవకట్ట మేస్త్రండి... పెరఫెక్ట్ కన్‌స్ట్రక్షన్. సరస్వత్తోడు"

"వివరాలొద్దన్నానా? పదిహేను.. బేరం ఓకే. లక్ష అడ్వాన్సు యిస్తా"

"ల.. లక్షా? ఓకే, ఓకే! ఇవ్వండివ్వండి"

ఆనందభూతి ఆనందంతో తడిసిముద్ద య్యాడు.

"అయితే ఒక షరతు! అడ్వాన్స్ యిచ్చేస్తా తీసుకో. కానీ యింట్లో దోషం వుందన్నావ్ కదా?"

## కొత్తగాలి...



**ధరలకి కళ్లెం**
**నేతల నోటికి**
**గొళ్లెం..!**
**వేసేదెవరట!**

– యు. చిట్టిబాబు,
న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

రాయుడి మాటలకి ఆనందభూతి నీరస పడిపోయాడు.

"అబ్బే! అది నా పేరు మీదనేనండీ... కొన్నవాళ్లక్కాదు, చెప్పాను కదా?"

"ఏమైనా దోషం దోషమేగదా? భయం ఎవరికయినా భయమేగా! అందుకని ఓ రెండు మాసాలు ఈ యింట్లో ట్రయల్‌గా ఉండి పరిశీలిస్తా. ఏమైనా తేడా వస్తే నా అడ్వాన్స్ వెనక్కి తీసుకుని వెళ్ళిపోతాం. తేడా రాలేదో.. ఇక రిజిస్ట్రేషనే. ఏమంటావ్?" పాపారాయుడి ఫిటింగ్ ప్రపోజల్‌కి ఏమీ అనలేకపోయాడు ఆనందభూతి.

"అలాగంటారా? తర్వాత ఒక నెలే టైముంటుంది నాకు విస్తరి పరచుకునే సందిగ్ధానికి. సరే కానీండి.. నేనీ ప్రక్కనే ఉంటాగా.. చూద్దాం!" నసిగాడు ఒక క్షణం ఆలోచించుకుని.

"నువ్వీ పక్కనే వుండేట్టయితే నువ్వు నాకు అద్దె యివ్వాల్సుంటుంది" పాపారాయుడి మరో ఫిటింగు.

"నేను మీకు అద్దె యివ్వాలా? అదేమిటి?"

"మరి ఇల్లు బేరమై లక్ష బయానా ఇస్తున్నా కదా.. దాంతో ఇల్లు నాదయినట్లే గదా?" మీసాలు సవరించుకుంటూ రాయుడు.

"సరే, కానీయండి. ముందు లక్షరూపాయిలివ్వండి"

పాపారాయుడు తుపాకి పక్కనపెట్టి సూట్‌కేసు తెరిచాడు. తల్లి గర్భంలోంచి అప్పుడే పుట్టిన బిడ్డలా ఏటీఎం లోంచి ప్రసవించిన కొత్తనోట్లు పెళపెళలాడ్తున్నాయి. ఆనందభూతి కళ్లూ, ఆనందంతో పళ్లూ తళతళలాడాయి, డబ్బుకట్టలు చేతిలోపడగానే!

"ఇదిగో ఆషాఢభూతీ! ఆ డబ్బు లోపల పెట్టొచ్చి- ఇదిగో ఈ రెండు కాగితాలపైన కింద గుర్తుపెట్టిన చోట సంతకం చేసి యివ్వు. అగ్రిమెంటు డీటీపీ చేయించి నీకొక కాపీయిస్తా" పాపారాయుడు ఆ కాగితాలిస్తూ అన్నాడు.

"ఏమిటీ? తెల్ల కాగితాలపైన నేను సంతకం చేయనండీ" అన్నాడు భూతి.

పాపారాయుడికి చిరాకేసింది.

"వాట్ నాన్సెన్స్! నేను ఏ భరోసా లేకుండా లక్ష రొక్కం.. ఎప్పటికీ ఖర్చుచేయకుండా దాచుకోవాలనిపించే ఫెళఫెళలాడే సరికొత్త వేయి రూపాయిల నోట్లకట్ట నీ చేతిలో పెట్టా. ఈ బోడి కాగింతంపైన వెధవ సంతకం చేయడానికి పెద్దమనిషిని,

తుపాకీ వున్న మీసాల మిలిట్రీవాణ్ణి, నన్నే నమ్మవా? వాటెషేం?

ఆ డబ్బిలా తే! నే వెళ్తా... ఈ యిల్లు నీకొక్కటే, కొనాలనుకున్న నేను బజారులో అలా అడుగుపెట్టానో అరవైయారు అమ్మ కానికి. కమాన్" గర్జించాడు రాయుడు.

"అయ్యయ్యో! అంతలా కోపగిస్తే ఎలా గండి రాయుడుగారూ! యిలా ఇవ్వండి కాయితాలు- రెండుచోట్ల చాలా! ఇద్దరం ఒకేచోట ఉంటాం గదా! ఫరవాలేదు" అంటూ సంతకాలు చేసి కాగితాలు రాయుడి చేతికిస్తూ పసిబిడ్డను పొత్తిళ్లలో కెత్తుకున్నట్లు అపురూపంగా కొత్తనోట్ల కట్టను గుండెల కానించుకుని, లోపలి నుం డి తిరిగి వస్తున్న రాగిణికి దూరంగా తొలగి, లోపలికి నడిచాడు ఆనందభూతి!

★ ★ ★

వరండాలో చెవులు చిల్లులు పడేలా టేపురికార్డు ప్లేయర్ లోంచి పాట. ఆ శబ్దానికి ఆనందభూతి అదిరిపోయాడు.

'రారా! నాసామి రారా!' ఎంతో లవ్‌లీగా ప్రపంచంలో ఇప్పటివరకూ పుట్టి అనుభ వాని కొచ్చిన సుఖ సౌఖ్యాలన్నీ పుడిశెట పట్టి తెచ్చి ఒళ్లో పోస్తాననే భరోసాతో ఓ స్త్రీ నిస్సిగ్గుగా ఆహ్వానిస్తూ తమకం రగి లిస్తూ పాడుతున్న శృంగార ప్రలోభ గీతం. వింటున్న ఆనందభూతి గుండెల్లో ఏదో గుబులు మొదలైంది. మరుక్షణంలో చిరాకు కలిగింది. ఒళ్లంతా కంపరం. ఏం చేయాలో తోచలేదు.

మూడురోజుల నుండీ ఇదే తంతు! సహనం చచ్చిపోతోందతనికి. ఈ దిక్కు మాలిన శృంగార ప్రలోభ గీతాల పొల్యూ షన్ ఎక్కువై అతని మనసుకు ఏదో తెలి యని వింత జబ్బు ఆవహిస్తున్నట్లు అని పించి భయపడ్డాడు. ఒక్కసారిగా 'ఆంజ నేయా!' అనుకుంటూ వరండాలోకి దూకు డుగా వచ్చేశాడు, తన గదిలోంచి. ఎదు రుగా పాట భావానుగుణంగా ముఖ కవ ళికలు మారుస్తూ రాగిణి అతని రాకని గమనించలేదు. మెరుపు తీగెలా, మల్లెల కుప్పలా, జాజి పరిమళాలు తెస్తున్న చిరు గాలిలా సోయగాల సొంపులు పోతూ ఊగుతున్న ఆ బాల శారీరక ఒంపుల సోయగం చూచి ఒక్కక్షణం మేనకను చూచిన విశ్వామిత్రుడయ్యాడు. ఒళ్లు జల దరించింది. తక్షణం తన బ్రహ్మచర్య వ్రతం, యాంటీ ఫిమినైన్ ధోరణి తనవీ పున చెళ్లుమనిపించాయి. మరుక్షణం శూర్పణఖను చూచిన లక్ష్మణుడయ్యాడు.

ముక్కూ చెవులూ కోసే సాహసం చేయ లేక పోయాడుగానీ అంతకంటే ఉడుకెత్తి పోయాడు.

"ఏమండోయ్! యామండీ.. యామండో య్!" పెద్దగా పిలిచాడు.

రాగిణి పలకలేదు. కనీసం అతని వైపు చూడలేదు. డాన్సూ ఆగలేదు.

కోపం పట్టలేని ఆనందభూతి టేపు ఆఫ్ చేశాడు. ఆమెలో ఏమార్పూ లేదు. టేప్ ఆన్ చేసుకుని డాన్స్ చేయసాగింది. మళ్లీ ఆపాడతను. ఆమె తిరిగి ఆన్‌చేసి రికార్డు ప్లేయర్‌ని చంటిబిడ్డను చంకకెత్తుకున్నట్లు పట్టుకుని తనపని తాను కొనసాగించింది. పైగా సౌండును మరి కొంచెం పెంచింది, సవాల్ చేస్తున్నట్లు!

దానితో ఆనందభూతి అవధుల్లేని కోపా గ్నిలో దూకి రగిలిపోయాడు.

"ఛీఛీఛీ! ఏమిటండీ ఈ న్యూసెన్సూ? ఏమండోయ్ రాయుడు గారూ! పాపారా యుడు గారూ! ఓసారిలా రండి, వరండా లోకి" పెద్దగా అరిచాడు.

"ఏమిటోయ్ ఆషాఢభూతీ! ఏమైందీ? ఎందుకా గావుకేకలు?" అంటూ పాపారా యుడు శరీరంలో ఓ భాగమైనట్లు తుపాకీ పట్టుకుని బైటికొచ్చాడు.

పాపారాయుడి చేతిలోని తుపాకీని

చూసి సగమయ్యాడు ఆనందభూతి.

"తు..తుపాకీ ఎందుకండీ వెంట? " అన్నాడు తడబడుతూ.

"ఆయిల్ రాసి శుభ్రం చేస్తున్నాలే. ఉప యోగించని వస్తువును రెండ్రోజుల కొకసా రైనా శుభ్రం చేయాలి. లేకపోతే తుప్పు పట్టి పనికి రాకుండా పోతుంది నీలాగా!" అన్నాడు రాయుడు, తుపాకి బేరల్ ని నిమురుతూ.

"నేనేం పనికి మాలిన వాణ్ణి కాదు, దేశ భక్తి నిండిన ఉద్యోగిని"

"సరిసరి, ఇంతకీ ఎందుకా గావు కేకలు? ఏదో పులి వచ్చి దాడి చేసినట్లు అరిచావు!"

"అవును... పు... పులే! లేకపోతే ఏమి టండీ నా చుట్టూ ఈ సౌండు పొల్యూ షను? అగరొత్తుల వాసనలు.. ఆడ గా లులు ..నాకిది శిక్షా? పరీక్షా? అసలే అస్ఖ లిత బ్రహ్మచర్య వ్రతం పూనిన వాణ్ణి గదా ఆంజనేయుడి సాక్షిగా.. యీ ముళ్లశయ్య వాతావరణంలో ఎలాగా నేను ని.. నిలదొ క్కుకోవడం? చెప్పండి!"

"ఏమైందోయ్! ఎందుకలా తడబడుతు న్నావు? "

"ఏమిటా... ఏమిటండీ ఆ పాటలూ, ఆ ఆటలు? ఆс? - రారా! నా సామి రారా! - అదా పాట? నిన్నటికి నిన్న- నీ మీద మనసాయెరా! నా స్వామీ!- అనేపాట. అవ్వ! ఇదా సంగీతం? మొన్నటికి మొన్న- నిను కోరు నెరజాణరా నా ప్రియుడా! నన్నేలు కోవేలరా!- అట... ఛీఛీఛీ! అవేం పాటలండీ బాబూ! ఎక్కడ దొరికాయి మీకు? ఎంచక్కా సత్యసాయి పాటలు, స్వామియే అయ్యప్పో.. అంటూ అయ్యప్ప స్వామి పాటలు ఎన్నిలేవు? అవి పట్టవా? ఎంతసేపటికి 'రారా! రారా' అంటూ ఈ దిక్కుమాలిన పిలుపుల పాటలేమిటి మహ ప్రభో!" ఏడ్చినంత పనిచేశాడు ఆనంద భూతి, భయంభయంగా తుపాకీని, రాయుడి మీసాల్నీ చూస్తూ.

"హోర్నీ! ఆ పాటల్ని 'జావళులు' అంటా రోయ్. విరహగీతాలవి. మన సంప్రదాయ నాట్యానికి అవే చక్కగా పనికొస్తాయి మరి! అమ్మాయి ఎం.ఎ. డాన్స్ పరీక్ష కె ళ్తోంది గదా! మరి ప్రాక్టికల్స్ కి ప్రాక్టీసు చేసుకోవద్దా! అయినా బ్రహ్మచర్య వ్రతం లో ఉన్నవాడివి ఆ పాటలప్పుడు గదిలోనే తచ్చట్లాడుతూ, మననం చేసుకుంటూ గుటకలు మింగకుండా, అలా బైటిక ఘోరించి అయ్యప్ప భజనల్లో పాల్గొన రాదూ.. భేషుగ్గా నాలుక్కూరలు, ఆవకాయ పిండివంటలతో దండిమగల భోజనాలు భారీగా పెడతారు కదా!"

"నా పిండాకూడు పెడతారు. ఎంత వ్రత మేడ్చినా వెధవది వయసొకటి సలుపుతుంది గదా చచ్చి! చెప్పుకుంటే సిగ్గుచేటు. అయ్యా! నాకేల ఈ పాటల పరీక్షలు! దయచేసి ఆవిడగార్ని ఆ మూల గదిలోనో, మేడపై భాగంలోనో కొద్దిపాటి సౌండుతో ప్రాక్టీసు చేసుకోమనండి. అంతే గాని, ఈ కలుషిత వాతావరణంతో నన్ను చంపొద్దని చెప్పండి.. మీకు పుణ్యముం టుంది"

"కళ పొల్యూషనంటా వేమిటోయ్ ఆషా ఢభూతీ? ఆర్ట్ ని మెచ్చని ఆంధ్రుడుం టాడా, అరకదున్న తప్పా! సరే వో పన్చెయ్! ఇల్లు ఖాళీచేసి వేరేచోట ఉండ రాదూ, వ్రతదీక్ష పేరుతో చెక్కభజన చేసు కుంటూ..."

"ఏమిటీ... నేను...? అమ్మో! అమ్మ.. నా ఇల్లు నేను ఖాళీచేసి, వేరే ఇంటికి వెళ్లాలా? ఏమిటండీ మీ ఉద్దేశం? " వస్తున్న దుఃఖం ఉక్రోషమైంది.

"ఓహో! ఇది నీ ఇల్లు కదూ! అయితే మరో పన్చెయ్. నేనిచ్చిన లక్ష రూపా యిలు నా మొహాన కొట్టెయ్. మేమే వెళ్లి

పోతాం! నీకుంది ఒక ఇల్లు, మేము వీధి లోకి అడుగేస్తే అరవైయ్యారిళ్లు. ఏదో ఒకటి కొనుక్కోక పోము.. కానియ్, ఇచ్చెయ్!" నిక్కచ్చిగా అడిగాడు పాపారాయుడు.

దిమ్మెర పోయాడు ఆనందభూతి. ఒక్కసారిగా దుఃఖం పొంగుకొచ్చింది. దిగమింగుకుంటూ వెంటనే రాయుడి రెండు చేతులూ లటిక్కిన పట్టేసుకుని "సర్, ఇవి చేతులే. సందేహం లేదు. కాళ్లనుకోండి కాసేపు.. నేనూ అలాగే అనుకుని పట్టుకున్నా! ఆ లక్ష నాకు గుర్తుచేయకండి సర్! నాకు గుండె ఆగిపోతుంది. నేను నిండా మునిగి పోయివున్నా" అన్నాడు.

ఆశ్చర్యపోయాడు "ఏమైంది" అడిగాడు.

"మీరు లక్ష అడ్వాన్సు ఇవ్వగానే ఎగురుకుంటూ వెళ్లి ఎక్కువ వడ్డీ వచ్చేస్తుంది గదా అని అదెవరో 'దూరదృష్టి ఫైనాన్సర్స్' అని బోర్డు కనిపిస్తే వెళ్లి డిపాజిట్ చేశా... వారం రోజులకే వాళ్లు బోర్డ్ లాగేసి గంధర్వుల్లా మాయమైపోయారు. నేను కుదేలైపోయాను. గుడ్డిలో మెల్లగా నాకు కించిత్ తృప్తేమిటంటే, నాకంటే ఎక్కువ డిపాజిట్ చేసినవాళ్లు మరో నలభై మంది తేలారు. వాళ్లంతా ఆ కంపెనీ మూసిన గేటు ముందు పొర్లుదణ్ణాల కార్యక్రమంలో ఉన్నారు. నేనా సాహసం చేయలేక ఏడ్చేదాని మొగుడొస్తే... సామెతను నమ్ముకుని వచ్చేశాను. ఎవరికీ చెప్పుకోలేక మూడ్రోజుల నుండి ముద్దగొంతు దిగక గుట్టుగా ఉండిపోయాను" గుడ్లనీరు కుక్కుకుంటూ అతిదీనంగా గుట్టు విప్పి చెప్పాడు ఆనందభూతి.

"అరరే! ఎంత పని జరిగిందీ! ఎంత వెర్రి పని చేశావోయ్ ఆషాఢభూతీ! నాతో ఒక్కమాట చెప్పొచ్చు గదా! సరే ఇప్పటికైనా మించింది లేదు. ఆ కంపెనీ అడ్రసూ, వివరాలు నాకివ్వు. వాళ్ల సంగతి నేను తేలుస్తా" అన్నాడు పాపారాయుడు

ఒద్దులెండి! ఆ భాగోతమంతా అయ్యింది. ఆ కంపెనీ వాళ్లను ఎవరూ ఏమీచేయలేరట, వాళ్లు ఎంతటి వాళ్లనైనా భయపెట్టేవాళ్లేగాని వాళ్లకు భయమనేది తెలియదట. సరే, పోనిండి! మీరు మాత్రం దయచేసి వెళ్లిపోతాం, అడ్వాన్స్ తిరిగివ్వు. వేరే ఇల్లు కొనుక్కుంటాం అనే మాటలు మాత్రం రానీకండి. నాకసలే టైం తరిగిపోతోంది. రిజిష్ట్రేషన్ అయితే ఇల్లు మీకప్పగించి నేను గడప దాటాలి గడువులోగా. నన్నన్యాయం చేయకండి ప్లీజ్!" పొంగుతున్న దుఃఖాన్ని పదే పదే దిగమింగుతూ ఎలాగో అన్నాడు ఆనందభూతి.

"మరెలాగయ్యా? మాకిక్కడ స్వేచ్ఛలేకపోయే. మా పనులు నీకు నచ్చవు మరి. మమ్మల్నీ వెళ్లనీయవు. ఎలాగా పరిష్కారం? "

"పొరపాటు జరిగింది. క్షమించండి సర్! ఇంకెప్పుడూ ఏ విషయంలోనూ మీకు అడ్డు చెప్పను" అని, రాగిణిని పిలిచి "అమ్మాయీ మణి రాగిణిగారూ! మీరూ నన్ను మన్నించండి. ఇకపై మీరు పాడుకోండి, ఆడుకోండి, మీ ఇష్టం. నేనడ్డురాను గాకరాను. ప్రామిస్! మీకు ఓకేనా? హేపీ

## కొత్తగాలి...

**అతనికి**
**శశివదనలాంటి భార్య కావాలట!**
**రాత్రికి వచ్చి**
**పొద్దున్నే పోవాలనేమో!**

– ముగడ రామకృష్ణ,
కొవ్వూరు, ప.గో. జిల్లా

యేనా? సరేనా? చెప్పండి" అంటూ టీవీ యాంకర్‌లా అడిగిందే అడుగుతూనే ఉన్నాడు, గుండెలోని దడ తగ్గడానికి అదో మార్గం అన్నట్లు.

రాగిణి చిత్రంగా భూతివైపు చూస్తూ 'ఒకే' వెలుగురేఖను రంగరించి చిన్నగా నవ్వు రువ్వింది.

"హమ్మయ్య!" అంటూ నిట్టూర్చాడు రిలీఫ్‌గా.

పాపారాయుడు ఒక్కసారిగా కస్సుమన్నాడు. "ఏమయ్యా! శతమర్కట బ్రహ్మచారీ! నీకు బుద్ధుందా? " అంటూ.

"ఏమిటాసార్? " బిత్తరపోయాడు ఆనందభూతి.

"అది అమాయకురాలు. పెళ్లి కావలసిన పిల్ల. కన్నతండ్రిని నేనెదురుగా ఉండగానే ఏమిటా వెకిలి చూపులు? నిట్టూర్పుల ఊర్పులు? "

"అయ్యయ్యో! మీరు నన్నపార్థం చేసుకుంటున్నారండీ పాపారాయుడు గారూ! నేనలాంటివాణ్ణి కాన్సార్ గంగిగోవు లాంటివాణ్ణి. నా చూపులు.. సాక్షాత్ బౌద్ధభిక్షువు చూపులు! నన్ను నమ్మండి సార్. నాది ఆజన్మ బ్రహ్మచర్యవ్రతం సార్. నిక్కచ్చి"

"అదే ప్రమాదమవుతుందని నా భయం!" గొణిగాడు రాయుడు.

"వస్తానండి.. బజారెళ్లాలి, పనుంది" కదిలాడు ఆనందభూతి.

"ఏమిటీ బజారెళ్తావా? " అడిగాడు పాపారాయుడు.

"అవున్సార్. మీకేమైనా కావాలా.. చెప్పండి, చిటికెలో చేసుకొస్తా" హుషారొచ్చింది ఆనందభూతికి. రాయుడికి ఏదైనా సాయంచేసి తను రాముడు మంచి బాలుడు అనిపించుకోవాలనుకుంటున్నాడు.

"సంతోషమోయ్! ఆషాఢభూతీ!" అంటూ ఇంకా ఏదో చెప్పబోయిన రాయుడికి భూతి అడ్డొచ్చి "నా పేరు ఆనందభూతి సార్! ఆనందమే ఆస్తిగా కలవాణ్ణి" అన్నాడు.

"ఆస్తా? దూరదృష్టి ఫైనాన్స్‌లో పెట్టక పోయావ్..." పాపారాయుడి విసురుకు ఆనందభూతి తలొంచుకుని... "సరే, పనేమిటో చెప్పండి" గొణిగాడు సిగ్గుగా.

"కాగితం, కలం తీసుకో"

"ఉత్తరం రాస్తారా? రాయండి. దారిలో పోస్ట్ డబ్బాలో వేస్తా" అంటూ టేబుల్ సొరుగులోంచి తెల్లకాగితం, జేబులోని బాల్ పెన్నూ తీసి అందించబోయాడు.

"సెల్ ఫోన్లొచ్చాక ఉత్తరాలు ఎవర్రాస్తున్నారోయ్ అమాయకుడా!" అంటూ రాయుడు దీర్ఘంగా ఆలోచిస్తున్నవాడిలా పోజుపెట్టి పడక్కుర్చీలో ఆరాంగా కూర్చుని "రాయి" అన్నాడు.

ఆనందభూతి ఆ ప్రక్కనే చిన్న రోలు ప్రక్కన పడున్న గుండ్రాయినందుకుని అతనికీయబోయాడు. అదిచూసి "నా నెత్తినేయవోయ్" అంటూ కయ్యిమన్నాడు.

రాయుడు తిరిగి కూలై "రాయి అంటే రాయిరప్పా కాదోయ్. చెప్పింది రాసుకో.. అని.. అర్థమైందా? ఇప్పుడు రాసుకో... రెండు కిలోల కందిపప్పు ఒకటోరకం.." అంటూ మొదలుపెట్టి కొన్ని సరుకుల పేర్లు చెప్పి, ఇరవై కేజీల బియ్యంతో జాబితా ముగించాడు.

"వచ్చేటప్పుడు పత్రా" అని ముక్తాయింపిచ్చి లేచాడు.

"నేనా? " ఆశ్చర్యంతో నోరు తెరిచాడు ఆనందభూతి.

"అవును నువ్వే. సాయం చేస్తానన్నావు గదా! అయినా ఈ వయసులో ప్రతిదానికీ నేనెక్కడ చావను? ఇలాంటి వాటికి పనికొస్తావనే గదా నిన్ను అద్దెకు అంగీకరించింది!"

"చేస్తా! చేస్తా సార్. పరోపకారం చేయని బ్రహ్మచారి వెధవ శరీరం దేనికి?



అంటుండేది మా నాయనమ్మ. సరే డబ్బివ్వండి..."

"డబ్బా! ముందు సరుకులు తేవోయ్. ఆ తర్వాత చివరాఖర్న లెక్కలు చూసుకుందాం..."

"లెక్కలు తేల్చుకునేదేమిటండీ... బాబూ? అదీ చివరాఖర్న. నా చిన్ని బుర్రకు ఇదేం అర్థం కావడం లేదు" భయం గుండెల్లో లాఠీచార్జి చేస్తోంది భూతికి.

"అది నా కర్థమైంది. విను! అడ్వాన్సు లక్షిచ్చా గదా! ఈ రెణ్ణెల్లయ్యాక రిజల్ట్సు పాజిటివయితే మిగతా డబ్బిచ్చి రిజిస్ట్రేషను చేసుకునేటప్పుడూ.. నెగిటివ్ అయితే నా అడ్వాన్స్ నువ్వు నాకు తిరిగిచ్చేటపుడూ- లెక్కలు తేల్చుకుందాం. వెళ్లు. వెళ్లి, పని చూడు. నాకసలే విశ్రాంతి అవసరం. డిస్టర్బెన్స్ చేయొద్దంటే వినరు. ఛ!" చర్రున తుపాకందుకుని లోపలికి వెళ్లాడు పాపారాయుడు. రాగిణి తండ్రిని అనుసరించింది.

ఆనందభూతి భీతి చెందాడు. విషాదమే సంపదైనట్లైంది.

'నెగెటివైతే లక్ష రూపాయలు ఎలా తిరిగి ఇవ్వటం? ఇవ్వకపోతే తుపాకీ పేల్తుందా? వామ్మో! అనవసరంగా ఇరుక్కున్నానా? ఆ జ్యోతిష బూచాడు చెప్పినట్లు మూడు నెలలు పూర్తికాకుండానే బలై

పోతానా? ' స్వగతంతో- సరుకుల జాబితా పై జేబులో కుక్కుకుని, ముఖమంతా భయంకరంగా ఆక్రమించిన భయం నీడల్ని నెమ్మదిగా కూడదీసుకుని, నిస్స త్తువ కళ్లల్లోకి ఇంకిపోయేలా రెప్పలకిం దికి నెట్టి, నీరసంగా బైటికి నడిచాడు.

★ ★ ★

ఆటో రయ్యిన పరుగెత్తుకుంటూ వచ్చి ఇప్పుడు సమస్యల వలయంలో వున్న ఆ ఇంటిగేటు ముందు ఆగింది.

ఆటోలోంచి దిగుతూనే ఆనందభూతి "ఏమయ్యా! యాభైకి చేంజి... అదే చిల్ల రుందా? " అడిగాడు.

"పది బాడుక్కి యాభై చేంజా? లేదండీ" అన్నాడు ఆటోవాలా.

"లోపలిస్తా.. కాస్త ఆ మూటలు లోప లికి పట్రా"

"మేము ఆటో తోలేవాళ్లమేగానీ మూటలు మోసేవాళ్లం కాదండి"

"అంటే నేను...? వార్నీ! నీ లెవలేలెవ లయ్యా! స్వతంత్ర భారతదేశం.. ఏం చేస్తాం? సరే! ఆ పెద్దమూటను నా నెత్తినె క్కించడానికి కొద్దిగా సాయం చేయడానికి ఏమైనా అభ్యంతరమా బాబూ? "

"అంత వ్యంగ్యం అక్కరలేదండి. నేనూ గ్రాడ్యుయేట్ నే" అంటూ ఆటోవాలా లేచొచ్చి బియ్యం మూటను ఆనందభూతి నెత్తినా, సరుకుల మూటను భుజానా పెట్టి "తొందరగా బాడుగ తెండి" అంటూ తన సీటులోకెళ్లి కూర్చున్నాడు.

బియ్యం మూట లూజుగా వుండటంతో ఆనందభూతి తల మూటలోకి చొరబడి అయ్యప్పల ఇరుముడిలా పోజిచ్చింది. చిన్నగా బేలన్స్ చేసుకుంటూ లోపలికి నడి చాడు ఆనందభూతి. వరండాలో ఎవరూ కనపడక 'ఏమండోయ్' అంటూ గట్టిగా రెండుసార్లు పిలిచాడు.

"అబ్బా! ఎవరయ్యా అది. వెధవ డిస్ట ర్బెన్సు.." అంటూ చిరాకు ముఖంతో, చేతిలో పుస్తకంతో బైటికొచ్చిన పాపారా యుడు... "ఓ కొట్టు గుమస్తానా? మా ఆషాఢభూతిగాడేమయాడు.. సరుకులు నీతో పంపించాడు. వట్టి పనికిమాలిన పనిదొంగలే" అన్నాడు.

ఆనందభూతికి మండింది. నెత్తిన మూటను వదిలేశాడు. అది నేరుగా పాపా రాయుడి పాదంపై పడింది.

"అబ్బ! వెదవన్నరెదవా! చంపావు గదరా? కాలు విరిచేస్తావా! తుపాకుంటే కాల్చవతల పారేసేవాణ్ణి రాస్కెల్" అంటూ తలెత్తిచూసి, భూతిని గుర్తించి "అరె! నువ్వటోయ్ ఆనందభూతీ! రిక్షావా డనుకున్నానే" అని సర్దుకున్నాడు.

"నేను ఆటోలో వచ్చాలెండి, రిక్షా కాదు. ముందు ఓ పదుంటే యిలా ఇవ్వండి. ఆటో అతను యాభైకి చేంజి లేదంటు న్నాడు" అడిగాడు ఆనందభూతి.

"అలాగా... పదివ్వాలా అతనికి? ఏదీ ఆ యాభై నోటిలా యివ్వు" అంటూ పుచ్చు కుని పది నోటందించాడు పాపారా యుడు.

ఆనందభూతి పదినోటుతో బైటికి నడి చాడు.

ఆటోవాలానుద్దేశించి "ఇదిగోనయ్యా! నీ బాడుగ. తీసుకుని వెళ్లిపో. మహా యిద్దై పోయావు.." అధిక ప్రసంగంగా అన్నాడు పది అందిస్తూ.

ఆ పది నోటునందుకుంటూ ఆటో అతను "వెళ్తాంలెండి! వెళ్లక నీ యింట్లో కాపురముంటామని అనుకుంటున్నావా? " అంటూ ఆటో స్టార్టు చేస్తూనే యమస్పీ డుగా లాగించి మాయమైపోయాడు.

"అమ్మ నీ... ఎంతమాటన్నాడూ! ఛ! ఈ వెధవల నోళ్లల్లో నోరుపెట్టలేం" సణు క్కుంటూ లోపలికొచ్చాడు ఆనందభూతి. వచ్చే అతన్ని గమనించి పాపారాయుడు

లేచి లోపలికెళ్లబోయాడు.

"రాయుడుగారూ! మిగతా చిల్లరివ్వండి" అడిగాడు ఆనందభూతి.

పాపారాయుడు ఆగి "ఏం చిల్లరోయ్? " అన్నాడు.

"అదే... యాభై యిచ్చా గదా? " ఆనందభూతి.

"ఓ అదా? ముందామూటలు లోపలికి చేర్చు, బైట పడేస్తే ఎలా? "

"ఊc" అంటూ ఆనందభూతి ఉసూరుమంటూ లోపల్లోపల ఉడుక్కుంటూ మూటలను రాయుడుండే పోర్షనులోకి చేర్చాడు. బట్టలు దులుపుకుంటూ వరండాలో కొచ్చి "చిల్లరివ్వండి..వెళ్లాలి. వంట పనుంది" అడిగాడు మళ్లీ.

"అబ్బ! చిల్లరచిల్లరంటూ నావెంట పడ్డావేమిటోయ్ చిల్లరమనిషి లాగా. ఊc... ఇదిగో తీసుకో..." మూడు పదులు చేతిలో పెట్టాడు రాయుడు.

"ఇదేమిటి ముప్పయ్యే యిచ్చారు? " అన్నాడు భూతి ఏదో ఆలోచిస్తూ.

"ఏం ఎక్కువిచ్చానా? "

"ఎక్కువేంటండీ.. తక్కువిచ్చారు. నేనిచ్చింది యాభైనోటు గదా? "

"అవును. నేనూ యాభైకే గదా చిల్లరిచ్చింది. యిందాకెంతిచ్చాను? "

"పది.." ఆనందభూతి

"ఇప్పుడెంతిచ్చాను? "

"ముప్ఫయ్యి..."

"ఆటోవాడికెంతిచ్చావు? "

"పది..."

"మొత్తం యాభై.. సరిపోలా...? "

"అది కాదండీ.. నేను యాభై..."

"కన్‌ఫ్యూజనెందుకోయ్.. ఆషాఢభూతీ"

"నాపేరు ఆనందభూతండీ.. ఆనందమే సంపదగా కలవాడిని..."

"ఆ... ఆ... చూస్తునే వున్నా.. నీ ఆనందం - సంపద. ఏదీ పెళ్లి చేసుకో కనిపిస్తుంది.. ఆనందం.. అంతేగానీ.."

"పాపారాయుడుగారూ! మీకు దణ్ణం పెడతా.. పెళ్లి మాటెత్తకండి"

"ఏం పాపం? ఎలర్జీనా- యాంటీఫిమినైనా-? "

"అదిగాదండీ.. నా యాభై చిల్లర? "

"ఓరి తండ్రో! ఇంత అయోమయంగా డివి ఎలా బతుకు నెట్టుకొస్తావోయ్ ఒంటరిగా? చూడు. నేను ముందుగా పదిచ్చా గదా? "

"అవును ఇచ్చారు"

"ఇప్పుడెంతిచ్చానూ... మూడు పదులు అవునా? "

"అవును .పదీ ప్లస్ ముప్ఫై.. నలభై"

"ఆటో అతనికెంతిచ్చావు? "

> **కొత్తగాలి...**
>
> **అమ్మ ఎప్పుడూ**
> **ఇంతే!**
> **నాకు జలుబు చేస్తే**
> **తను తుమ్ముతుంది!**
>
> – లోగిశ లక్ష్మీనాయుడు,
> సింహాచలం

"పది"

"మరి నలభై ప్లస్ పది యాభై.. సరిపోయింది గదా? "

"సరిపోయినట్లే వుంది.. కానీ..."

"లోపలికెళ్లి వంటపని చూడు... ఎండలో మూటలు మోశావు. మెదడు కదిలి కాస్త కరిగుంటుంది.. లోపలికెళ్లి ముందు గ్లాసెడు మజ్జిగ తాగి రవంత విశ్రాంతి తీసుకుని పనిమీదికెళ్లు. అన్నం మాత్రమే ఉడకేసుకో. కూర అమ్మాయి తెచ్చిస్తుంది, లాగిద్దువుగాని. వెళ్లు.. నన్ననవసరంగా డిస్టర్బ్ చేయకు" చటుక్కున

రాయుడు లోపలికెళ్లాడు.

ఆనందభూతికి తల తిరిగినంత పనయింది. అయోమయంగా కుర్చీలో కూలబడ్డాడు శూన్యంలోకి వెర్రిచూపులు చూస్తూ! రాగిణి లేడిలా గెంతుతూ వచ్చింది... "ఏమండోయ్ భూతిగారూ!" పిలిచింది. పలకలేదతను. దగ్గరకొచ్చింది. "భూతిగారూ! భూతిగారూ!" గొంతు అరుపు స్థాయికి పెంచి, తిరిగి పిలిచింది గట్టిగా.

చర్రున లేచాడు. "భూతేంటండీ భూతీ? నాపేరు ఆనందభూతి! భూతీ కోతీ అని..." అన్నాడు వికారంగా ముఖంపెట్టి ఎటో చూస్తూ.

## కొత్తగాలి...



**పుట్టింటి మొగ్గ**
**అత్తింట పూవై**
**కాయలు కాసేది**
**ఆడపిల్ల జీవితం**

– అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు, ప్రకాశం జిల్లా

"ఛ! మీరు కోతేంటండీ? అచ్చు సినీ స్టార్ బాబూమోహన్‌లావుంటే? "

"ఆc!- ఏమన్నారు? "

"సారీ! హీరో మోహన్‌బాబులా వున్నారు ఎంచక్కా! ఏదో మీపేరు పూర్తిగా పిలవడం ఫేషనుగా వుండదుగాని చివరి రెండక్షరాలు తీసుకుని 'భూతీ' అని ఆధునికంగా పిలిచా ముద్దుముద్దుగా. బాలేదా మీకు? " అన్నది రాగిణి ఎంతో చొరవ చేసుకుని.

"బాగోలేదుగాక బాలేదు. నేను యాంటీ ఫిమినైన్‌ని. ముద్దుపేరుతో, కొద్దిబుద్ధితో మీలాంటి ఆడంగులు పిలవడం నాకస్సలు బావుండదు. ప్రస్తుతం నా మనసే బావుండలేదు, వెళ్లిపోండి!" చిరాగ్గా అన్నాడు ఆనందభూతి.

"మనసు బాగోలేదా? అయ్యో! ఏమిటి సమస్య? చెప్పండి, నేనేమైనా సాయం చేయగలనేమో చూద్దాం! ఇలాంటి సమయాల్లోనే తోడవసరం. మనిషికి మనిషి మాట-చేత సాయం అందితేనే మనసు తేలిగ్గా హాయిగా వుంటుంది. మనసులోని చిరాకులు అందమైన ముఖంలో అష్టవంకరలు కలిగిస్తాయి- అని మానాన్న ఎప్పుడూ చెప్తుంటారు"

"ఎవరు చెప్పినా యిలాంటి మాటలు నిజమేననిపిస్తాయి. భరోసా కలిగిస్తాయి- ఏవేవో ఆలోచనలు మరో మార్గానికి లాగుతాయి.. సరి సరి.. వెళ్లండి... నన్నొదలండి... చాలా టైమైంది. అన్నం వండుకోవాలి..." ఉస్సురంటూ లేచాడు.

ముఖంలో అలసట!

"వంటా? ఒక్క నిమిషం..." అంటూ తుర్రున తూనీగలా లోపలికి పరుగెత్తి మరుక్షణంలో చర్రున కేరేజీతో తిరిగొచ్చింది రాగిణి. ఇదిగోండి మీవంతు విందుభోజనం! లాగించండి, వంటమాట మర్చిపోయి" అంది.

కేరేజీ చూడగానే ఆనందభూతికి నిజంగానే ఆనందసంపద చేతికందినట్లనిపించింది. కానీ మరుక్షణంలో సర్దుకుని "ఒద్దొద్దు... ఒద్దండీ! అన్నమేగా.. అర నిమిషంలో ఓవెన్‌మీద వొండేస్తా. ఆంధ్రా మాత చట్నీ, పెరుగుబిళ్లా, ఊర మిరపగాయ్ వుండనే వున్నాయ్"

"ఇది నా అరేంజిమెంట్ కాదు మహాశయా! నాన్నగారు.. ఈరోజాయన తుపాకీ కొన్నరోజు.. దీనికి 'తుపాకిదినం' అని పేరుపెట్టి ప్రతిసంవత్సరం ఈ రోజున ఒకరికి భోజనం పెట్టే ఆనవాయితీ నేర్పరిచారు. అందుకే, ఈ కారియరు తీసుకోండి. ఒద్దంటే ఆయనక్కోప మొస్తుంది.

అసలే తుపాకి దినం!" అంటూ లోపలికి వెళ్లిపోయింది.

ఆకలి నకనకలాడుతున్నా ఆనందభూతి ఇంకా బింకంగా కారియరు వైపు చూడసాగాడు. అదేక్షణంలో రాయుడి- 'తుపాకి గొట్టంద్వారానే మనుషుల మూర్ఖం వదిలిపోతుంది' అనే స్లోగనూ, తెరిచిన పాము నోరులా కనిపించే ఆయన తుపాకి గొట్టమూ జ్ఞాపకానికొచ్చి, తక్షణం కేరేజీ అందుకుని తనవాటాలోకి దూరాడు.

★ ★ ★

వరండాలో రాగిణి డేల్ కార్నెగి 'హౌ టు మేక్ ఫ్రెండ్షిప్ అండ్ ఎక్స్టెండిట్ ఇంటు రిలేషన్‌షిప్' పుస్తకం చదువుతూ కూర్చుంది. ఆనందభూతి బైటికి వెళ్లాలని తన గదిలోంచి వచ్చి ఆమెను గమనించి తిరిగి లోపలికి వెళ్లబోయాడు.

అదిచూసి రాగిణి "మామూ! మామూ! ఒక్క నిమిషం ప్లీజ్" అని పిలిచింది.

"మామూ...నా? అదేం పిలుపు... అసలు దానర్థమేమిటి? " అన్నాడు.

"భూతీ అంటే తిట్టారు. బావా అంటే కొట్టొచ్చారు. మధ్యేమార్గంగా వుంటుందని యిలా 'మామూ' అంటున్నా. మామూ అంటే అమ్మ తమ్ముడు అని. బాందా? "

"నా బొందలా వుంది మధ్యేమార్గం. అధోమార్గం. ఆకాశమార్గం ఇవేవీ వద్దు. అంతగా అవసరమైతే 'ఏమండీ! ఆనందభూతిగారూ!' అని పిలవండి. వరసలొద్దు. అయినా నేను యాంటీ ఫిమినైన్. నన్ను మీరుగా పిలవాల్సిన, మాట్లాడాల్సిన అవసరం రానీయకుండా వుంటే మంచిది" ఆమెవైపు తన వెనకభాగం తిప్పి నిలబడి చెప్పాడు.

"అబ్బా! ఎందుకండీ అంతకోపం? అసలు మీకు స్త్రీలపై అంతద్వేషం ఎందుకో కాస్త చెప్తారా? " నిలదీస్తున్నట్లు అడిగింది, విషయం తేల్చాలనే నిర్ణయంతో.

"ఇప్పుడు నేనేమిటి? గౌతమబుద్ధుడే నాడో చెప్పాడు.. 'సమస్యలన్నీ స్త్రీల వలననే వస్తాయి, వాళ్లకు దూరంగా వుంటేనే మనశ్శాంతీ, ప్రపంచశాంతీ- అని. అంతకంటే కూడా సాక్షాత్ హిమాలయాల నుండి విచ్చేసిన ఒక మహాయోగి నాకు బోధించిందేమిటంటే 'వత్సా! స్త్రీలను పెళ్లాడేకంటే కాళ్లూ చేతులకు సంకెళ్లు తగిలించుకుని విశాఖ డాల్ఫిన్స్ నోస్ నుండి బంగాళాఖాతంలోకి లాంగ్ జంపుతో దూకడం ఉత్తమం!' అని. ఆ మహత్తర సూక్తులే నన్ను ప్రభావితం చేసి ఈ స్థితికి పెంచాయి"

"ఉద్ధరించాయి.. ప్రపంచంలోని ప్రతి పురుషుడూ మీలాగే ఆలోచించి ఆచరిస్తే ఈ విశ్వమేమవుతుంది? "

"బంగాళాఖాతం నిండిపోద్ది. ఆపైన విశ్వం ఆనందంగా మారిపోద్ది. ఎక్కడా అలజడి, ఆందోళన వుండదు. అవును పెళ్లీ, పెళ్లామంటూ పరుగులు పెడుతున్న ఈ మగాళ్లంతా ఏం ఉద్ధరిస్తున్నారు? తినడం, తిరగడం, నిద్రపోవడం, జనాభాని పెంచుకుంటూ పోవడం తప్ప వీళ్లు చేయగలుగుతుందేమిటి? పోనీ తాము పుట్టిస్తున్న జనాభాకనుగుణంగా వాళ్ళకవసరమైన కూడూ గూడూ గుడ్డా తదితర సౌకర్యాలను ఎవరికివాళ్లు సృష్టించగలుగుతున్నారా? సమకూర్చుకో గలుగుతున్నారా? ప్రాణం పోయగలిగినవాళ్లకే ప్రాణం పొందేహక్కు అన్నట్లు ప్రాణిని పోషించగలిగినవానికే ప్రాణిని పుట్టించే హక్కుండాలి. ఇదే నా స్లోగన్" గొప్పగా చెప్పానన్నట్లు హాయిగా నిట్టూర్చాడు.

"ఒంటరిగా మీరేం సాధించగలరు? అసలు దీనినుండి మీరేమిటి ఆశిస్తున్నారో చెప్పండి"

"బోలెడు ఆత్మాభిమానం. స్వచ్ఛమైన స్వేచ్ఛ. ముఖ్యంగా వ్యక్తి స్వాతంత్ర్యం..

అది మగవాడి అమూల్యాభిజాత్యం" ఆత్మ విశ్వాసంతో అన్నాడు ఆనందభూతి.

"ఓర్నాయనో చాలా వున్నాయే.. పెళ్లా డితే మగాడి నుంచి అవన్నీ పోతాయా పాపం.."

"కచ్చితంగా.. తాళిగట్టిన మరుక్షణం.. మటుమాయం"

"అదంతా మగాడి అహంభావం, అజ్ఞానం, మూర్ఖం... హలో! అవన్నీ మాయంకావు, యింకా రెట్టింపవుతాయి తెలుసా? ఎందుకంటే.. ఆడుకోడానికి పెళ్లామనే ఆడబొమ్మ దొరుకుతుంది మగా డికి. అసలు మీ దృష్టిలో స్వేచ్ఛా స్వాతం త్ర్యాలు గట్రా అంటే అర్థమేమిటో వివరి స్తారా ఆనందభూతిగారూ? "

"ష్యూర్! వినండి! పెళ్లవకముందు మగ పురుషుడు.. హాయిగా, స్వేచ్ఛగా గుడిగో పురం గూటి పావురాయిలా గునుస్తూ తిరి గేస్తాడు. ఫరెగ్జాంపుల్ సిగరెట్ తాగే వాడు తాగుతాడు. పేకాటాడేవాడు ఆడు కుంటాడు. మందు అలవాటున్నవాడు హాయిగా మందుకొట్టి మజా అనుభవి స్తాడు. ఎక్కడెక్కడో హుషారుగా, ఉల్లా సంగా తిరిగితిరిగి ఏ అర్ధరాత్రో యింటికి చేరేవాడు నిర్భయంగా, నిరాటంకంగా అలా తిరిగి ఆనందిస్తాడు. వాళ్ల మానవ హక్కుల్ని ప్రశ్నించేవాళ్లుండరు. అడ్డుకునే వాళ్లుండరు. అదే పెళ్లాడాడో.. పెళ్లామనే గొళ్లెం వచ్చి తగుదునమ్మా అంటూ వీటన్ని టికీ కళ్లెం తగిలించి ఖబడ్దార్ అంటుంది. యింకేముంది? విషాదపర్వమే. పెళ్లికి ముందు పులిలా గాండ్రిస్తూ తిరిగిన మగాడు పెళ్లాం రాగానే 'మ్యావ్' అంటూ పిల్లికూనైపోతాడు. దట్టి డోన్ట్ లైక్"

రాగిణికి ఒళ్లు మండిపోయింది.

"మరి పెళ్లయినాక కూడా మీరు వల్లిం చిన 'మానవ హక్కుల్ని' టోటల్‌గా ఆచ రించి అర్ధరాత్రి దాటాక్కూడా పెళ్లామనేది తలుపులు తెరుచుకుని గుమ్మానికి చేరబడి 'నీవురావు నిదురరాదు' లాంటి దిక్కుమా లిన వెర్రిమొర్రి పాటలు కూనిరాగాలు తీస్తూ మొగుడికై ఎదురుచూడకపోతే- అతగాడొచ్చీరాగానే 'నాకోసం ఎదురు చూట్టంలేదెందుకే' అనీ.. ఎదురుచూ స్తుంటే 'ఎవడికోసమే ఈ పడిగాపులూ' అనీ సమాధానం వినకుండానే ఏ కర్రో కత్తో పుచ్చుకుని భార్యాపిల్లలను బాది, హింసించి, రాక్షసానందం పొందే మగపు రుషుల విషయం ఏం చెబుతారు? " నిల దీసింది ఆవేశంగా రాగిణి.

ఆనందభూతి అవాక్కయ్యాడు. తడబ డుతూ "ఏ... ఏమో? " అన్నాడు, ఏమ నాలో తోచక.

అతని బుర్రలో వ్రేలాడదీయబడిన 'యాంటీ ఫెమినైన్' చార్టు సడలి వూడి వూగుతున్నట్లు అనిపించిందతనికి.

"ఏమో అంటే మీకు తెలియదా? లేక అవి కూడా మలవరపు గిత్తలాంటి మగాడి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలలోనూ, మానవ హక్కులలోనూ ఒక భాగమే ననుకుంటు న్నారా? మీరు చెప్పలేరు. పోనీ యిది చెప్పండి... మీరు సిగరెట్ తాగుతారా? "

"ఛ! నాకా కంపే పడదు. పైగా కేన్సర్ కారకం" వెంటనే అన్నాడు.

"పేకాటాడతారా? "

"నో. పేక ఎన్ని ముక్కలో కూడా నాకు తెలీదు"

"పోనీ మందు కొడతారా? "

"ఛీఛీఛీ.. యాక్! మందేసుకునే వాళ్లన్నా నాకు ఎలర్జీ.."

"అయ్యోపాపం! మరి అడిగేవాళ్లు లేరుగ దాని అర్ధరాత్రిదాకా ఎక్కడెక్కడో బలా దూర్ తిరిగి వస్తారేమో.. అవునా? "

"నెవర్... హవ్ డేర్యూ... నేను యాంటీ నాచ్‌ని తెలుసుకోండి.."

"మరో గిరీశంగారా మీరు? "

"కాదు.. అచ్చమైన ప్రవరాఖ్యుళ్లాటోణ్ణి"

"శభాష్ ఆనందభూతిగారూ! సిగరెట్ కాల్చరు. పేకాడరు. మందు ముట్టరు. యాంటీ నాచ్చి. పెళ్లికి విముఖత. ఆడ దంటే అలర్జీ..."

"ఎగ్జాట్లీ.. యువార్ పెర్‌ఫెక్ట్లీ రైట్... దటీజ్ ఆనందభూతి!"

"మరి మీరు బతికేది దేనికండీ ప్రవరాఖ్యరూప గిరీశంగారూ? "

"స్వేచ్ఛకి" టక్కున అనేసి, తేరుకుని "ఆఁ! వాడ్డూయూ మీన్? " అన్నాడు ఆనందభూతి. అతని ముఖం నల్లబడింది. గొంతు తడారింది. ఆమెవైపు చూడలేకపోతున్నాడు. గిల్టీ ఫీలింగ్! కానీ బింకం!

రాగిణి వదల్లేదు, వేడిమీదే ఇనుముకు మరో దెబ్బ అవసరం. సుత్తె ఎత్తింది సీరియస్‌గా. "అయ్ మీన్... మీ జీవితమ్మీద మీరు యిన్ని ఆంక్షలు పెట్టుకుని.. తమర సలు జీవితాన్ని కొనసాగిస్తోంది దేనికొరకో ఎప్పుడైనా సమీక్షించుకున్నారా? నో ఆన్సర్! అసలు మీ ఆలోచనలలో స్వేచ్ఛాస్వాతంత్ర్యాలంటే- ఆడయినా మగయినా వాళ్లకి వుండే మానవహక్కులంటే- ఏమిటో మీకే సరైన అవగాహన.. మీకే కాదు ఎంత చదివినా చాలామంది మగాళ్లల్లోనే లేదు. వుండదు! మీరనుకునే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, హక్కులు ఆడదానిపట్ల ఈ దేశంలోని సగటు మగాడు ఆశించేవే! అది కేవలం పురుషాహంకారాభిజాత్యాలకు నిలువెత్తు అభిషేకం! మగాడు ఏంచేసినా, ఎలా ప్రవర్తించినా ఆడది ఎప్పటిలా బల్ల చెక్కలా, చల్లదుత్తలా జీతం కోరని పనిమనిషిలా, మేత అడగని పాడిగేదెలా పడుండాలి.. అవునా? "

ఆమె మాటలకు అతని గొంతు తడారి పిడచకట్టుకుపోతోంది.."

"మ... మ... మరి సంపాదించి పోషించే మగాడికి ఆమాత్రం 'యిది' వుండొద్దా? " ఎలాగో నసిగాడు, మరేమనాలో అర్థంగాక.

"మరి ఆడదీ సంపాదిస్తుంటే ఆ యిది ఏమవుద్ది... పోషణంటారు... పెళ్లినాడే ఆడది తన జీవితాంతం పోషణకి సరిపడా రూపాయిల మూట తేనిదే దాని మెడలో పలుపుతాడు కడతాడా మగాడు? మరి ఆ మూట విషయం మాట్లాడరేం? " నిక్కచ్చిగా నిలదీసింది రాగిణి. బిత్తరపోయాడు ఆనందభూతి. నక్కిళ్లు కదబడ్డాయి.

గొంతు సవరించుకుని "ఏమిటిదీ రోజు నన్ను పట్టుక్కూర్చోబెట్టి తలంటుతున్నారు? నేనెలా దొరికిపోయాను? తిక్క తిక్క ప్రశ్నలతో నన్నీవిధంగా తికమకపెడతారేంది? నాకేం తెలియదు.. నన్నింకేం అడక్కండి.. వెళ్లండి" అన్నాడు చిరాగ్గా.

"మరి అన్యాయంగా ఆడాళ్లను ద్వేషించడమొక్కటే తెల్సునా యాంటిఫిమినైన్ గారూ? "

"అసలు మీరివన్నీ నన్నెందుకడుగుతున్నారు? వామ్మో! ప్రశ్నల శరసంధానంతో ఆముదపు చెట్టంత మగాణ్ణి తిరుగు సమాధానం చెప్పలేని విధంగా గాయపరిచావే.. నిన్నెవడు కట్టుకుంటాడో గాని వాడి బతుకు కోటప్పకొండ మెట్లేగా? ఓర్నా

### కొత్తగాలి...

**ఆమె నవ్వితే దీపావళి**
**ఆమె మాట్లాడితే దీపావళి**
**ఆమె.. నిజంగా**
**దీపావళి జ్యోతి**

– శ్రీకాళహస్తి వెంకట శేషగిరిరావు,
నెల్లూరు

యనో- ఓర్నాయనో- అందుకే నేను పెళ్లన్నా ఆడాళ్లన్నా ఆమడదూరం పరార్. అసలు యిలా గిలకబావిలో నీళ్లు తోడి పోసినట్లు మాటలు విడిచే నిన్ను ఇంత దూరం యాక్సెప్ట్ చేయడం నాదీ తప్పు" ఉక్రోషంతో అనే మాటలు చివరికి ఏకవచన ప్రయోగంలోకి మారినట్లు అతను గమనించాడోలేదో..

ఆ మాటల్లో రాగిణికి మరోటేదో అందినట్లై.. వెంటనే అంది "ఏమిటి మీరు నన్ను యాక్సెప్ట్ చేశారా? అంటే.. అంటే మీరు.. నాన్నోయ్.. నాన్నా! రండి! చూడండి! ఈయన.. ఈ దొంగ బ్రహ్మచారి నాకు లైనేస్తున్నాడు.." అంటూ పెద్దగా అరుస్తూ లోపలికి పరుగెత్తింది.

## కొత్తగాలి...



**కనిపించని దేవుడంటే**
**ఎంతో భక్తి!**
**కనిపించే అమ్మనాన్నలంటే**
**ఎందుకు విరక్తి?!**

– కూన మల్లేశ్వరరావు,
శ్రీకాకుళం

ఆనందభూతి గతుక్కుమన్నాడు. నోట మాట రాలేదు. చమటలు పట్టాయి.

'అమ్మో! అమ్మో! ఎంత భయంకరమైన ఫినిషింగు టచ్చిచ్చిందో!' అనుకుంటుండగానే పాపారాయుడు చేతిలో తుపాకీతో పులిగాండ్రింపులాంటి గర్జనతో "ఏంవాయ్ ఆషాఢభూతి! పనికిమాలిన బ్రహ్మచారి బుర్ర కొరివి దయ్యాల తొర్ర అన్నమాటని నిజం చేస్తున్నావా?" అంటూ ఒక్క అంగలో వచ్చాడు.

ఆనందభూతి హడలిపోయాడు.

"పా..పా... పాపారాయుడు గారూ! మీరు పెద్దమనిషి. తొందరపడకండి.. నే..నేనే పాపం ఎరగను? ఏ పాపం ఎరగను? మాటిమాటికీ ఆ తుపాకీ తెస్తారెందుకు? వామ్మో పేల్తుందేమో? దాన్నటు కేసి తిప్పండి. ప్లీజ్.. అసలు దాన్నవతల పెట్టి.. కూర్చోండి స్థిమితంగా. మంచిగా మాట్లాడుకుందాం" అన్నాడు ఆనందభూతి ఒణికిపోతూ.

"తుపాకీ గొట్టంతోనే వాస్తవాలు వరదలా బైటికొస్తాయి. చెప్పు, ఏం చేశావ్ నా బిడ్డను? అదెందుకు గొల్లుమని ఏడుస్తూ లోపలికొచ్చింది- రక్షించు నాన్నా- అంటూ. చెప్పు" గద్దించాడు.

"అయ్యయ్యో! నేనేమీ అనలేదండీ. 'రక్షించండి' అన్న ఆక్రోశం చెందేంతటి సీనేమీ జరగలేదిక్కడ. సరస్వత్తోడు.. నా మాట నమ్మండి.. ఏమీ లేని దానికి అంత పెద్దగా అరవకండి సర్. చుట్టుపక్కల వాళ్లు.. అసలే ఆంధ్రులు గదా, వినోదం కావాలి వాళ్లకు. ఇక్కడేదో రగడ జరుగుతోంది.. ఎంజాయ్ చేద్దాం.. అవకాశాన్ని బట్టి ఎద్దేవా చేద్దాం..అని పరుగెత్తుకొస్తారు. ఇంతకాలం ఏదో పరువుగా బతుకుతున్నవాణ్ణి. ఒక్కసారిగా నా పరువు, మానం, మర్యాద.. మూడేళ్ల నుండీ ఏకధాటిన, అంతంలేనట్లు తవ్వకాలే కనిపిస్తూ నిర్మాణంలో వున్న డ్రైనేజీ కాలవల్లో కలిసి కంపైపోతుందండీ.. ప్లీజ్... నా మాట నమ్మండి" దీనంగా వేడుకున్నాడు.

"నన్నెలా నమ్మమంటావ్? నువ్వా మగపురుషుడివేగా. కుర్రకుంకవేగా... బెమ్మచారి ముండావాడివేగా? ఎంత వ్రతం, దీక్షలు.. అనే తాటాకు మంటల్లో చలి కాచుకుంటున్నా ఉప్పూకారం బిర్యానీ లాగించే వాడివేగా? మరి ఆ వేడి ఎక్కడ తగలడుతుంది? అది పెళ్లికావలసిన పిల్ల.. ఈ అల్లరిపడితే దాన్నెవరు పెళ్లాడతారు? హే భగవాన్! ఈ దేశంలో ఆడ

పిల్లల్ని కన్న తండ్రులకు ఆవేదన, అవమా నాలు తీరేదెప్పుడు? " పాపారాయుడు చేతి లోని తుపాకీని మెల్లగా పక్కనపెట్టి మెలో డ్రామాను ప్లే చేస్తున్నాడు.. రానికన్నీళ్లను తుడుచుకుంటూ, మాటిమాటికీ ఉద్వేగంతో చేతులను ఆకసంవైపు విసురుతూ.

"అయ్యో! అర్థం చేసుకోండి రాయుడు గారూ! నేను బ్రహ్మచర్య వ్రతం పట్టాను... యాంటీఫిమినైన్ దీక్ష... ఆడపిల్లను నేనెలా అల్లరిచేస్తాను, చెప్పండి? మీకెలా చెప్పను. ఎలా నమ్మించను? మిమ్మల్ని బ్రతిమలాడడానికి యిక మీ శరీరంలో మిగిలింది ఈ గడ్డమొక్కటే. మీ గడ్డం పట్టుకు వేడుకుంటున్నా.. మీ తుపాకీ గొట్టం మీదొట్టు.. నేనేపాపం ఎరగను! నా శీలాన్ని శంకించకండి.. ఆ మాయదారి మాయల వాస్తు బూచాడు నా యింట అడుగుపెట్టినప్పటి నుండీ నాకీ గండాలొ స్తున్నాయి. గుట్టుగా బతుకుతున్న నన్ను రట్టుచేసి బజార్లోకి ఈడ్చకండి సర్. మీకు పుణ్యం వుంటుంది.. ప్లీజ్"

ఏడ్చినంత పనిచేశాడు.

పాపారాయుడికి నిజంగానే జాలేసింది.

"సరే, ముందు నా గడ్డం వదిలి... వెళ్లిపో! మళ్లీ యిలాంటి రచ్చబండ కార్య క్రమం జరక్కుండా చూడు. లేదో తూటాలు కొనుక్కొచ్చి వేసి, నా తుపాకీ పేల్చాల్సుంటుంది నిర్దాక్షిణ్యంగా..."

"అంటే... దీంట్లో యిప్పుడు తూటాలు లేవా? " అమాయకంగా అడిగాడు.

"వుంటయ్... తెచ్చి వేస్తాగదా... అవస రాన్ని బట్టి- ఇక వెళ్లు..." మెలోడ్రామాకి రాయుడిలా ముగింపియ్యగానే, 'బతుకు జీ వుడా!' అనుకుంటూ తిరిగి చూడకుండా ఆనందభూతి తన వాటాలోకి పోయాడు.

ఒక్క రెండుక్షణాల విరామంతో.. గొల్లు మంటూ.. ఓ చేతిలో ఏదో కాగితం పట్టు కుని మరో చేతిలో బారెడు పురికొస పట్టు కుని పరుగెత్తుకొచ్చింది రాగిణి.

"నాన్నోయ్.. నాన్నా! అయిపోయింది నాన్నా.. అయిపోయింది. అంతా ఐపో యింది" అని అరుచుకుంటూ.

"ఏమైపోయిందమ్మా... వంటా? సరే, వడ్డించు. వస్తున్నా.. దానికంత అరుపు లెందుకు? " అంటూ లేచాడు పాపారా యుడు, తాపీగా తుపాకీని చేతిలోకి తీసు కుంటూ.

"అయ్యో వంటకాదు నాన్నా! తంటా.. పెద్ద తుంటరి తంటా వచ్చింది" పెద్దగా అరిచింది.

ఆ అరుపులు విని బిగుసుకుపోతూ.. మళ్లీ ఏమ్మొంచుకొచ్చిందోనని పరుగెత్తుకొ చ్చాడు ఆనందభూతి.

మరో మెలోడ్రామా సీనుకు తెరతీసింది రాగిణి - ఊగిపోతూ "నాన్నోయ్! ఈ దినంతో మీ కూతురి జీవితం నాశనమైపో యింది. మన పరువు చెన్నైకూవంలో కల్సిపోయింది. శీలం హైద్రాబాద్ మూసీలో మునిగిపోయింది. అయ్యయ్యో! ఇంతటి అన్యాయమా! నాకేది దారి? చూస్తున్నారా! ముక్కోటి దేవతలారా? మీరే సాక్ష్యం.. అరవయ్యారు వేల పవిత్ర గోపికా లలామల్లారా! మీరే అండ! అనం తకోటి దేవతా పతివ్రతామ తల్లుల్లారా! మీదే దీవెన! - నాన్నా! నాకు శెలవీ యండి. నేను వెళ్లిపోతున్నా, నాకిక ఆత్మ హత్యే శరణ్యం"

"ఆc- ఆత్మహత్యా! అందుకా ఆ పురి కొస! అదెక్కడాగుతుంది తల్లీ! పుటుక్కుమ నదా? కింద పడతావ్. దెబ్బల్తగుల్తాయి" రాయుడాశ్చర్యంతో అన్నాడు.

ఆలోచనలు కదిలే మెదడూ, మాట లూరే నోరూ ఊరుకోక అందుకున్నాడు ఆనందభూతి. "అవునండీ! ఆధునికంగా ఆత్మహత్యకు చాలా మార్గాలొచ్చాయి. అందుబాటులో వుండే చక్కని చున్నీకి

వేలాడటం బెటర్. ఈ మధ్య చాలాచోట్ల చున్నీలనే ఇందుగ్గాను ఆడపిల్లలు ఆయుధీ కరిస్తున్నారు" భూతి ఉచిత సలహాకి రాగిణి చురచుర చూసింది.

పాపారాయుడు కసిరాడు. "నువ్వుండవోయ్ ఆషాఢభూతీ! పాపకళ్లు శ్రావణ మేఘాల్లా వర్షిస్తుంటే నీకు జోగ్గావుందా? - అమ్మా రాగిణీ! ఆత్మహత్య సీనుకు లాక్కొచ్చిన ఆ బాధేమిటో చెప్పు. ఎలాగూ నా తుపాకిలో తూటాలు కొని వేయాల్సిన సమయమొచ్చినట్లుంది - చెప్పు - ఏం జరిగింది? " గర్జించాడు పాపారాయుడు.

"నా నోటితో నేను చెప్పలేను నాన్నా. ఇది చదవండి" తన చేతిలోని కాగితాన్ని పాపారాయుడి కందించి కుర్చీలో కూలబడింది.

పాపారాయుడు చదువుతూనే అగ్నిపర్వతం బద్దలయినట్లు ఉగ్రుడయ్యాడు.

"ఆc! అమ్మా! అమ్మా! ఎంత ధైర్యం - గుండెలు తీసినబంటు. ఇక లాభం లేదు. ఏదీ నా తుపాకి, ఏవీ తూటాలు? అమ్మా తుపాకి వద్దు నా లైసెన్స్ ఎక్స్‌పెర్ అయిపోయింది. బాబాయి కత్తుల రత్తయ్యని పిలవనా? జైల్లో వున్నాడో బార్లో వున్నాడో! అవేగా ప్రస్తుతం క్రిమినల్స్ ఆవాసాలు? సెల్లందుకో" అరిచాడు.

"అమ్మో! బాబాయొద్దు నాన్నా! ఆయనొచ్చాడా? బొడ్లో బెల్టుకి రకరకాల కత్తులు- కళ్లల్లో రక్తపుజీరలు- గుండెల్లో క్రోధపు ధారలు- దయాదాక్షిణ్యాలుండవు. ఆయన్నాపలేం. హత్యలు, నరకడాలొద్దు. పాపం- మీరే సమస్య సులభంగా పరిష్కారమయ్యేలా అహింసామార్గం ఆలోచించండి"

ఆనందభూతి అయోమయంగా చూస్తున్నాడు "ఏమిటండీ? మీ మాటలు అర్థం గాక నాకు చెమటలు పట్టిస్తున్నాయి. అంతటి ఘోర వార్తేమిటి? ఏ ముందందులో? ఆ కాగితమిలా ఇవ్వండి" అంటూ పాపారాయుడి చేతి నుండి తీసుకుని పైకే చదవడం ప్రారంభించాడు.

"నా రంజైన రాగిణీ! అమ్మోయ్! ఇది ప్రేమలేఖలా వుంది. నేను చదవనులెండి. అయినా వణికిపోయేంతటి సమస్యను తెచ్చింది గదా... చదవాలి" అంటూ చదవడం మొదలుపెట్టాడు.

"నా రంజైన రాగిణీ! నా గుండెల్లో గూడు కట్టుకుని నిద్రించే నా వలపు భాగినీ! లే! నిద్రలే! చాలిక, కళ్లు తెరువ్" ఆశ్చర్యంతో చదవడం ఆపి, "వీడెవడో ప్రేమ పిచోళ్లా వున్నాడండి. మీరు నిద్రలో వుండగా కిటికీలోంచి దొంగ కార్చుకుంటూ దొంగలా చూస్తూ రాసినట్టున్నాడు రాస్కెల్. ఆ.. ఆ.. కళ్లు తెరువ్! నీ చుట్టూ నీ కళ్లముందే పావురాళ్లలా కువకువలాడ్తూ తిరుగుతున్న అందాల ప్రేమరాయుళ్లను చూడు.. మీ నాన్నెలాగూ నీకు పెళ్లి చేసేలా లేడు..." ఆపి తిరిగి కామెంట్- "ఓరి వెధవన్నరెధవా! వీడికెందుకో బాధ? " తిరిగి చదువుతూ- "రా! రాగిణీ రా! నాతో చేయీ చేయి కలుపు. కళ్లూ కళ్లూ కలుపు. ఆపై మనసు మనసూ కలుపు" ఆగి- "అమ్మ గాడిదా! ఏమిటీ కలపడాలు.. పప్పూ పులుసూ అన్నంనా? రాస్కెల్! వుండుండు నీ పుండు రేపి కారం పెడతా రేపు.

నిన్ను నేను ఘాటుగా వాటంగా గాఢంగా ప్రేమించేస్తున్నా. నీకిష్టమైతే మనం పెళ్లాడకుండానే లేచిపోయి ఎంచక్కా పవిత్రంగా కాపురం చేసుకుందాం. ఇప్పుడిలాంటి సంసారాన్ని 'సహజీవనం' అంటున్నారు సంస్కారులు. తప్పు లేదని సుప్రీం కోర్టే సర్టిఫై చేసింది. భయం లేదు - నీ అంగీకారం తెలియచేయి. ఆలస్యం నేను భరించలేను" ఆపాడు చదవడం.

కోపంతో ఊగిపోయాడు భూతి - తర్వా

త కామెంట్ చేశాడు "అమ్మ! వీడి దుంప తెగ.. వీడి తాడుతెగ. వీడి నోరుపడ! వీడె వడో గుండెలు పెరికిన వాడిలాగున్నా డండీ. వీణ్ణి గుండేసి ఎన్‌కౌంటర్ చేసినా పాపం లేదు. హవ్వ! హవ్వ! పెళ్లికాకుం డానే కాపురమా? ఛఛ! తల్చుకుంటే వాంతొస్తుందే- ఇంతకీ ఈ ప్రేమపాపి ఎవ డండీ బాబూ! ముగింపు ముద్దుముచ్చట - ఇట్లు- నీ అమందానంద కందళిత హృద యారవింద- ఆనందభూతి"

తక్షణం అర్థం కాలేదు. కళ్లు పెద్దవి చేసి మళ్లీ చదివాడు పేరు.

"ఆc? ఆనందభూతి! నే-నా? " ఒక్కసా రిగా కళ్లు పచ్చబడ్డాయి, ఒళ్లు వెచ్చబడింది, మెదడుకు పిచ్చెక్కినట్లైంది.

గబగబా నోటిమీద కొట్టుకుంటూ "అమ్మమ్మమ్మ! యిది దగా! కుట్ర! మోసం! పాపారాయుడుగారూ! అమ్మతోడు- నాకేం తెలీదు. ఇది నేను రాయలేదు. నాకేపాపం తెలీదు. బాబోయ్.. నాన్నాయ్! వా" దుఃఖంలో మతిపోయింది.

"ఆపు- ఆపెయ్" అరిచాడు పాపారా యుడు.

"గుండేసి పేల్చి ఎన్‌కౌంటర్ చేయమ న్నావుగా. తూటాలు తేవడానికి టైం పడు తుంది. అమాయకంగా లబలబ లాడ్తే చేసిన పాపం చెరిగిపోతుందా? రాసిన అక్షరాలు మాసిపోతాయా? ఆం- అమ్మా! చెప్తా- మావాడు కత్తులరత్తయ్య వస్తాడు అప్పుడు. ఈ దెబ్బతో నీ పని అవుట్!"

"అయ్యయ్యో! ఈ పాపపు వుత్తరం నేనే రాశానని మీరు నమ్ముతున్నారాండీ? మన స్ఫూర్తిగా చెప్పండి. నా మొహంలోకి చూసి చెప్పండి"

"మరి ఆ సంతకం ఎవరిది? నీది కాదా? సరిగ్గా చూసి చెప్పు" ఉత్తరం చేతి కందించాడు.

ఆనందభూతి పరిశీలనగా చూసి, ఆశ్చ ర్యపోయాడు. "ఈ సంతకం న...న...నా దే-నాదే- కానీ.."

"సంతకం నీది, ప్రేమలేఖ రాసింది నువ్వు కాదు. మరెవర్తో రాయించావు? "

"లేదండీ- నేను రాయలేదు, ఎవర్తోనూ రాయించలేదు. నన్ను నమ్మండి"

"నన్నుకాదు.. పోలీసులొస్తారు, వారిని నమ్మించు"

"వామ్మో పోలీసులా? పోలీసులన్నా పిచ్చి కుక్కలన్నా నాకు చచ్చేంత భయం- బట్టలు తడుస్తయ్యి చెమటల్తో" అంటూ ఏం చేయాలో తోచక నెమ్మదిగా రాగిణి దగ్గరికెళ్లాడు. సడెన్‌గా ఆమె రెండు చేతులూ తన చేతుల్లోకి తీసుకుని

> **కొత్తగాలి...**
>
> **అడుక్కుని సంపాదిస్తే**
> **భిక్షం!**
> **కష్టపడి సంపాదిస్తే**
> **సుభిక్షం!**
>
> *– అంబటి వెంకటశివారెడ్డి,*
> *యర్రగుంట్ల కడప జిల్లా*

"ఏమండీ! రాగిణిగారూ! ఇవి మీ చేతులే! సందేహం లేదు.. తప్పులేదు. మీకు తెల్సు నేనే తప్పూ మీపట్ల చేయలేదని. ప్లీజ్! మీరైనా నన్ను రక్షించండి. నా జాలికళ్ల లోకి సూటిగా చూసి చెప్పండి.. నేను అల్లరి.. పోకిరి.. రౌడీనని మీరు నమ్ముతు న్నారా? చెప్పండి"

రాగిణి చిన్నగా నవ్వింది. మెల్లగా చేతులు విడిపించుకుంటూ "అవన్నీ హీరో ల సినిమా పేర్లు గదా? మీరూ ఆ హీరోలా ఉన్నారు... అందుకని నేను నమ్ముతున్నా.. " అంది. బుగ్గలపై చిరుసి గ్గుల చిగుళ్లు కదిలాయి.

"అయ్యో! ఈ సినిమాల వలన భాష కెంత దుర్గతో! అది కాదండీ..." ఏదో చెప్పబోయాడు భూతి.

రాగిణి మధ్యలోనే అందుకుని "ఇప్పుడే మైంది లెండి నాన్నా! పాపం! ఆయన్నింకా టీజ్ చేయకుండా వదిలేయండి" అంది.

"ఏమ్మా- జాలేస్తోందా? " పాపారాయుడు.

"కాదు నాన్నా. ఆయన నన్ను పెళ్లాడ్తారు..." అంటూ సిగ్గులు సాగిసాగి జీళ్ల పాకం తాటి మానుకేసి కొట్టి మెలి తిప్పిన ఆకారంలో మెలి తిరిగిపోయింది.

ఆ మాట విన్న ఆనందభూతి గుండె గుభేల్మంది. కొరడాదెబ్బ తగిలినట్లు ఫీలయ్యాడు. "ఏమిటి పెళ్లా? నో...నో...నో.. నేను పెళ్లాడను. ఆడను గాక ఆడను" అన్నాడు గబగబా.

"మరి నా చెయ్యెందుకు పట్టుకున్నారు? పెళ్లికాని కుర్రదాని చేతిని ఒక బ్రహ్మచారి కుర్రాడు పట్టేసుకుంటే ఏమిటమ్మా దానర్థం? " సిగ్గుమొగ్గలనే మాటలుగా ఊదింది.

"చచచ- ఛీఛీఛీ! నా అర్థం అది కానే కాదు.. కాదు.. కాదు" భూతి ఆందోళన.

"ఆ అర్థం కాకుండా ఆడపిల్ల చేయి మగాడు పట్టుకుంటే అదింకా పే..ద్ద.. నేరం అవుతుంది ఆషాఢభూతీ! తమాషా అనుకున్నావా? " రాయుడి పౌరుష గర్జన.

"వామ్మో! వురి బిగిసిపోతోందే. వాస్తు బూచాడి మాటలే నిజమౌతాయా? ఇది చివరి దశేమో.. నేనేం చేయను? నాకెవరు దిక్కు? "

"పోలీసులు, లాకప్పు! అమ్మాయ్! ఇతగాడింత తేలిగ్గా లొంగిరాడు గానీ- ఈ తుపాకి లోపలపెట్టి నా చేతికర్రందుకో! పోలీస్టేషను కెళ్లొస్తా.. వాళ్లే వచ్చి చేస్తారు ఇతనికి సరయిన పెళ్లి, నలుగుపెట్టి" అంటూ రాయుడు లేచాడు.

"అయ్య బాబోయ్- ఒద్దండి. పోలీసులు ఒద్దుగాక వద్దు"

"సరే! మా తమ్ముడు కత్తుల రత్తయ్యను కేకేస్తా.. ఆ సెల్‌ఫోనందుకోమ్మా! వాడు సెల్‌లో ఉన్నా క్షణాల్లో గోడలు బద్దలు చేసుకుని వచ్చి కను మూసి తెరిచేలోగా కోడిపీక కోసినట్లు కసక్కనిపించి తిరిగి అక్కడికే పోతాడు. ఇదే సులభ పద్ధతి"

"అయ్యయ్యో వద్దండి. కత్తులు, రక్తమంటే నా పై ప్రాణాలు పైకే పోతాయి"

"మరి అదీ గాదు, ఇదీ కాదంటే ఎలా గయ్యా నీతో. అదిగో బైట నుండి చుట్టుపక్కల పెద్దమనుషులంతా వస్తున్నారు మన గోల విని. వాళ్ల ముందు పెడదాం. ఈ సమస్య పరిష్కారం వాళ్లెలా చెప్తే అలా చేద్దాం.. సరేనా? " పాపారాయుడు అంటుండగానే బైట నుండి ఓ పదీ పది హేనుమంది ఆడా మగా బిలబిలమంటూ ప్రహరీగేటు తోసుకుని లోపలికొచ్చారు.

ఆనందభూతి భీతిల్లిపోయాడు. అప్పటికే, వచ్చినవాళ్లలో ఒకాయన "ఏంటండీ? ఇందాకటినుండీ ఇంట్లోంచి గొడవ గొడవగా అరుపులు వినిపిస్తున్నాయి. ఏమిటి సమస్య? " అడగనే అడిగాడు.

"అదీ... " పాపారాయుడు ఏదో చెప్పబోయేలోగా ఆనందభూతి ఆదుర్దాగా అందుకున్నాడు... "అబ్బే సమస్యేం లేదండీ శంకర్రావుగారూ! జస్ట్.." ఏం చెప్పాలో తోచక ఆగాడు.

పాపారాయుడు "పెళ్లి విషయంలెండి. అబ్బాయి అమ్మాయి.. అవును వీళ్లిద్దరూ ఇష్టపడ్డారు. 'అమ్మాయి ఈక్షణమే తాళి మెడలో పడాలి అంటోంది. అబ్బాయేమో మంచి ముహూర్తం, మండపం, బాజాలు, మంత్రాలు, పౌరోహిత్యం గట్రా చూసుకొని చేసుకుందాం ఓ వారంలో...' అంటున్నాడు... అదే సమస్య... అదే చర్చ" అంటూ సర్ది చెప్పున్నట్లు అంతా బైట



బెట్టాడు.

"ఈ కాలం ఆడపిల్లలు ఎస్సెమ్మెస్సుల్లా ఫాస్ట్‌గా ఉంటున్నారు. అమ్మాయి కేమైనా ఎమర్జెన్సీనేమో! ఆడపిల్ల గదా.. వాళ్ల బాధలు వాళ్లవి. ఆగడం మంచిదికాదు.. వెంటనే తాళి కట్టించేయండి.." అందో అనుభవజ్ఞురాలు జనంలోంచి.

రాగిణికి వళ్లు జల్లుమంది. నోట మాట రాలేదు.

"అయ్యయ్యో! అలాంటిదేం లేదండీ!" అనేశాడు ఆనందభూతి.

"అవును, అంతసీను లేదుగానీ.. మీర న్నట్లు బుద్ధులు జారుడుబండ మీద నడు స్తుంటాయి గదా! ముందు జాగ్రత్త ఎంతైనా మంచిది. కట్టెయ్యవయ్యా తాళి ఈ పెద్దల సమక్షంలో" అన్నాడు పాపారా యుడు. జేబులోంచి పసుపుకొమ్ము కట్టి ఉన్న పసుపుతాడును బైటికి తీశాడు.

అది చూసి ఆశ్చర్యపోయాడు. ఉక్రోషం పొంగుకొచ్చింది. "అమ్మ అమ్మ.. పసుపు తాడు రెడీగా జేబులో పెట్టుకుని సిద్ధంగా ఉన్నారంటే ఇదంతా ప్లాను- కుట్ర.. కుళ్లు- కుచ్చితం. దీనికి నేనొప్పుకోను.." అన్నాడు ఆనందభూతి.

"సరేనోయ్ నీయిష్టం! ఇది ఆడపిల్ల జీవిత సమస్య. సాధ్యమైనంతవరకూ అహింసా పద్ధతుల్లో సామరస్యంగా పోదా మనుకున్నా. నువ్వు మొండికేస్తున్నావు.

ఇప్పుడే పెద్దలతో చర్చబెట్టి తీర్పు కోర డమో లేదా దండధరులతో లాఠీ పెళ్లి, లాకప్‌లో మూడు నిద్రలూ, చిప్పకూడు పప్పుచారు విందూ. బూతుకూతల మంత్రాలూ అక్షింతలు ఏం కోరుకుం టావో- నీ యిష్టం" కూల్‌గా అడిగాడు రాయుడు.

ఆనందభూతికి నిస్సహాయ స్థితిలో ఏడు పొచ్చింది. దిగమింగినా ఉక్రోషం తన్ను కొచ్చి "ఆ- యిక్కడ మాత్రం యిప్పుడు బాజాలు మంత్రాలూ వున్నాయా, ఆ తాడు ముళ్లేసి యిది పెళ్లి అనిపించడానికి?" అన్నాడు బింకంగా.

పాపారాయుడు వెంటనే లోనికెళ్లి రికార్డు ప్లేయర్ తెచ్చాడు. దానిలో ఓ కేసెట్ సెట్‌చేసి వుంది- ప్లగ్ కనెక్షనిచ్చి ఆన్ చేశాడు. దివ్యమైన మంగళ వాద్యాలు మనోహరంగా మోగడం మొదలయ్యాయి. వాటితోపాటు స్వచ్ఛమైన గౌళ కంఠం లోంచి అచ్చతెలుగులో వివాహ విధులూ, సూక్తులూ కూడా విన్పించసాగాయి.

ఒక్కసారిగా పెళ్లి వాతావరణం ఆ ఆవ రణంతా పాకింది. ఆనందభూతి ఒళ్లు గగుర్పొడ్చింది. అమ్మాయి కళ్లు సిగ్గుతో వాలిపోయాయి.

"శుభం! ఇక కట్టవయ్యా తాళి అమ్మా యి మెళ్లో. ఇదే శుభ ముహూర్తం" అన్నారు అక్కడ చేరిన పెద్దలు, పెళ్లి పెద్ద రికాన్నందుకుంటూ.

ఆనందభూతి అడకత్తెరలో వక్కన య్యానే అనుకుంటూ, మెల్లగా ముందుక్క దిలి పాపారాయుడి చేతిలో పసుపు తాడం దకున్నాడు. రాగిణి వైపు చూశాడు. తపో నిష్టలో వున్న విశ్వామిత్రుని గదిసిన మే నకలా వుందనుకున్నాడు. ఒక్కసారిగా ఫ్రీజ్ ఫీలింగులో వున్న అతని మెదడు విచిత్రమైన కుదుపుకు లోనైంది. ఇదీ ఒక దశేనేమో అనుకోకుండా వుండలేకపో యాడు.

ఆనందభూతి తాళితాడును చేతుల్లోకి తీసుకుని పొజిషనుకు రాగానే రాగిణి ఒళ్లు పులకలెత్తగా, ఆనందపు వెలుగులను ఆల్చి ప్పల్లాంటి కనురెప్పల క్రిందకి తోస్తూ అతని ముందుకొచ్చి నిల్చింది. ఆనంద భూతి, ఆమె వంచిన మెడలో ఆటోమేటిగ్గా మూడు ముళ్లువేసి పసుపుతాడు కట్టేశాడు. ఒక్కసారిగా అక్కడ చేరిన పెద్దలు, పిన్నలు చప్పట్లతో తమ ఆమోదం తెలి పారు. ఈలోగా లోపలినుండి రాయుడు తెచ్చిన పూలసెజ్జలోంచి పూలరేకులను అందుకుని అందరూ నవదంపతులపై చల్లి ఆశీస్సులందించారు.

"దణ్ణం బెట్టండి" అన్నాడు రాయుడు.

ఆనందభూతి వెంటనే వెనక్కి తిరిగాడు. అదిచూచి "తూరుపు తిరిగి కాదు.. నా కాళ్లకి దణ్ణం బెట్టుకోండి దంపతులు.. దీవిస్తా!" అన్నాడు రాయుడు.

రాగిణి మురిపెంగా మోచేత్తో ఆనంద భూతిని పొడిచింది. "వామ్మో! అధికార వికేంద్రీకరణ ఆరాటం మొదలైంది అప్పుడే" అంటూ భూతి ఆమెతో కలిసి రాయుడు కాళ్లకు నమస్కరించాడు.

"శుభం! ప్రణయజంటలా ఆదర్శ దాంపత్యం నెరపండి. ఒన్‌ప్లస్ ఒన్ సంతాన ప్రాప్తిరస్తు" అంటూ దీవించి, చెమర్చిన కళ్లు ఒత్తుకున్నాడు రాయుడు.

అదే సమయంలో ఫ్లాష్ క్లిక్‌మని వెలి గింది- అంతా అటు తిరిగారు.

మెడలో కెమెరాతో కేరీబేగ్‌లో పరిమళ భరితమైన పూలమాలలతో నిండుగా నవ్వుతూ నిలబడి వున్నాడు వామన మూర్తి. తండ్రిని చూడంగానే ఆనందభూ తికి ఎక్కళ్లేని దుఃఖం పొంగుకొచ్చింది. చిన్నపిల్లాడిలా 'నాన్నోయ్ నాన్నా! చూశావా? వీళ్లంతా కలిసి నన్ను చిన్న పిల్లాణ్ణి చేసి, యిల్లు కొంటాననే వంకతో

యింట్లో చేరి అండలేని నన్నొంటరిగా, మాయచేసి, మోసంచేసి, లారీలు, కత్తులు ఏమిటేమిటో చెప్పి, భయభ్రాంతుణ్ణి చేసి, బలవంతంగా - ఇంతింత కళ్లతో భయ పెట్టే ఈ పిల్ల మెడలో నాతో తాళి కట్టిం చారు- వా!' అంటూ భోరుమందామనుకు న్నాడు. కానీ రాగిణి మోచేత్తో మరోసారి పొడిచింది వారిస్తూ. దాంతో నోరు మూతపడింది.

"పోన్లేరా! ఎంచక్కా పెళ్లేగా చేశారు చక్కదనాల చుక్కనిచ్చి. అదృష్టమంటే నీదేరా! అమ్మాయి కుందనాల బొమ్మలా వుంది. సరే, జరిగిందేదో మంచే జరి గింది. ఇదిగో ఈ దండలు మార్చుకోండి యిద్దరూ. ఎంచక్కా ఫొటో తీస్తా!" అన్నాడు మూర్తి.

"దండలు - కెమేరా - ఏమిటి నాన్నా? నీకెలా తెలుసు ఈ ముహూర్తపు షెడ్యూలు?" ఆశ్చర్యంగా అడిగాడు ఆనం దభూతి, కళ్లల్లో అనుమానం కదిలాడగా.

"నాకన్నీ తెలుసులేరా త్రిపురాంతకం తిమ్మనమంత్రీ! ముందు దండలు మార్చు కోండి. ఇదిగో పాపారాయుడూ! మూవ్ మెంట్సన్నీ ఫొటోలు తియ్యి.. ఎందుకైనా మంచిది. ఈ కాలం కుర్రానాగన్నలని నమ్మడానికి వీల్లేదు. ముందు ముందు ఏమైనా తలతిక్క వేషాలేస్తే తాట వొలిచి తీట కుదర్చడానికి యివి ఎవిడెన్స్‌గా పని కొస్తాయి" కెమేరా అందించాడు రాయు డికి.

"అమ్మ- నాన్నా! ఈ కుట్రకంతా ప్రథమ సూత్రధారుడివి నువ్వేనన్న మాట! నా జీవితాశయ విధ్వంస పథక రచయితవి నువ్వా? అసలు నువ్వు నాకన్న తండ్రివా, జన్మాంతర శత్రువ్వా?" ఉక్రోషం పొంగి పళ్లు నూరుతూ అన్నాడు.

"నోరు ముయ్యరా! కుంజుమలై కుటుం బ్రావ్! నీదొక ఘనమైన జీవితం.. దాని కొక ఆశయం! వాటి అర్థాలు తెలుసున్రా నీకు? అసలు మనిషి.. మనిషేకాదు, ఏ జీవి అయినా ఈ భూమ్మీద పుట్టేదెందుక నుకుంటున్నావు? తిని, తాగి, నిద్రించి, తిరిగి తిరిగి వాగివాగి చావడానికనుకుం టున్నావా? కాదు. కానే కాదు.. ప్రకృతి దీవెనలతో నేలతల్లి రుణం తీర్చుకోవడమే జీవుల ప్రథమ కర్తవ్యం. పునరుత్పత్తే భూ, ప్రకృతిరుణాలు తీర్చుకోడమంటే! జీవి పుట్టుకే పునరుత్పత్తి కొరకు. మిగతా పనులు ఉపపత్తులు. అందుకే పునరు త్పత్తి ప్రాథమిక రూపాలయిన వ్యవ సాయం, సంసారం మానవుల పవిత్ర సంకల్పాలయాయి..."

వామనమూర్తి మాటలను ఆనందభూతి

> **కొత్తగాలి...**
>
> **అంతరిక్షం**
> **చేరువైన కాలమిది**
> **అంతరంగం**
> **దూరమౌతున్న చిత్రమిది!**
>
> – వి. సునీల్,
> పెద్ద కొట్టాల, నంద్యాల

మధ్యలో అడ్డుకున్నాడు ఆవేశంగా - "ఆహా! పునరుత్పత్తే జీవుల ప్రాథమిక బాధ్యత అయితే మనుషులే చీమల పుట్టలు, తేనెతుట్టెలు అయిపోయి చాలి నంత తిండి దొరక్క నెలకొక ప్రపంచ యుద్ధం జరిగే పరిస్థితి తలెత్తుతుంది" అన్నాడు.

వామనమూర్తి తొణక్కుండా సమా ధానం చెప్పాడు - "కానేకాదు, మనుషులు ఆనందంగా పెళ్లిళ్లు చేసుకోవాలి. పరమా నందంగా ప్రతిసృష్టికి ప్రయత్నించాలి. పెళ్లి పరమార్థమది. బాధ్యత - జన్మసా

కారం! అయితే దానికీ లిమిట్ ఉంది. వ్యవసాయంలో ఉత్పత్తి అధికం చేయాలి. సంసారంలో పరిమితం చేయాలి. సమయానుకూలంగా అవసరాన్ననుసరించి స్పందించడమే విజ్ఞత. ఔచిత్యం మరిచిపోకూడదు"

"అందుకే నాయనా! ఇంత పకడ్బందీ నాటకమాడి ఈ పెళ్లి చేయగలిగాం అల్లుడూ!" హాయిగా ఊపిరి పీల్చి వదిలి అన్నాడు పాపారాయుడు.

"నాటకమా? ..." మరోసారి ఆశ్చర్యపోయాడు భూతి.

"అవును... సోనూసూద్ వేషంలో వచ్చి చావు కబురు చెప్పి నిన్ను బెదరగొట్టిన వాస్తు సిద్ధాంతి ఎంట్రెన్స్ దగ్గర నుండీ అంతా మెలోడ్రామానే. మీ పెళ్లి మా చావుకొచ్చింది. ఏం చేస్తాం... వంశం నిలుపుకోవాలిగదా? " చల్లగా చెప్పాడు వామనమూర్తి.

"అయితే మామ పాపారాయుడూ భామ రాగిణీ..? "

నవ్వాడు మూర్తి "ఈ పాపిగాడు నా బాల్యమిత్రుడ్రా! వినుకొండ... నిమ్మల బావి నీళ్లుతాగి ఎదిగిన నిర్మల నేస్తం! రాగిణి వాడి నోట్లోంచి ఊడిపడ్డ గారాబు బిడ్డే... మిలిటరీ కాదు పాడూ కాదు... మీరిద్దరూ పుట్టినప్పటి నుండీ వీడు - 'ఒరే వామనం! వాడు నన్నలానే పిలుస్తాడ్లే... ఒరే వామనం! నీ కొడుక్కి నా బిడ్డను చేసుకుంటావా సరే.. లేదంటే చెప్పు.. దాని గొంతుక్కురేసి వల్లప్ప చెరువు గుట్ట నున్న చెట్టుకు వ్రేలాడదీసి, నేనో బండను మెడక్కట్టుకుని పెద్ద చెరువులో దూకేస్తా' అని ఒకటే సెంటిమెంటు రంపంతో కోస్తూండేవాడు. నువ్వేమో పనికిమాలిన బ్రహ్మచర్య వ్రతం గట్రా పూనడమే గాక

కదిలిస్తే చాలు అత్తిపత్తిలాగా ముడుచుకుంటూ 'నాన్నోయ్ నీకు దణ్ణం బెడతా.. నాకు పెళ్ళొద్దు' అని గాడిదలా కూస్తా పారిపోతుంటివి. ఇక నేనేం జేసేది? వీడికేమని సమాధానం చెప్పేది? అందుకే ఇంత నాటకం ఆడక తప్పలేదు"

"వామ్మో! ఇది డ్రామా పెళ్లి. దీనికి నేనొప్పుకోను" మొదటికొచ్చాడు భూతి.

"చంపేస్తాను వెధవాయ! లైనేయడం, ప్రేమలేఖ అనేది వాస్తవానికి అబద్ధాలైనా అవిప్పుడు నిజాల ఉరితాళ్ళై నీ మెడకు చుట్టుకుంటయ్ జాగ్రత్త. తాళీ, దండలు, పెద్దల దీవెనలు, ఫొటోలు ఈ ఎవిడెన్స్ చాలు - కోర్టుబోను - పోలీసులు, లాకప్ సెల్, లాఠీ తాండవం ఉండనే వుంటయ్యి - బతుకు కోటప్పకొండ తిరణాళ్లే - తర్వాత నీ ఇష్టం"

"అమ్మో! పూర్తిగా ముంచాడు కన్నతండ్రి. నాన్నా! నువ్వు కలియుగ హిరణ్యకశిపుడివి. నేను అమాయకప్పిచ్చి ప్రహ్లాదుణ్ణి. ఛీ!"

"కానీ వొరే! ఈ దఫా నరసింహావతారం మాత్రం ప్రహ్లాదుడి వీపు మీద జోగు జాతర చేస్తుంది. అదీ ఆధునికం. జ్ఞాపకముంచుకో!" హెచ్చరించాడు మూర్తి.

రాగిణి మళ్లీ మోచేత్తో ఆనందభూతిని పొడిచింది. "అబ్బా! మళ్లీపొడిచావెందుకు? ఇదిగో ఈ పొడిపిళ్లూ, బెదిరింపులకు బెదిరే - నేనసలు..." అంటూండగానే రాగిణి ఈసారి వారిస్తూ గట్టిగా పొడిచి వామనమూర్తి కాళ్లకు దణ్ణం బెట్టడానికని సైగ చేసింది.

"చెప్పొచ్చుగా!" అంటూ వెళ్లి ఇద్దరూ మూర్తి కాళ్లకి నమస్కరించారు.

వామనమూర్తి "అయం ముహూర్త స్సుముహూర్తో.. శుభం! ఈ వివాహ మహోత్సవ శుభసమయాన ఈ యొక్క మీ మావగారు పొడిగేదెల పాపారాయుడు అల్లుణ్ణీ కూతుర్నీ దీవించి ఇస్తున్నవి ట్రావెల్ టిక్కెట్లు, రూం తాళాలు, పెర్మిషన్ పత్రాలు, ఏటీఎం కార్డు - పుచ్చుకుని లేవండి" అందించాడు.

"ఏమిటి నాన్నా యివి. ఎందుకు?" జరిగే చర్యలన్నీ ఆనందభూతికి ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి.

"మీ హనీమూన్ అరేంజిమెంట్స్ జూలాజికల్ పార్కులోని అద్దాల గెస్ట్‌హౌస్‌లో. సూట్ బుక్ చేయబడింది - అవి ఫ్లైట్ టికెట్లు - ఖర్చులకి ఏటీఎం కార్డు"

"అద్దాల గదులా హనీమూన్‌కి" నోరు తెరిచాడు భూతి.

"అవును, లోని దృశ్యాలు బైటికొక్కనపడవు. బైటవన్నీ ఎంచక్కా లోనివారికి కనిపిస్తాయి. ఆనందం ఎంజాయబుల్..."

"హనీమూన్ జూలోనా, ఏమిటి నాన్నా ఈ అరాచకం?"

"అంతేరా ఆవలింతల అప్పలరాజూ! దిక్కుమాలిన యాంటీఫిమినైన్ అన్నావు గదా! మెదడులోని ఆ మకిల వదలాలి. ఆ మూగ జంతువుల్ని చూసైనా ప్రేమ, ముద్దూ ముచ్చట, స్త్రీల పట్ల ఆదరణ నేర్చుకుని అపురూపంగా అమ్మాయిని చూసుకుంటావని ఈ వినూత్న ప్రాజెక్టుకు నేనే రూపకల్పన చేశా. భూమిపై జీవి పుట్టినది మొదలు మనిషి ఎంతటివాడైనా, ఏదైనా సరే ప్రకృతినీ పశుపక్ష్యాదుల్నీ చూసే అనుకరణా, ఆచరణ ద్వారా నేర్చుకునే, గొప్పవాడయాడు. ఇంతటి ప్రగతి సాధించాడు. ఆనందంగా వెళ్లిరండి. మూడో నెల కరిగేలోగా మూడో జీవి మెదిలిన శుభ సూచనలతో తిరిగి రండి. శుభం!" వామనమూర్తి ముక్తాయింపునిచ్చాడు.

అది విని రాగిణి సిగ్గుల మొగ్గైంది. ఆ సిగ్గులలో విరిసిన ఆ బాల సౌందర్య పరిమళం తాకి ఆనందభూతికి తొలిగా ఆనందం ఆర్ణవమైంది.

# కేరళ కవి కౌస్తుభం



ఒ.ఎన్.వి. కురుప్

**పద్య రచనలో సిద్ధహస్తుడైనా గేయం, గీతం, పాటల్ని బలీయ జన చైతన్య వాహికలుగా స్వీకరించి అపూర్వ విజయాలు సాధించిన కవిశేఖరుడు ఒ.ఎన్.వి. కురుప్. మట్టివాసన గుబాళించే ఆయన రచనలు కేరళీ యతకు తేజోమయదర్పణాలు, ప్రజల హృదయ స్పందనలకు ప్రతిధ్వనులు. 2007 లో జ్ఞానపీఠ పురస్కారం అందుకున్నారాయన. మలయాళ భాష భారతదేశ అగ్రతమ సాహితీ మణి కిరీటం ధరించడం ఇది అయిదోసారి.**

ఒ.ఎన్.వి. కురుప్ 1931 మే 27న కేరళలోని కొల్లం జిల్లా, చవరా గ్రామంలో జన్మించారు. అయన పూర్తి పేరు ఒట్టప్లాక్కల్ నీలకంఠ వేలు కురుప్. తండ్రి ఒ.ఎన్. కృష్ణ కురుప్. తల్లి లక్ష్మి కుట్టి అమ్మ. బాల్యంలోనే కురుప్ తండ్రిని కోల్పో యారు. అప్పుడాయన వయసు ఎనిమిదేళ్లే. స్వగ్రామం చవరాలో ఉన్న ప్రభుత్వ పాఠశాలలో చదువుకున్నారు. కొల్లంలోని ఎస్.ఎన్. కళాశా లలో ఆర్థికశాస్త్రం ఐచ్ఛికాంశంగా చదివి బీఏ పట్టా అందుకున్నారు. పిమ్మట తిరువనంతపురం వెళ్ళి, అక్కడి తిరుచానూరు(కేరళ) విశ్వవిద్యాల యంలో చేరి మలయాళ సాహిత్యంలో ఎంఏ పట్టా పొందారు. కురుప్ మలయాళంలో సము పార్జించిన విశేష పాండిత్యాన్ని, ఆయన ప్రజ్ఞా పాటవాలను విద్యారంగం గుర్తించింది. ఆయ నకు ఎర్నాకులంలోని మహారాజా కళాశాలలో అధ్యాపక పదవి లభించింది. అధ్యాపకుడిగా, విద్యావేత్తగా కురుప్ సుదీర్ఘ ప్రస్థానానికిది నాంది. ఆయన త్రివేంద్రంలోని యూనివర్సిటీ కళాశాల, కోజికోడ్‌లోని ఆర్ట్స్-సైన్స్ కళాశాల, త(క)లస్సెరాలోని బ్రెన్నెన్ కళాశాలలో అమూల్య సేవలందించారు. తర్వాత త్రివేంద్రంలోని ప్రభుత్వ మహిళా కళాశాలలో మలయాళ శాఖా ధ్యక్షుడిగా విశేష కృషి చేశారు. కాలికట్ విశ్వవి ద్యాలయంలో సందర్శక ఆచార్యుడిగా కూడా ఆయన సేవలు చిరస్మరణీయాలు. మేధావిగా, విద్యావేత్తగా కురుప్ విస్తృత సేవలందించడమే గాక కేరళ సంప్రదాయ కళలు, సంస్కృతి వ్యాప్తి కోసం ప్రత్యేక కృషి చేశారు. ఇంకా చేస్తూనే ఉన్నారు. కేంద్రసాహిత్య అకాడమీ కార్యవర్గ సభ్యునిగా, కేరళ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యు నిగా, కేరళ కళామండలం అధ్యక్షునిగా, అభ్యు దయ రచయితల సంఘం అధ్యక్షునిగా ఎంతో తోడ్పాటునందించారు. రష్యా, యుగోస్లేవియా, సింగపూర్, అమెరికా, జర్మనీ, మొదలైన దేశాలలో జరిగిన సాహిత్య సమ్మేళనాలలో కురుప్ పాల్గొని తన అమూల్య సందేశాలు వినిపించారు.

కేరళ ప్రజలు గాఢంగా అభిమానించే ఆధునిక మలయాళీ కవుల్లో ఒ.ఎన్.వి కురుప్ అగ్రపం క్తిని అలంకరిస్తారు. పాట ప్రక్రియను ఆయన కలం ఉన్నతోన్నత శిఖరాలకు చేర్చింది. వాస్తవా నికి పాట కేరళీయులపై అత్యంత ప్రభావం చూపింది. పడవ పాటలు, జానపద గేయాలు, రంగస్థల గీతాలు గొప్ప స్ఫూర్తిమంతాలు. కురుప్ ప్రారంభంలో గణబద్ధ పద్యాలు, మాత్రా ఛ్ఛందంలో గేయాలు రచించి కవితాలోకాన్ని ఆనందింపజేశారు. ఆయన మౌలికంగా అభ్యు దయ- మానవతావాది. రూపం ఏదైనా భావ

జాలం మాత్రం జనహితాన్ని కాంక్షించేది. ఆయన తొలి కవిత 'ముస్నోత్తు'లో ప్రజల్ని ముందుకు సాగమని ఉద్బోధించారు. ఇది 1946లో ఒక వారపత్రికలో ప్రచురితమైనప్పుడే పాఠకులు ఆయన నిశితగళాన్ని విన్నారు. అప్పుడాయన ఇంకా ఎస్.ఎస్.ఎల్.సి. విద్యార్థి. ప్రథమ కవితా సంపుటి 'పొరుతూన్న సౌందర్యం' 1949లో వెలువడింది. ఇందులోనూ చైతన్య ఉద్దీప కవితలే చోటు చేసుకున్నాయి. 'దాహిక్కున్న పానపాత్రం'లో 1946-56 మధ్య ఆయన రచించిన కవితలున్నాయి. ప్రతీకాత్మకంగా చైతన్యాన్ని చూపడంలో ఆయనకు ఆయనే సాటి. ఒక కవితలో ఇలా అంటారు- "నిద్రలో నుంచి లేచి ప్రపంచాన్ని చీకట్లో చూశాను. అప్పుడు హఠాత్తుగా ఎదుట ప్రత్యక్షమయింది/ ఒక చుక్క వెలుగు". మరో కవితలో వెలిబుచ్చిన భావం- "మనోహర హిమవత్పుత్రి ఓ గంగా! హరిత శార్వలాల నేస్తం ఓ ఓల్గా! మీరిద్దరూ గిటారు మీటుతూ ఒకగీతం ఆలపిస్తున్నారు"

పాట మహా ప్రభంజనం సృష్టించగలదని నిరూపించిన ఘనత కురుప్‌దే. తొప్పిల్ భాసి రచించిన 'నీంగళెన్నె కమ్యూనిస్టక్కి' (నువ్వే నన్ను కమ్యూనిస్టు చేశావు) నాటకానికి కురుప్ పాటలు సమకూర్చారు. ఇవి భావంలో, శైలిలో పూర్తిగా కొత్తపంథా తొక్కాయి. వీటికి ప్రజల నుంచి అనూహ్య స్పందన లభించింది. కేరళ రాజకీయ ముఖచిత్రాన్ని మార్చడంలో ఈ పాటలు ముఖ్యభూమిక వహించాయని విశ్లేషకుల భావన. ఇది 1957 నాటి సంగతి. కురుప్ రచనా ప్రతిభను వెంటనే చలనచిత్రరంగం విని యోగించుకుంది. 'కలం మరున్ను' చిత్రంతో ప్రారంభమైన గీతరచన విజయోన్ముఖంగా సాగింది. ఇప్పటి వరకు 232 చిత్రాలకు తొమ్మిది వందలకు పైగా గీతాలు రచించారు. ఆయన గీతాలకు జాతీయ, రాష్ట్ర స్థాయిల్లో పదిహేను అవార్డులు లభించాయి. రెండు చిత్రాలకు 'ఏషియా నెట్' పురస్కారం అందుకున్నారు. సినీ గీత రచన, నాటకాలకు పాటల రచనతో పాటు కావ్యసృజన కూడా శక్తిమంతంగా సాగించారాయన. ప్రజలతో మమేకమైన కురుప్‌కు ప్రజాసమస్యలే ప్రధాన ఇతివృత్తాలయ్యాయి. ఉదాహరణకు '[illegible] ఒరు చరమగీతం'లో నేలతల్లి ఆక్రందనను ఉద్విగ్నంగా [illegible] 'సైలెంట్ వ్యాలీ' ఆందోళన దీనికి భూమిక. కేరళలోని రెయిన్‌ఫారెస్టుల పరిరక్షణకు సాగిన ఉద్యమ నేపథ్యంలో రచించిన మహాకావ్యమిది. పర్యావరణ రక్షణ పట్ల కురుప్ ప్రత్యేక ఆసక్తి ఇందులో కనిపిస్తుంది. 'ఉప్పు' రసార్ద్రకావ్యం. ఇందులో ఒక నాయనమ్మ తన మనవడిని చిన్నప్పుడు ఎలా పెంచిందో అతనికి వివరిస్తుంది. తన మరణం తర్వాత కూడా తనను ఎలా గుర్తుపెట్టుకుంటారో చెబుతూ 'బియ్యపు గంజిలో నేను కలిపిన ఉప్పు నీ మనసులో ఎల్లకాలం మెదులుతుందిరా నాయనా!' అంటుంది. కావ్యం ప్రతీకాత్మకంగా సాగుతుంది. మరుభూమి, నీల క్కన్నుకళ్, మయిల్‌పీలి, ఒరుతుల్లి వెలిచ్చమ్, అగ్నిశలభంగళ్, మాణిక్యవీణ, అక్షరం, కరుత్త పక్షియుదె పాట్టు, సారంగ పక్షికళ్, మృగయ, దినాంతం, తొన్ను అక్షరంగళ్, అపరాహ్ణం, వెరుతె, స్వయంవరం, భైరవన్తె తుటి, ఉజ్జయిని, వలప్పొట్టుకళ్ వంటి కృతులు మలయాళ సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి. కురుప్ గద్య రచనలు- కవిత యెలె సమాంతర రేఖకళ్, కవిత యెలె ప్రతిసంధికళ్, పాథేయం, కాల్పనికం మొదలైనవి ఆయన ఉత్తమ విమర్శనా దృష్టికి




తార్కాణాలు.

కురుప్ సోవియట్ ల్యాండ్ నెహ్రూ, జాషువా వయలార్ రామవర్మ, ఎజుత్తచ్చన్, విశ్వదీప్, ఉల్లూర్, కేరళవర్మ, ఆసాన్, వల్లత్తోలే భారతీయ భాషా పరిషత్, రామశర్మ ట్రస్టు, బహరీన్ కేరళీయ సమాజ్, కేంద్రసాహిత్య అకాడమీ, కేరళ సాహిత్య అకాడమీ మొదలైన అవార్డులను ఆయా సంస్థల నుండి అందుకున్నారు. ఆయనకు కేరళ విశ్వ విద్యాలయం గౌరవ డాక్టరేటు ప్రదానం చేసింది. భారతప్రభుత్వం పద్మశ్రీ, పద్మవిభూషణ్ గౌరవాలతో సత్కరించింది. ఆయనకు కేరళ హిందీ ప్రచారసభ 'సాహిత్య కళానిధి' అనే బిరుదును ఇచ్చింది.

ఓ.ఎన్.వి. కురుప్ తిరువనంతపురంలో స్థిర నివాసం ఏర్పరుచుకుని సాహిత్య కళారంగాలకు ఇతోధిక సేవలందిస్తున్నారు. ఆయన భారతదేశం గర్వించదగిన మహాకవులలో ఒకరు.

[illegible]



# చతుర ప్ర.జ.

**పాఠకుల ప్రశ్నలకు అవధాన సరస్వతి డా. మేడసాని మోహన్ సమాధానాలు**

కొత్త శీర్షిక మీకోసం

ప్ర: విగ్రహ నిమజ్జనం ఏ సంస్కృతీ సంప్రదాయాలను అనుసరించి జరుపుకుంటున్నాం?

– నోముల సురేందర్‌రావు, హబ్సీగూడ

జ: విగ్రహ నిమజ్జనం హైందవ సంస్కృతీ సంప్రదాయాలను అనుసరించి జరుపుకుంటున్నాం. వినాయకచవితి సందర్భంగా గణేశ విగ్రహాలను నిమజ్జనం చేస్తున్నాం. 'శారదా కల్పద్రుమము' అనే ప్రాచీన గ్రంథం గణపతి ఇక్షురస సముద్ర మధ్యంలో, నవరత్నమయ ద్వీపంలో, ధ్యానముద్రలో ఉంటాడని పేర్కొంది. గణేశుని విగ్రహాన్ని నీటిలో నిమజ్జనం చేస్తే సాక్షాత్తూ ఇక్షురస సముద్రానికి చేర్చినట్లే అని భావించడం సంప్రదాయం. నిమజ్జనం చేయడం అంటే నిమగ్నం చేయడం. గణేశ విగ్రహాలను నీటిలో కలపడంలో ఇంతటి అంతరార్థం, పరమార్థం ఉంది. మధురాతి మధురమైన చెరకు పాల సముద్రంలో కలిసిన గణపతి మధుర జీవన సౌభాగ్యాలను భక్తులకు ప్రసాదిస్తాడని ప్రాచీనకాలం నుంచి భారతీయుల విశ్వాసం.

ప్ర: వితంతువులు నిత్యపూజలో వినియోగించ దగిన పూజాద్రవ్యాలేమిటి? వాళ్లు పూలు, పండ్లు, అక్షతలతో పాటు పసుపు, కుంకుమలు కూడా వినియోగించవచ్చా?

– వై.వి.ఎస్. అన్నపూర్ణ, నిజాంపేట

జ: సహజంగా అందరూ వినియోగించే పూజా ద్రవ్యాలను వితంతువులు కూడా వినియోగించి దేవతార్చన చేయవచ్చు. ఆయా దేశకాల ఆచారాలను బట్టి వితంతువులు పసుపు, కుంకుమార్చనలు చేయరు. కానీ అలా చేయకూడదని, పూర్తిగా వారికవి నిషిద్ధం అని చె[illegible]లేం. ఇటువంటి ఆచార వ్యవహారాలు వారి[illegible] విశ్వాసాలపై ఆధారపడి ఉంటాయి. కుంతీదేవి సాక్షాత్తు ఐరావతాన్ని స్వర్గం నుంచి తెప్పించి గజగౌరీ వ్రతం చేసినప్పుడు ఆమె వితంతువే గదా! సంప్రదాయబద్ధంగా సకల పూజాద్రవ్యాలతో ఈ వ్రతం చేసినట్లు కొన్ని ప్రాచీన గ్రంథాలలో ఉంది.

ప్ర: భారతంలో సంజయుడి ప్రస్తావన చాలా సార్లు వస్తుంది. సంజయుడు ఎవరు?

– కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం

జ: సంజయుడు ధృతరాష్ట్రునకు చాలా ప్రీతిపాత్రుని కుమారుడు. ఆ ప్రీతిపాత్రుడు కూడా సూతకులానికి చెందినవాడు. అంటే సంజయుడు 'సూత' పుత్రుడని తెలుస్తూ ఉంది. ఈ సంజయుడు వ్యాసునకు కూడా ప్రియశిష్యుడు. వ్యాసుని వద్ద శ్రద్ధగా విద్యాభ్యాసం చేసి ఆ మహర్షి వాత్సల్యాన్ని చూరగొన్నాడు.

ప్ర: మరణానంతరం జీవాత్మ తన గమ్యస్థానాన్ని ఎలా తెలుసుకుంటుంది? ఎలా చేరుకుంటుంది?

– డా. సి. జనార్దనసింగ్, నింబోలి అడ్డ

జ: కఠోపనిషత్తులో యమధర్మరాజుకూ, నచికేత కుమారునికి జరిగిన సంవాదంలో ఈ అంశం విపులంగా ఉంది. జీవులందరూ బ్రతికియున్న సమయంలో వారి వారి జీవన విధానంలో స్థూలంగా రెండు మార్గాలను అనుసరిస్తారు. 1. శ్రేయోమార్గం 2. ప్రేయోమార్గం. శ్రేయోమార్గం అంటే అంతర్ముఖీన సంస్కారంతో కూడిన యోగబుద్ధితో, సదాచారంతో జీవితం గడపటం. ప్రేయోమార్గం అంటే కేవలం బాహ్య సుఖాలతో జీవితం గడపటం. ఈ రెండు మార్గాలలో అనుసరించిన విధానాన్నిబట్టి మరణానంతరం జీవాత్మ గమ్యస్థానం [illegible] ఒకసారి కఠోపనిషత్తు చదివి

నన్ను సంప్రదించవచ్చు.

ప్ర: దేవతల అష్టోత్తర, సహస్ర నామాలను చదివేప్పుడు తప్పులు దొర్లకూడదని, అలా చేస్తే చెడు ఫలితాలు వస్తాయని అంటారు.. నిజమేనా? భాష స్పష్టంగా ఉచ్చరించలేనివారి పరిస్థితి ఏమిటి?

**– యు. విజయశేఖరరెడ్డి,** కూకట్‌పల్లి

జ: దేవతల నామావళీ స్తోత్రాలు చదివే సమయంలో వీలైనంత స్పష్టంగా, శ్రావ్యంగా పలికే ప్రయత్నం చేయాలి. త్రికరణశుద్ధిగా చదివే సమయంలో ఎక్కడైనా చిన్నచిన్న లోపాలు దొర్లినా, చెడు ఫలితాలు వస్తాయని బెంబేలు పడవలసిన అవసరం లేదు. అలాంటి సందేహ నివృత్తి కోసమే 'అపచారా నిమాన్ సర్వాన్ క్షమస్వ పురుషోత్తమ! మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన! యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే!' - అని క్షమా ప్రార్థన చేయడం పరిపాటి.

ప్ర: హారతిని చాలామంది కళ్లకు అద్దుకుంటారు.. కానీ అలా కూడదు.. కేవలం నమస్కరించాలి అని కొందరంటారు. దీనిపై శాస్త్రం ఏం చెబుతోంది?

**– శ్రీరామ్,** రాజీవ్‌నగర్, హైదరాబాద్

జ: సహజంగా గర్భాలయాలు చీకటిగా ఉంటాయి. కర్పూర హారతితో కూడిన వెలుగులో అర్చకస్వామి భక్తులకు అర్చామూర్తిని చూపిస్తారు. అర్చామూర్తియైన మూలవర్లను మనం ఏ వెలుగు సహాయంతో చూస్తామో ఆ వెలుగు కూడా భగవద్రూపమే. 'కాంతి పూరంబు శోభిల్లు శాంతమూర్తి'- అని తిక్కన మహాకవి భగవత్ స్వరూపాన్ని కీర్తించినాడు. అందువల్ల భగవంతునికి ఎలా నమస్కారం చేస్తున్నామో భగవంతుని రూపంగా భావించే కర్పూర హారతికి కూడా భక్తిశ్రద్ధలతో నమస్కారం చేయాలి. సంప్రదాయం తెలిసినవారు ఇలాగే చేస్తారు. కళ్ళకద్దుకోవలసిన పనిలేదు.

ప్ర: జీవి దేహాన్ని వదలిన తరువాత తిరిగి మాతృగర్భంలోకి ప్రవేశించడానికి ఎంత వ్యవధి పడతుంది? ఈ విషయమై శాస్త్రాలు ఏం చెబుతున్నాయి?

**– ఎస్.సి. రుక్మిణి,** ఒంగోలు

జ: జీవులందరూ శరీరాన్ని వదలిన తర్వాత తిరిగి ఇదమిత్థంగా ఇంత కాలంలో మరల మాతృగర్భంలో ప్రవేశిస్తారని చెప్పడానికి వీలు లేదు. ఆయా జీవుల పుణ్యపాపాలు, యోగసాధనాలను బట్టి కొందరు అధోలోకాలకు, కొందరు ఊర్ధ్వలోకాలకు వెళతారు. వారివారి యోగబలం, జ్ఞానప్రకాశాలను బట్టి ఉత్తర జన్మలు కలుగుతుంటాయి. రుక్మిణి గారూ! మీరొకసారి శ్రీమద్భాగవతంలో చిత్రకేతూపాఖ్యానం చదవితే మీకీ అంశం పట్ల ఒక అవగాహన కలుగుతుంది.

## రూ.116/- బహుమతి పొందిన
# ఉత్తమ ప్రశ్న

ప్ర: కొన్ని చిత్రాలు, పటాలలో పరమ శివుడ్ని కాళీమాత తన పాదాల కింద మర్దిస్తున్నట్లు కనబడుతుంది. ఏమిటీ విచిత్రం? మహేశ్వరుడు సాక్షాత్తు భగవంతుడు, భక్త జన ఆరాధ్యుడు. అందునా కనకదుర్గ అంశయే అయిన కాళికాదేవి భర్తే కదా..?!

**– అన్వేష్,** కూకట్‌పల్లి

జ: ఈ అంశం శాక్తేయ సంప్రదాయానికి సంబంధించిన విషయం. శక్తిస్వరూపిణియైన దుర్గ, పరమశివుడు ఆది గృహస్థులు. పరస్పర ప్రణయ మధురమూర్తులు. తన దేవేరి సౌభాగ్య సౌశీల్యబలాదులకు సంతసించిన పరమశివుడు తనపై విశృంఖల నృత్యం చేయడానికి ఆమెకు అనుమతిస్తాడు. ఆ భంగిమనే చిత్రపటాలలో, బొమ్మలలో అనేక విధాలుగా చిత్రీకరించి చూపిస్తుంటారు. శంకర భగవత్పాద విరచితమైన సౌందర్యలహరి'లో 'శివాకారే మంచే పరమశివ పర్యంక నిలయాం'- అని వర్ణించడం, తత్సంబంధిత వ్యాఖ్యానాలు చదివితే ఇందలి నేపథ్యం అవగతమవుతుంది. భారతీయ గృహస్థాశ్రమంలో ప్రణయదంపతుల మధ్య ఎటువంటి అరమరికలు, దాగుడుమూతలు ఉండకూడదని ఇందలి అంతరార్థం. పరమార్థం కూడ.

ప్ర: ఎంతో సువాసన ఉండే మొగలి, సంపెగ పుష్పాలను పూజలలో వాడకూడదంటారు. నిజమేనా? ఎందుకని?

**– మాధురి,** హైదరాబాద్

జ: ఆది మధ్యాంత రహితుడైన శివుని విషయంలో అసత్యమాడినందు వల్ల మొగలి పూలకు పూజార్హత లేదని ఐతిహ్యం. సంపెంగలలో బంగారు రంగుతో ఉండే పూలను పూజకు ఉపయోగిస్తారు. ©

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**పి.సి. సుజాత శాస్త్రి**

ఇం. నెం. 26-28-65/5,
ఎ.టి. అగ్రహారం, గుంటూరు
పిన్: 522004

## చతురంగం -20 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 స | మ్మ | 2 తి | | 3 కు | 4 సా | | 5 ర్రి | త్రి | 6 మూ |
| మం | | 7 వా | ణి | | 8 గ | డ | ప | | ల |
| 9 తా | 10 ప | సి | | 11 కీ | రం | | 12 న | 13 ద | ము |
| | లు | | 14 వే | ట | | 15 పా | 16 వ | నం | |
| 17 స | గ | 18 ము | | 19 కం | 20 ట | కం | | 21 క | 22 ప్ప |
| ర | | 23 పృ | 24 అ | | పా | | 25 డు | ల | క |
| 26 దా | 27 వా | | 28 ల్ల | క | | 29 గు | లు | అ | |
| | 30 త | 31 ప | ము | | 32 అ | ర | కు | | 33 వ |
| 34 గ | | త్రి | | 35 త | | 36 జా | న | 37 ప | దం |
| 38 ద | గా | | 39 బె | జ | వా | డ | | 40 దం | తి |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. వి. శ్రీలక్ష్మి, నల్లకుంట, 2. మద్దూరి లక్ష్మీరాజ్యం, ఎర్రగడ్డ, 3. అవ్వారి సామ్రాజ్య లక్ష్మి, హైదరాబాద్, 4. యల్లాప్రగడ కృష్ణ మూర్తి, అలకాపురి, హైదరాబాద్, 5. మాది రాజు లక్ష్మి, విద్యానగర్, హైదరాబాద్, 6. ధరణికోట శివరామప్రసాద్, బోరబండ, 7. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్, హైదరాబాద్, 8. కె.వి.కె. రవీంద్రనాథ్, న్యూ నల్లకుంట,9. ఉపద్రష్ట నరసింహమూర్తి, లాలాపేట, 10. నోముల సురేందరరావు,హబ్సిగూడ, 11. తల్లాప్రగడ మధుసూదనరావు, బెంగళూరు, 12. బి. సత్యనారాయణ, కొత్తగూడెం, 13. లకిరెడ్డి చంద్రకళ, నూజివీడు, 14. ఐ. రేవతి, హైదరాబాద్, 15. ఎం. వసంత, బోరబండ, 16. డా. శివభూషణం, కర్నూలు, 17. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 18. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 19. కె. నాగభూషణం, మౌలాలి, 20. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 21. అత్తిలి కస్తూరిబాయి, తిరుపతి, 22. టి. హేమలత, మచిలీపట్నం, 23. బి. ప్రభాకర్, విజయవాడ, 24. ఎన్. ఆర్.ఆర్. మూర్తి, హైదరాబాద్, 25. పి.ఆర్. నాయుడు, తిరుపతి, 26. అవధానం రంగనాథం, బెంగళూరు, 27. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 28. ఎన్.వి.హెచ్. కల్యాణి, మీర్‌పేట్, 29. తూములూరుసత్యనారాయణ మూర్తి, ఖమ్మం, 30. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 31. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, 32. కె. కృష్ణయ్య, కల్వకుర్తి, 33. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 34. యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ, 35. బందా శ్రీనివాసరావు, చందానగర్, 36. అంబటి వెంకట శివారెడ్డి, యర్రగుంట్ల, కడప జిల్లా, 37. డి.వి. కామేశ్వరి, విశాఖ, 38. దారా హరితాశ్రీనివాస్, తిరుపతి, 39. ఎస్.ఎస్. పిళ్లై, తిరుపతి, 40. వెల్ముల రాంరెడ్డి, పూడూరు, కరీంనగర్ జిల్లా, 41. కె. గురుప్రసాద్, విజయవాడ, 42. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, 43. ఎన్. యశోద, న్యూ బోయిన్ పల్లి, 44. కాశీపట్నపు వి.ఎస్.ఎన్.మూర్తి, విశాఖపట్నం, 45. పి.బి. సీతాదేవి, నరసాపురం, 46. పాములపాటి ధన లక్ష్మి, నందిగుంట, నెల్లూరు జిల్లా, 47. చుండూరు అప్పల నరసింహం, బాచుపల్లి, 48. ఎం.వి.జె. శర్మ, అర్సవిల్లి, 49. ధప్పూరి శ్రీధరాచార్యులు, సీతారాంబాగ్, 50. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 51. పి.వి. రవికుమార్, తిరుపతి, 52. ఎం.ఎస్.ఎస్. దేవి, మచిలీపట్నం, 53. చక్రాల మురళిమోహన్, అనంతపురం, 54. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 55. కొండుపర్తి వేంకట జగన్నాథదాస్, సికింద్రాబాద్, 56. కరణం శివానందరావు, బెంగళూరు, 57. సి. గిరిజా శంకరరావు, ఎ.ఎస్. రావు నగర్, 58. పి. కృష్ణారావు, హైదరాబాద్, 59. తల్లాప్రగడ భాస్కరరావు, న్యూ నల్లకుంట, 60. ఎం. రామచంద్రరావు, హిల్‌కాలనీ, నల్గొండ జిల్లా, 61. వనం వేంకటేశ్వర్లు, నెల్లూరు, 62. ఎన్. సంధ్యారాణి, ఎల్.బి. నగర్, 63. బందెల శ్రీనాథ్‌బాబు, వుయ్యూరు, 64. ఇ.ఎల్. నరసింహారావు, మధిర, 65. ఎన్. విజయలక్ష్మి, ఒంగోలు, 66. జి. బ్రహ్మానందం, శేరిలింగంపల్లి, 67. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 68. ఇందన మల్లిఖార్జునరావు, ఏలూరు, 69. తోకల విష్ణువర్ధన్, గుంటూరు, 70. వాసా కృష్ణప్రసాద్, తగరపువలస, విశాఖ జిల్లా, 71. గేదెల రామారావు, ఏలూరు, 72. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 73. నార్నె మౌనికాచౌదరి, గుంటూరు, 74. సి.హెచ్. సాలమన్, ఆర్.ఎస్. కొండాపురం, కడప జిల్లా, 75. కె. భానుమతీదేవి, వనస్థలిపురం, 76. బైరప నేని వెంకటపతి, గుంటూరు, 77. పి. రాజేశ్వర్, సంగారెడ్డి, 78. పి. పద్మశ్రీ, అనంతపురం, 79. సి. ఉమాబాల, దోమలగూడ, 80. పి. మనోజ్‌శశాంక్, వనస్థలిపురం, 81. సూరినాగరాజు, రామవరప్పాడు, కృష్ణాజిల్లా, 82. వాన పల్లి వెంకటసత్య గంగరాజు, విశాఖ, 83. కరణం సత్యనారాయణ, చెట్టుపల్లి, విశాఖ జిల్లా, 84. కరణం వరప్రసాద్, చెట్టుపల్లి, విశాఖజిల్లా, 85. సి. విజయభాస్కర్‌రెడ్డి, ప్రొద్దుటూరు, 86. ఆర్. రామలక్ష్మి, మాదాపూర్, 87. యు.యు.యు. ఎమ్మిగనూరు, 88. రాయిడి భవానీదేవి, గుంటూరు, 89. సాధనాల పద్మారమేష్, విజయవాడ,90. దుప్పల రవికుమార్,టెక్కలి, 91. నండూరి నాగేశ్వరరావు, బేగంపేట, 92. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, 93. జి. సౌజన్య, కవుతరం, కృష్ణాజిల్లా, 94. సౌదామినీ నాగరాజన్, విశాఖపట్నం, 95. కాల్వవెంకటేశ్వరరావు, గోపాలపురం, నల్గొండ జిల్లా, 96. ఆండ్ర అచ్యుతరామయ్య, తణుకు, 97. ఎన్.కె. ఆరవెల్లి, మహారాష్ట్ర, 98. ఎ.వి. రత్నాచారి, సింగరాయకొండ, ప్రకాశం జిల్లా, 99. ఎస్. అబ్దుల్ అజీజ్, వనపర్తి, 100. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, 101. నల్లపనేని కోటేశ్వరరావు, టి. అగ్రహారం, నెల్లూరు జిల్లా, 102. పిశిపాటి శైలజ, నవులూరు, గుంటూరు జిల్లా, 103. కె. మీన, దొడ్డిపల్లి, చిత్తూరు జిల్లా, 104. కె.ఇ. నిలమంగై, ఈస్ట్ ఆనందబాగ్.

# చతురంగం - 21 ఆధారాలు

**అడ్డం**

1. శ్రీశ్రీ ఇంటి పేరు (3)
3. ప్రముఖ కథా రచయిత దీక్షితులుగారి ఇంటిపేరు (2)
4. రోజుకు ఇరవై నాలుగు... (3)
6. వేడెక్కు, నీళ్లు కాచే పాత్ర (2)
7. బావిలోంచి నీళ్లు తోడుకునేది (2)
8. పసిబిడ్డ, అమ్మాయి (2)
9. సంస్కృత భాష, దేవతల భాష (5)
12. పడక, పార్శ్వం (2)
13. వంకర (2)
14. మహారాజు, ఈనెల 'విపుల' 'కథకుల ఫైల్'లోని కథ (3)
15. దారం, తాళి (2)
16. గుంపు, సమూహం (2)
17. అల్లు అర్జున్ చిత్రం.. అటునుంచి (3)
18. పట్టణము (4)
20. వ్యవహారం, ఆర్భాటం..'మాయాబజార్'లో రమణారెడ్డి ఊతపదం (3)
22. కొయ్యను కోసే పరికరం (2)
24. నమస్కారము, కర్ర (3)
26. నిప్పు పుట్టించే రాయి (4)
31. మొక్కలకు కొత్తగా వచ్చే లేత ఆకులు (6)
33. రెండు, జత (2)
34. చతురంగం బల్లమీద ఉండే నలుపు తెలుపు చతురస్రం, హద్దు (2)
35. శ్మశానం.. అటునుంచి (2)

**నిలువు**

1. ప్రారంభం (3)
2. వర్ణం (2)
3. చెల్లాచెదురు (6)
4. వెదురు వంటివాటితో అల్లిన పెద్దబుట్ట (2)
5. లోపించిన (2)
7. కందలాంటి ఒక రకం కూర దుంప (2)
8. చేయి (2)
9. జ్యేష్ఠ సోదరి (2)
10. బలుపు కాదు – – (2)
11. ఇంద్రుడి ఏనుగు (4)
12. ఆకు, కాగితం (2)
14. వాయువు (4)
15. వరాహం (3)
16. శుభం (4)
19. సంతోషం (2)
21. చందనం, వాసన (2)
23. ధోవతి (2)
25. అనుష్కతో నాగార్జున నటించిన తాజా చిత్రం (4)
27. 'చతుర' ఆగస్టు 2012 సంచికలో ప్రచురించిన వి. లక్ష్మీనాగేశ్వర్ నవల (2)
28. వివిధ రకాల పదార్థాలు చేర్చి చేసిన వంటకం (3)
29. మహేష్‌బాబు సూపర్‌హిట్ చిత్రం (3)
30. ఏనుగు (2)
32. పాదం, పాతిక భాగం.. కింద నుంచి (2)

**నిబంధనలు**

✦ చతురంగాన్ని అదేపేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు ★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 21

రూ.150/- బహుమతి

గడువు తేది : డిసెంబరు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | ■ | 3 | | ■ | 4 | | 5 |
| 6 | | ■ | 7 | | ■ | 8 | | ■ | |
| | ■ | 9 | మ | | 10 | | ■ | 11 | ■ |
| ■ | 12 | | ■ | 13 | | ■ | 14 | | |
| 15 | | ■ | 16 | | ■ | 17 | | | ■ |
| | ■ | 18 | | | 19 | ■ | 20 | | 21 |
| 22 | 23 | ■ | | ■ | 24 దం | 25 | | ■ | |
| ■ | 26 చె | 27 | | 28 | ■ | | ■ | 29 | ■ |
| 30 | ■ | | ■ | 31 చి | | | | | 32 |
| 33 | | ■ | 34 | | ■ | | ■ | 35 | |

పంపినవారి పేరు: ---------------------------------------------

వయసు (    ) చిరునామా : ---------------------------------

---------------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : ---------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 48



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 17

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@eenadu.net

ఈ శీర్షికకు ఈ సంచికతో నాలుగేళ్లు పూర్తయ్యాయి.
ఆదరించిన పాఠకులకు కృతజ్ఞతలు. దీనిని ఇంతటితో ముగిస్తున్నాం.

## కాప్షన్ మీదే -47

ఉత్తమ వ్యాఖ్య :

ద్వాపరయుగంలో చెట్లు జాస్తి.. నాడు కూల్చాను
కలియుగంలో చెట్లు నాస్తి.. అందుకే 'ట్రెండ్' మార్చాను

– ఎం.లీల, కృష్ణ మందిర్ రోడ్, బెల్లంపల్లి



బాగున్న మరికొన్ని కాప్షన్లు :

కత్తెర వాడితే ఇలాగ
మా శాపం తీరేది ఎలాగ?

– తటవర్తి రామకృష్ణ
తాళ్ళగడ్డ, హైదరాబాద్

మ్రానుల్ని గూల్చితే..'విముక్తి'
మోకును కత్తిరించడం 'యుక్తి'

– వెల్ముల రాంరెడ్డి
పూడూరు, కరీంనగర్ జిల్లా

ఈ కూసింత దానికి
నా మేజిక్ ఎందుకు?
ఈ జిమ్మిక్ చాలదూ!

– ధరణికోట శివరాం ప్రసాద్
బోరబండ, హైదరాబాద్

వృక్షో రక్షతి రక్షితః
కాబట్టే ఈ కటింగ్!

– బొనుగు ప్రభావతి
అలకాపురి, హైదరాబాద్

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2012-2014 RNI/32186/78



